# కన్న పుద్దొంగ

గ్రంథకర్త:

పిల్లలమఱ్ఱి గోపాలకృష్ణయ్యగారు





పబ్లిషర్సు
కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు
శ్రీ సత్యనారాయణ బుక్ డిపో
రాజమండ్రి.
1955



[వెల రు 1—0—0

2

రాజమహేంద్రవరమున
శ్రీ కొండపల్లి ముద్రాశాలయందు
ముద్రింపఁబడియె

# కన్నపుదొంగ



## మొదటి ప్రకరణము

పౌర్ణమినాటి పండువెన్నెల నేత్రపర్వ మొనర్చుచుండెను. రాజవోలు నుండి ధారాపురముపోవు విశాలమగు బాట నిశ్శబ్దముగ నుండెను. దారికిరువైపుల విచ్చలవిడిగఁ బెరిగియున్న యున్నతవృక్షములును, ముండ్లపొదలును నిద్రించుచున్నట్లు నిశ్చలముగ నుండెను. పిండియారఁబోసినట్లున్న వెన్నెలయందు వాని చిత్రాకారములపూర్వములై భయము గొలుపుచుండెను. వాని పైభాగములు మాత్రము తెల్లని పూతఁ పూయఁబడి క్రింద గొన్ని నల్లనిముద్దలవలెను, గొన్ని పొదలు పొదలుగను గనుపట్టుచుండెను. సమయము శాంతమై భీకరమై మనస్సునకొకవిధమగు జంకు కలిగింపఁజాలియుండెను.

నేను రాజవోలునుండి వచ్చుచుంటిని. నాయనుభవము లోనికి వచ్చిన యీ చరిత్రయంతయు నామూలముగనే మీరు వినఁబోవుచుండుటచే నన్నుగుఱించి స్వల్పముగఁ జెప్పకొనవలసియున్నది. ఇది కేవలము నాసంతోషము కొఱకే కాక మీకు మిక్కిలి ముఖ్యమైనది. 'నేను, నేను' అని యాద్యంతము చెప్పుచున్న నేనెవఁడనో మీరు బాగుగ దెలిసికొనున్న

నెట్లు? కావునఁ జనువరులారా! విని నాదోషముల మన్నింపుఁడు. కథ ప్రారంభించునప్పటియున్న స్థితిగతులవి. నాపేరు వెంకట్రావు, నాకు 'పోలీసు సబ్ ఇన్ స్పెక్టరు' పని. నాతండ్రి గతించెను. తల్లి జీవించియున్నది. నాకిరువదియైదేండ్ల వయస్సు. చిన్నతనమునుండియు ధారాపురములోనే మేము వాసముచేయుచుంటిమి. కాని నాపదునాఱవయేట మాతండ్రి కాలముచేసి నప్పుడు రాజవోలు పోయి మామేనమామగారి యింట్లో మా యమ్మతోఁగూడ నెనిమిదేండ్లుండి మరల సంవత్సరమునుండియు ధారాపురమున నొక యద్దె యింటియందుంటిమి. మాస్వంతగృహము మమ్మివేయువలసి వచ్చెను. ఇప్పుడు నేను పదినెలల సెలవుమీఁద నింటియొద్ద నున్నాను. అయిదేండ్ల క్రిందట నా చెల్లెలు మరణించెను. మాతల్లికిఁ గూఁతులును, గొడుకులును నేనే. మిగిలినవిషయములు క్రమక్రమముగాఁ దెలియును. నామిత్రులను జాగ్రతగా వినుమని ప్రార్థించుచు నిఁక జరిగిన విశేషములు, అద్భుతములు, ఘోరములు వరుసగా జెప్పెదను.

విలాసార్థము మా మేనమామగారి యింటికేగి నేను వర్ణింపఁబోవుచున్న పౌర్ణమినాఁడు రాత్రి ధారాపురము తిరిగి వచ్చుచుంటిని. భోజనముచేసి పొమ్మని రాజవోలులో నాబంధుగులు బలవంతముచేసిరి. తరువాత నొక స్నేహితుఁడు కన్పడి యొకింత కాలము సంభాషించెను. కాఁబట్టి నేను రాజవోలులో బయలుదేరునప్పటికే పదిగంటలు దాటియుండెను.

వెన్నెలకాస్తున నుల్లాసకరముగా నుండుననియు, నడుమవల సిన దూరము మూడు క్రోశములు మాత్రమే కనుకను నేనొంటరిగా రాధారివెంట నడచి వచ్చుచుంటిని.

ధారాపురమునకు వెయ్యిగజము లదూరమునకు వచ్చితిని. కొలందిదూరమునఁ బురము వెన్నెలలోఁ బ్రకాశించుచుండె. ఎక్కడ మనుష్యసంచారము లేదు. చెట్లయాకులు కదలుట లేదు. పొదలు పాపపుంజములవలె నల్లగా భీతిపుట్టించుచుండెను. నిర్మలనీలాకాశమునఁ బోఁతపోసిన వెండిపళ్ళెరమురీతి నిందుచంద్రుఁడు ప్రకాశించుచుండెను. గాలికూడ జలనము మానెను. ఆప్రశాంతిగంభీర మనోహరణమునఁ బ్రకృతియంతయు గాఢసుషుప్తి నుండు మేను మఱచెను.

ఆకస్మికముగా నున్నటులుండి, నేలనుండి పుట్టినట్లిద్దరు మనుజులు నడిబాటలో నా యెదుట నిలువఁబడిరి. పరధ్యానమున వచ్చుచున్న నేను లిక్కిపడితిని. ఒక్కమారుగ శరీరము గగుర్పొడిచెను. సహజముగ నేను స్వల్పవిషయములకు భయపడు స్వభావము కలవాఁడనుగాను. కాని యా నిశీథసమయమున నట్టిపాటుగ నా యెదుట నిలువున నిలిచిన యామనుజులఁ జూచి యొక్కింత జంకితి. కాని యదియైన నొకక్షణము మాత్రమే. ముహూర్తమాత్రములో నాధైర్యము తిరిగివచ్చెను. వెంటనే వారు దారిదోపిడికాండ్రని యూహించి నావృత్తి కవమానము రాకుండ వారిముందు నిర్భయముగా నిలిచితిని.

"అయ్యో! త్రోవలో మీకెచ్చటనైన నొక స్త్రీ యొంటరిగాఁ గన్పడెనా!" అని వారిలో నొకఁడు నన్నడిగెను. ఏమి ప్రశ్న ? నాకాశ్చర్యము జనించెను. అట్టి నడిరేయి యొక స్త్రీ యొంటరిగా నాబాటయందేల యుండును? ఆమె యెవతె ? ఆమెను వీరేమిచేసెదరు ? అను ననుమానములు తెప్పపాటుకాలములో నాకుఁ గలిగెను. ఆతనికంఠస్వరము వికృతముగ నుండెను. నేనింకను నాప్రశ్నవైచిత్ర్యమును గూర్చియే యోచించుచుంటిని 'ఏమి కనుపడలేదా?' అని మొకటి యాతఁడే మరల నడిగెను. నేను యోచనచాలించి "కనుపట్టలేదు" అని చెప్పితిని. వారొకరిముఖమొకరు చూచుకొనిరి. ఆచూపులు నాకు సహించలేదు. నేను వారివైపు చూచుట మానలేను. ఇరువురును దీర్ఘకాయులు. శరీరములు చాపనచాయగా నున్నట్లు మొగముల బట్టి చెప్పవచ్చును. ఇర్వురికిని రమారమి ముప్పది వత్సరముల ప్రాయ మున్నట్లు నాకుఁ దోఁచెను. వారివదనములు బాగుగఁ జూచుటకు నాకవకాశము లేకపోయెను. ఒక్కక్షణకాల మొండొరులఁ జూచుకొని వారొక్కమారుగ నావైపు తిరిగిరి. అయినను పెద్దతలపాగలవలన వారిముఖములు బాగుగఁ నాకుఁ గన్పట్టలేదు. మొదట మాటాడిన పురుషుఁడే మరలఁ బలుకరించెను. "చూచినఁ జెప్పుము. సందేహింపవద్దు. మేమామె కేమపకారము చేయము" అని యాతఁడనెను. ఆతని వికృతకంఠస్వరము వాక్యము లబద్ధము

లని నొక్కి చెప్పుచుండెను. ఆస్త్రీ వీరికంటఁబడకుండ దేవుని మనసులోఁ బ్రార్థించితిని. వారుభయులును నావంక తీవ్రముగఁ జూచుచుండిరి.

"నాకెట్టిస్త్రీయు నగపడలేదు. నిజము" అని నేను స్ఫుటముగఁ బ్రత్యుత్తర మిచ్చితిని. వారింకను సంశయము నివారితమైనట్లు కన్పట్టలేదు. మఱియొకమారు వారన్యోన్యావలోకనము గావించుకొనిరి. వారినేత్రము లేమి మాటాడుకొనునో కాని వారి పెదవులు మాత్రము లేశమైనను దెరువబడలేదు. "నీమాటను నమ్మితిమి" అని మొదటి యాతఁడే చెప్పెను. వారు తత్క్షణము గిరుక్కున మరల్చి బాట ప్రక్కకేగి పొదలమాటున నిముసములో నదృశ్యమైరి. ఎంత యత్నించి చూచినను వారెటుచనిరో నాకుఁ దెలియవచ్చినది కాదు. ఎంత చిత్రముగా వచ్చిరో యంత చిత్రముగా మాత్రము పోయిరి. నేను మరల నొంటరిగఁ బండువెన్నెలలో బాటమధ్య నిలిచియుంటిని. మరల నడక యారంభించితిని. నామనసు పరిపరివిధములఁ బోవుచుండెను. ఆపురుషులెవ్వరు? అర్ధరాత్రంబున నీరీతిఁ దిరుగుచున్న యాస్త్రీ యెవ్వతె? ఆమెను వీరేల వెదకుచుండిరి? చూడఁజూడ వారిచర్య మిక్కిలి యనుమానాస్పదముగఁ గోచరించెను. కాని నేనేమి చేయఁగలను? భగవంతుడా! పాపమా యబల నీ యమకింకరుల బారినుండి తప్పింపుమని

నేను మఱియొకసారి సర్వేశ్వరుని వేడికొంటిని. నా యను గులు తిన్నగా సాగుటలేదు, తిరిగి తిరిగి యాయిరువురు మనుజుల దీర్ఘకాయములే నాకన్నులఁ గట్టినట్లగపడఁ దొడఁగెను. యోచించినకొలఁదిని వింత యెక్కువ కాజొచ్చెను. నేను వారంతర్ధానమైనవైపునఁ జూచితిని వారిజాడ లేదు. ఎచటఁ జూచినను నిర్జనము, నడిరాత్రి, పండువెన్నెల. నాభ్రమయా లేక సత్యముగా నేనట్టి పురుషులఁ జూచితినా? భ్రమ యెట్లగును? వారిలో నొకని కంఠస్వరమింకను నా వీనులలోఁ బ్రతిధ్వనులిచ్చుచుఁ గర్కశముగా వినవచ్చుచున్నట్లుండెను. "ఎచ్చటనైన నొక స్త్రీ ఒంటరిగాఁ గన్పడెనా?" అని యాతఁ డింకను నడుగుచున్నట్లే యుండెను. వారొకరి వదనము నొకరు చూచుకొనుచున్నట్లే నాకు దోచెను. వారు దొంగలా? కావచ్చును, దారిపోవువాండ్రు కారనిమాత్రము నా కూహ జనించెను. కారణము నేను చెప్పజాలను ఇట్లనేక విధములగు చిత్రాలోచనములో మునిగి యడుగులో నడుగు వైచుచు నేను చనుచున్న సమయమున "టంగుటంగు"మని ధారాపురము కచ్చేరిలోని గంటలు స్పష్టముగా వినవచ్చెను. నేను యోచన చాలించి వానిని లెక్కపెట్టితిని. పండ్రెండు సరిగా నర్ధరాత్రమయ్యెను. పైకి జూచితిని. చంద్రమామ నడినెత్తిపై నుండెను. నానీడ రెండు పాదములమధ్య నిముడ్చుకొని యుండెను. గంటలాగిపోయిన కొలఁది కాలము వఱకును సడి యింకను వినఁబడుచున్నట్లె యుండెను. ఒంటరిగానున్న వేళ

నెట్టి వింత యాలోచనలోఁ బోవుచుండును. ఆగంటల మ్రోఁతయు దాస్త్రీ మృత్యునాదము నాకు వినవచ్చుచున్నట్లు పొడకట్టును. ఆ యోజనకు నాలోనాకు నవ్వు వచ్చెను. ఇట్లూహించుచు ధారాపుర శ్మశానభూమి డాసితిని.

రుద్రభూమి రాధారికిఁ దూర్పుప్రక్కనుండెను. అది యించుమించుగా బాట నానుకొనియుండెను. మిగిలినవాని యందుకంటె దీనిలో విశేషమేమన దీని పడమటివాద్దున ననఁగా బాట తూర్పుఅంచున నొక పెద్దజమ్మిచెట్టు కలదు. అది మిక్కిలి దట్టముగా నెత్తుగాఁ బెరిఁగి పలు గుబురులు గలిగి పగలే భయము గొలుపుచుండును. దానిమీఁద పిశాచములు భూతములు కొలువుదీఱియుండునని వదంతి యుంటచేఁ బ్రొద్దుగ్రుంకిన తరువాత నెట్టి ధైర్యస్థుఁడు నాప్రైపుల నొంటరిగ రాడు. చీఁకటి గుహావలెనున్న వానిప్రక్క నేను బాటలో నిలిచి యున్నప్పుడు నామన సెటులుండునో నేను వర్ణించినఁ దీఱదు. ఆ ప్రశాంతనిశీథమున స్మశానముప్రక్క నట్టి గుబురు జమ్మిముందు ఒంటరిగ నిలిచియున్నట్లు భావించుకొనుఁడు. మీ శరీరము పులకించుట లేదా? నాకు దయ్యములనిన నమ్మకము లేదు. ఎవరైన నట్టివానిని జూచితిమన్ని చెప్పునప్పుడు నేను పరిహాసము చేయుచుండెడి వాఁడను. ఒక్క దయ్యముతోడనో, భూతముతోడనో కొంతకాలము మాటాడ నభిలాష గలిగియున్నట్లు నేను నప్పుడు వారితో జెప్పుచుండెడి వాఁడను. అయిన నిప్పటిసమయమున రుద్ర

భూమి చెంత నాజమ్మిచెట్టు ముందు నిలిచినపుడు దయ్యములుండఁగూడదాయను సంశయ మెందువలననో నాకుఁ గలిగెను. వెంటనే యాజమ్మిచెట్టు పిశాచముల కొలువు కూటము కావచ్చునను నమ్మకము పుట్టెను. ఇట్టి వింత యూహలకు నేను స్వాగతముగ నవ్వుకొంటిని. అయినను నా మనసున నట్టి యోచన లుద్భవించుట మానలేదు. అప్రయత్నముగ నేనా శమీవృక్షమువైపు చూచితిని. నాగుండెలు జల్లుమనెను. శరీరము నఖశిఖపర్యంతము వడకెను. మేన దట్టముగఁ జెమటలు పోసెను. కనులు మిఱుమిట్లు గొలిపెను. నిజముగునా? దైవమా! అథవా కారమేమి? జమ్మిచెట్టు నీడలో మ్రాను నానుకొని నన్ను దేఱపాఱఁ జూచుచు జుట్టు విరియఁబోసికొనిన యొక తెల్లని స్త్రీయాకారముగ నిలచియుండెను.

మిత్రులారా! మీగుండెలు దడదడఁగొట్టుకొనుట లేదా? మీలోఁ గొందఱు కెవ్వనఁ గేకవైచియుందురు. నేనును మీయట్టి మనుష్యమాత్రుఁడనే. కాని ధైర్యము తూలినప్పుడు క్షణములోఁ జిక్కఁబట్టఁగలను. నిజము చెప్పుచున్నాను. నేను జడిసికొంటిని. ఆయిరువురు మనుజులఁ జూచినప్పుడు నాకు దీనిలో సగము భయమైనను కలుగలేదు. అది నిజముగ దయ్యమేయైన భయపడిన నాకుఁ జావుతప్పదని నేనెఱుఁగుదును. కాని సాధారణస్త్రీయైన? నాకు నిముసములో నొక యనుమానముపుట్టెను. అప్పుడు కనఁబడిన స్త్రీ యీమె కాఁగూడదా? అయిన నిట్టి శ్మశానముకడఁ, నిట్టి

జమ్మిచెట్టుక్రింద, శిరోజములు విరియఁబోసికొని నిర్భయముగా నేటికి నిలిచియుండును. ఎట్లు నిలువఁగలుగును ! నా ధైర్యమంతయు సాహసము దెచ్చుకొని యాశ్వేతాకృతివంక నేకదృష్టిగఁ జూచితిని.

విస్తారము వర్ణన యనవసరము. ఆవ్యక్తి కుంతలములు పిఱుఁదులక్రిందికి వ్రేలాడుచుండెను. అది తెల్లనిచీరె ధరించి యుండెను. స్త్రీయైన మంచిరూపవతి యనుటకు సందేహము లేదు. వయస్సు ఇరువది సంవత్సరములో, నింక నొకటి రెండేండ్లెక్కువయో యుండును. శరీరమున నాభరణము లేవియు లేవు. ముఖము గంభీరముగా నుండెను, వీనియన్నిటికేమిగాని యాచూపు యావాడిచూపెట్టి దృఢమానసుఁడునైన గజగజ వణకింపఁజాలియుండెను. ఆమెనుండి నేను నాచూపు మరల్పఁజాలనైతిని. నాదృష్టి యామె యధీనమై పోయెను. పులియెదుటి కుందేలురీతి నేనును కదల్పఁజాలక యామెనొకేతీరునఁ జూచుచు నట్టే నిలువఁబడియుంటిని.

---

## రెండవ ప్రకరణము

ఆ నిశ్శబ్దము భయంకరముగ నుండెను. రెండు నిముసములు గడచుటనుక నావ్యక్తి నన్నట్లే తీక్ష్ణముగఁ జూచుచుండెను. ఆస్త్రీవదనమున భయచిహ్నము లేవియుఁ గాన

రాకపోవుట నాపురుషులు వెదకిన దీమెకొఱకను సందియము నశింపఁ జొచ్చెను. అదియుఁగాక వారంతకుముందే యటు వచ్చి యుండవలయును. ఈమె వారినెట్లు కనుమొఱగించెను? ఇట్టి యూహలనుండి యామె చిత్రకంఠస్వరము నన్ను మేలుకొలిపెను..

"వెంకటరావ్ ! నీవు ధీరుఁడవని స్పష్టమైనది. ఇఁక నిన్ను నమ్మగలను" అని గంభీరముగా నన్ను సంబోధించెను.

ఇదేమి చిత్రము! ఈమెకు నాపేరెట్లు తెలియును. నే నామెను జూచి యెఱుగను. నాయాశ్చర్యమునకు మేర లేక పోయెను. నన్ను ధైర్యగుణమునందుఁ బరీక్షచేసెగాఁబోలు? నన్నామె నమ్మునఁట. ఏవిషయమునందు? అయ్యో! నన్ను బాల్యమునం దెఱిఁగినవారికిఁ గూడ గుర్తింప వీలులేనంత నేను మాఱియున్నానా!" అని ఆమె నిట్టూర్పు నిగిడించెను.

నాకు వింత యినుమడించెను. నేనామెను చిన్నతనము నుండి యెఱుఁగుదునా? కంఠస్వరమైనను వినిన జ్ఞాపకము లేదే? దానికేమి, దుఃఖము వలన నాకారమును గొంతుక నవ్వడియు మార్పునొంది యుండవచ్చును. నాసందేహముల దృఢపఱచుకొనుట కామెవదనము మఱింతజాగ్రత్తగఁ బరి శీలించితిని. అది విచారగ్రస్తమై దీనముగ నుండి జాలి గొలుపుచుండెను. ఇప్పుడట గంభీరభావము లేదు. "ఏమి? నన్ను జప్తికిఁ దెచ్చుకొనఁ బ్రయత్నించుచుంటివా ?" అని యామె దీనముగా నవ్వుచు నడిగెను.

ఆమె నాహృదయమందలి యాలోచన లన్నియుఁ దెలిసికొనఁ జాలినట్లుండెను. నేనట్లు నమ్మితిని. తుదకు నాయాశ్చర్య మాపఁజాలక 'అవును. నీవెవరో నాకు జ్ఞాపకము లేదు. ఏ పేరేమి ? నేను నిన్నెట్లెరుగుదును ?' అని యామెను బ్రశ్నలువైచితిని. ఆమె మఱలఁ జిఱునవ్వు నవ్వెను. దాని యర్థము నామెకుఁ దెలియవచ్చినది కాదు. ఆమె చర్యలు వాక్యములు చిత్రముగ నుండెను. "నీయభిప్రాయమేమి ?" అని నేను మరల నడిగితిని.

ఆమె పెదవులపై వ్రేలుంచి నిశ్శబ్దము సూచించెను. నేనామె యాజ్ఞకు బద్ధుఁడనైతిని. దానినిమీఱు శక్తి నాకు లేకపోయెను. "ఇది క్షేమకరమైన స్థలముగాదు సాహసుఁడవేని, దీనుల రక్షించువాఁడవేని, నా—అది యటుండ నిచ్చి రమ్ము" అని యామె నన్ను తీవ్రముగాఁజూచి యచటి నుండి బయలు వెడలెను.

ఆమెను వెంబడింతునా, వలదాయను సంశయ మొక్క క్షణకాలము నన్ను బాధించెను. నిజముగా నామె దయ్యమేమో? ఇదివరకు దయ్యములు మనుజుల నిట్లే మోసగించి యెందో తీసికొనిపోయి చంపివైచినట్లు కథలు గలవు. ఎందువలననో కాని నా కాభయము మాత్రము పూర్తిగా నశించి పోయెను. ఆమె వాక్యము లట్టి భీతిని నిర్మూలించెను. కాని యామెకు నేనేయు సాహాయ్యమేమో కనుఁగొనవ నా కోర

పెద్దకోరిక గలిగెను. ఇనుపముక్క వలె నేనామెను వెంబడించితిని.

పాట వినవలసివచ్చెను. ఆమె పొదలచాటుగ నడువఁ దొడగెను. ఆమెగూఢవర్తనము చూడ నాపురుషులకేఁ దెలియబడుచున్న దీమెయేదైయుండవచ్చునని మరల నొక భ్రమ నాకుఁ గలిగెను. ఈవిషయమే దీర్ఘముగా నాలోచించుచు. నామె నన్నెట్లెఱుంగునో యని వింతజెందుచు నామె యడుగులలో నడుగులువైచుచు నామెను నిశ్శబ్దముగా ననువర్తించుచుంటిని. మెఱపుతీగవలె నామె మోహనాకారము నాముందు జలించుచుఁ జనుచుండెను. ఆశిరోజ మేఘములు వెన్నెలలో నీలకాంతులవలె నీనుచుండెను. ఆ స్త్రీ సాహసము నన్ను విభ్రాంతి వహింపజేసెను. కొలఁది దూరముపోయి ఆమె హఠాత్తుగా వెనుకకు మరలి యాగెను. నేనునుతక్షణమే నిలిచితిని. ఆమె నన్ను మరలఁ దీవ్రముగ వీక్షించెను. నేను మూకీభావము వహించి యామెను సుందరవదనమును, నీలోజ్జ్వలనేత్రములను గమనించుచుంటిని.

“ఆపురుషులిద్దరు నన్ను గుఱించి నిన్నేమడిగిరి ?” అని యామె మరల వింతగా మాటాడెను.

నాకున్న లేశ మనుమానమును సమసెను. వారు వెదకుచున్న దీమెకొరకే యనుట స్పష్టమాయెను. కాని యీధీరురాలు వారినెట్లు తప్పించుకొనెను ? నేను వారును

మాటాడుచుండుట యెచ్చటనుండి పరికించుచుండెను ?

"మేము మాటాడుట నీ వెట్లు చూచితివి ? అప్పు డెచ్చట నుంటివి?" నేనామెను మాఱుప్రశ్న వైచితిని.

విసుగు సూచించుచు నామె కుడికాలు నేలపై గట్టిగా దట్టెను. "అనవసరప్రశ్నలేల? చెప్పరాదా ?" అని తొందరగా నన్ను హెచ్చరించెను.

నేను కొలదిగ వింత గనపరచితిని. ఆమె యేమి తలంచెనో కాని మిక్కిలి మృదువుగ "చెప్పుము" అనెను.

అమృతప్రవాహమువలెఁ జల్లగనున్న యామెమంజుల స్వరమువిని నేను పైప్రశ్నలకు సిగ్గుచెందితిని. ఆమె నెదు రడుగ గూడదని నిశ్చయించుకొంటిని. "క్రోటనులో నక్కడ నెవ నొకస్త్రీ నొంటరిగఁ జూచితివా?" అని గ్రుచ్చి యడిగి రసి యా జవ్వనికి సమాధానము చెప్పితిని.

"అంతమాత్రమేనా ?"

'అంతే'

ఆమె వికటముగా నవ్వెను. అంతకు [illegible] మనోహరముగా దోచిన యామె వదనము వికృతమై పోయెను. ఆమె ముఖము త్రిప్పి మరల నవ్వ జొచ్చెను. స్నిగ్ధదర్పణముఁబోలు నామె ముఖమునందలి చిత్రమార్పు లకు వింత చెందుచునే నామెను మరల ననుసరించితిని.

పోయిపోయి యామెయొక సుందరమగు రహస్యప్రదేశమున నాగెను. అచట నొక పెద్దమామిడిచెట్టు కలదు. దానిక్రిందఁ బెద్ద నల్లనినీడ వలయాకారముగ నుండెను. మామిడిమ్రాను నీడమధ్య నొడ స్తంభమువలెఁ దోఁచుచుండెను. ఈచెట్టునకుఁ జుట్టు మూఁడువైపుల నీత పొదలల్లిబిల్లిగ నుండెను. ఒక ప్రక్కమాత్రము బయలుగాంచెను. అది దక్షిణదిశ. మేమట్టే ప్రవేశించి చెట్టునీడలోకి వచ్చితిమి. అచ్చట నొక పెద్ద రాతిబండ కానవచ్చెను. ఆసుందరి యాస్థలమునకుఁ జిరపరిచితురాలిరీతి నాబండపై నాసీనయాయెను. నేను నాలుగడుగులు వెనకకువైచి వెన్నెలలోఁ జెట్టు నీడకును, బొదలకు నడుమ నొక మంచిచోటఁ గూర్చుంటిని. ఆమె కొంతకాలము పలుకలేదు. ప్రసంగ మారంభించుటకు విధానముతోఁచక నేను నూరకుంటిని. మొదట నామెయే పలుకరించెను. "నీవు నన్నిప్పటికిని గురుతింప జాలవా?" అని నావైపు నొకవిధముగఁ జూచుచు నామె నన్నడిగెను.

ప్రత్యుత్తరము సిద్ధముగ నేయుండును. అయినను మగుడ నొక్కమారెంతయో జాగ్రత్తగా నామె యాకారమువంకఁ దిలకించితిని. కాని యట్టి తరుణి నెచ్చటను జూచినట్లు నాకు స్ఫురణకు రాలేదు. 'గుర్తింప జాలను, నీపేరు చెప్పుము. తెలియునేమో చూచెదను' అని వచించితిని.

'పేరు చెప్పినను నాయందలి మార్పువలన నీవు గుర్తింపలేకపోయెదు?' అని యామె నావైపు వాఁడిగాఁ జూచుచుండెను.

'యత్నించెదను—చెప్పను'

ఆసుందరి నావదనము క్రిందుగురితిః జూచుచు మృదువుగ 'అయిన వినుము, నాపేరు పద్మలత' అనెను.

నిర్మలాకాశమునుండి మేఘములు లేకుండ నాముందట్టి పిడుగెట్లుపడెను? నాచెవులకేమైన మత్తుకలిగెనా లేక నిక్కముగా నామె తనపేరు 'పద్మలత' యని వచించెనా? నా శరీరమున నొకవిధమగు నూతన భయము బయలుదేరెను. ఆమె నిక్కముగా దయ్యమే స్త్రీకాదని నాకు నమ్మకము పుట్టెను. ఎనిమిది దేండ్లక్రిందట జారిపోయిన పద్మలత యెట్లు సజీవయై యుండుట సంభవించును! ఉండిన నిన్ని సంవత్సరములవఱకేల ధారాపురమునరాదు? ఆమె పండ్రెండవయేట హాలీబానుదందు జనిపోయినదని యామె పినతండ్రియేల వెక్కివెక్కి యేడ్చును? బాల్యమునుండియు నాయొక్క ప్రాణముగ నున్న పద్మలత నన్నుదక్క నింకొకరిని బెండ్లియాడనని ప్రతిన పట్టిన నారత్నము—ఇంతకాలము—ఎనిమిది దీర్ఘవత్సరములు—నన్నువిడిచి యెందుండును? ఏలయుండును—శుద్ధాబద్ధము.

ఆదయ్యపువాక్యములు నేను లేశమును విశ్వసింపలేను. పద్మలత యను పేరుచ్చరించి యామె నా నదుకటిప్రేమ యంతయు జ్ఞప్తికిఁ దెచ్చి నాయందు ద్వేషశతము చేసెను. అంతకంటె నాయుచ్చారణవలన ఫలము నాకేమియు నగపడలేదు. అయినను నీమె యెవ్వతె? తనపేరు పద్మలతయని యేల

చెప్పుకొనును? పద్మలత పోలిక నాకు విస్తారముగఁ—గొలఁది గఁగూడ నీమె చెంత గాన్పించుటలేదు. కంఠస్వరముకూడ నట్లు లేనే లేదు. ఏమి చేయుటకును జెప్పుటకును దోఁచక నేను విభ్రమమొంది యట్లే నిశ్చలముగఁ గూర్చుంటిని.

వెనుకటిసారివలె నామె హృదయస్థితాలోచనల నాముఖమందలి మార్పులంబట్టి కనుగొనెను. విచారముతోఁ దలయూచుచు నామె 'నిజముగానే నంతమారిపోతినా? ఎనిమిది సంవత్సరముల కఠిన కారాగారము నన్ను నాప్రియుఁడు సహితము గుర్తింపలేకుండఁ జేసివైచెనా?' అని మెల్లగా ననెను. ఆమె కనుగొలకులనుండి బాష్పములు చెక్కుల మీఁదిగ దొరలి యంకపీఠమునఁ బడఁజొచ్చెను.

ఈమాటలు మాత్ర మత్యద్భుతముగా నుండెను. నా పేరామె కెట్లు తెలియును? నన్ను 'ప్రియుఁ' డని యేల చెప్పును. ఈమె నిజముగా నా వెనుకటి మోహదేవత పద్మలతయా? అయిన నింత నిండుమార్పా? ఎనిమిది సంవత్సరములు కారాగృహములో—కఠిన కారాగృహములో నీమె నెవరుంచిరి?— అయిన శరీరము చిక్కలేదు. ఈగోడేమి ఒకదానికొకటి యసందర్భముగ నుండెను. నాకుఁ దిక్కుతోఁచదాయెను. అప్పటికిని నేనామెను నమ్మలేక—సమ్మ్రజాలనైతిని.

'ఇంకను సందేహించుచుంటివా? నా పంట్రెండవయేట మాతల్లికి జబ్బుగానుండి మేము ధారాపురమునకు వైద్యుని

కొంటెను హాలీబాను పోవునాఁటి సాయంకాలము మూమేడపై నే నేమ్చుచుండ—నీవు ముద్దాడిన పద్మలతనుగానా నేను?' అని యామె యొక్క మధుర విషయము జ్ఞప్తికిఁ దెచ్చుచుఁ బ్రచండ నిదర్శనము చూపెను.

ఒక్కొక్క దృష్టాంతము వినినకొలఁదిని నాయను మానము కొలఁదిగఁ గొలఁదిగఁ దగ్గిపోవుచుండెను. ఆమెను గడసారి చూచిననాఁటి సాయంసమయము నాకన్నులఁ గట్టి నట్లుండెను. అయినను నాహృదయమామె పద్మలత కాదని నొక్కి చెప్పుచున్నట్లుండెను

నేను మరల మాటాడకముందు పీ యామె తన చేతి వ్రేలినుండి యొక యుంగరముతీసి నాముందుఁ బడవైచెను. నేను దానిని వెన్నెలలోఁ బరీక్షించితిని. వెంటనే ముద్దాడితిని. అది నాప్రియురాలి యంగుళీయక మకుట నిర్వివాదాంశము. నేను దానిని బాగుగా నెఱుఁగుదును.

'వెంకటరావ్! ఇఁక నన్ను తలఁచకుము, లేనిపోని యనుమానములు వద్దు. ఇంకను సంశయమున్న రంగూను నుండి మాపినతండ్రి నాపేర వ్రాయుచు వచ్చినయుత్తరముల కట్ట యిదిగో' అనుచు నామె యొక చిన్నకట్ట విసరి నాముందు పడవేసెను. నేను దాని నందికొంటిని, కాని విప్పిచూడ లేను. నాకు రవంతకూడ సంశయము లేకుండఁబోయెను. ఉంగర మును, నుత్తరములకట్టయు నామెకుఁ దిరిగి యిచ్చితిని. 'నా

కిఁక ననుమానము లేదు. రాత్రియగుటచే నిన్ను బాగుగా గుర్తింప జాలనైతిని. నీవుచూపిన నిదర్శనము లద్వితీయములు; ఇఁక నాప్రశ్నలకుఁ బ్రత్యుత్తరములిమ్ము' అని నేను పలికితిని.

ఆ జవ్వని ముఖపద్మము వికసించెను. నాకును సంతసము కలిగెను.

'అడుగుము' అని యామె యనెను.

'ఎనిమిదేండ్లక్రిందట రంగూను నుండి తిరిగివచ్చిన మీ పినతండ్రి నీవు హాలీబాదులో మరణించినట్లేల వదంతి పుట్టించెను?'

ఆమె కన్నులెఱ్ఱబాఱెను. ఆనీడలో నవి మెఱయఁ జొచ్చెను. 'ఇతఁడు నా నిజమైన పినతండ్రి గాఁడు. ఎవఁడో మోసకాఁడు. టక్కరి—పచ్చిదొంగ !' అని యఱచుచు నామె యాకస్మికముగా నాసనముపైనుండి పండ్లు పటపట కొఱుకుచు లేచెను.

నాకాశ్చర్యము కలిగెను. ఒక యద్భుతము బయలుదేఱుచుండెను! ఎనిమిదేండ్లనుండియు ధారాపురములో నున్న పురుషుఁడీమె పినతండ్రి కాఁడా ? ఈమెకుఁ బిచ్చి యెత్తెనా? ఇది యంతయు బూటకమా?

నాకు యోచించుకొనుట కవకాశము లేకపోయెను. ఆతరుణి కెవ్వున కేకవైచి 'వాఁడే ! వాఁడే! చూఁడుమా!' అని నావెనుకవైపుఁ జూపెను. మఱుక్షణములో నొకపాద లంఘించి యామె పరుగిడఁ జొచ్చెను.

తేచి నేను వెనుకకుఁ దిరిగితిని. అచ్చటఁ దలపాగను పెట్టికొని యిరువురు పురుషులు నిలిచియుండిరి. నేను నోరు మెదల్పకమునుపే వారిలో నొకఁడు చేయినెత్తి బలము కొలఁది నాముఖముపై గ్రుద్దెను. నేను ప్రక్కకు జరిగితిని; కాని దెబ్బ బాగుగఁ గణతపైఁ దగిలెను. నాకుఁ బిచ్చియెత్తి నట్లాయెను. కనులు తిరుగఁజొచ్చెను. అప్రయత్నముగ నాతని నొక గ్రుద్దు గ్రుద్ది యొక క్షణకాలము నిలిచి చూచితిని. వారు నన్ను గమనించుటలేదు. పొదను దుమికి వారును బరుగెత్తుచుండిరి. దూరమున నా స్త్రీయాకారము పలాయన మొనర్చుచుండెను. నేను వారి ననుసరింపఁబోయి చెట్టునీడలో జారిప్రక్క స్పృహతప్పి పడిపోతిని.

---

## మూఁడవ ప్రకరణము

నాకుఁ దెలివివచ్చి కన్నులు విచ్చి చూచునప్పటికి జుట్టునుఁ [illegible]టిగ నుండెను. జరిగిన సంగతులు నాకు సుంతయు [illegible]ట్టు మొదట జ్ఞాపకమునకురాలేదు. నే నెచట నుంటినో నాకుఁ దెలియకపోయెను. రాజవోలులో మా మామగారి గృహమున నున్నట్లు భావించుకొంటిని. వెంటనే నేను ప్రయాణము బయలుదేఱిన విషయము జ్ఞప్తికి వచ్చెను తరువాతఁ గ్రమక్రమముగా నిర్వురు పురుషులగపడుట,

వారితో సంభాషణ జమ్మిచెట్టునీడలో నొక స్త్రీయాకార మును సందర్శించుట, యామెతో ప్రసంగించుట, పురుషులతోఁ బోరాటము స్మృతికివచ్చెను. నేను చుట్టుప్రక్కలఁ జూచితిని. పైకిఁ దిలకించితిని ఎటుచూచినను చీకటిగ నుండెను. వెన్నెలకొఱకు వెదకితిని. ఆస్త్రీతో నదికూడఁ బలాయనమొనర్చినట్లు నాకుఁ దోఁచెను.

కొంచెము యత్నముమీఁద లేచి కూర్చుంటిని. కణత మిక్కిలి నొప్పిగా నుండెను; సూదులతోఁ గ్రుచ్చినట్లు పోట్లు పొడుచుచుండెను శిరము చేతులతోఁ బట్టుకొని యాబాధను దాఁచుకొన యత్నించితిని. కొలఁదిసేపటికది స్వల్పముగ నిమ్మళించెను. నేనొక పెద్దచెట్టునీడలోఁ గూర్చుండియుంటిని. అది మామిడిచెట్టని తెలిసికొంటిని. "పద్మలత" యని చెప్పుకొనిన యాజవ్వని కూర్చున్నచోటిని చేతులతోఁ దడవి దానినానుకొని సేదదీర్చుకొనుచుఁ బరిపరివిధముల యోజించుకొనఁ దొడఁగితి.

జరిగిన సంగతులన్నియుఁ గలకాదని నిశ్చయమాయెను. అంతదనుక మేఘములచాటుననున్న చంద్రుడు వెలికివచ్చెను. మరలఁ బ్రకృతి నవ్వినట్లాయెను. ప్రొద్దు చూచితి. మూడుగంటలు గావచ్చునని తలంచితిని. లేచి ధారాపుర మేఁగ నెంచితినిగాని శరీరములోఁ దగు శక్తి రాలేదు; అందుచే నచ్చటఁ గూర్చుండవలసి వచ్చెను. ఊహించుకొనినఁ జిత్రముగఁ గన్పట్టెను. రాజవోలునుండి బయలుదేఱి నప్పుడిన్నిసంగతులు జరుగుననియు, రాత్రి

జరుగునని యు, రాత్రి మూడుగంటలకాలమందొంటరిగ నే వల్లకాటిసరసనో మామిడిచెట్లనీడలో పద్మలతచే దాచినాను కొని కూర్చుండుదునని యు నేను కలనైన తలచితినా? కాని దైవఘటన యట్టిది నిముసమునకు రాబోవు సంగతి యెవరు చెప్పగలరు.

ముఖ్యముగ నా ప్రాణములు కాపాడిన సర్వేశ్వరునికి హృదయపూర్వక వందనము లాచరించితిని. తరువాత నాస్త్రీ సమాచార మేమాయెనో యనువిషయము నన్ను మిక్కిలి బాధింపజొచ్చెను. వారామెను బట్టుకొని యుందురా? తప్ప కుండ నా తరుణి వీరిచేతఁ బడియుండునని నేను నమ్మితిని. వారామె విరోధులని వారిచర్య చెప్పకయే చెప్పుచుండెను. కావున నిజముగా నామె పద్మలతయేనా? ఆమెను బట్టుకొన వచ్చినవారిలో నామె "టక్కరి" పినతండ్రి యుండెనా? రెండవ పురుషుని బాగుగ గుర్తింపగలనను ధైర్యమున్నది. కాని మొదటివానిని నేను సరిగా గమనింప నవకాశము లేక పోయెను. ఇప్పుడు విచారించి యేమి ప్రయోజనము?

మరలఁ బద్మలత యపాయము నాకుస్ఫురణకు వచ్చెను. ఆమె వాక్యముల యందవిశ్వాసముంచుట తప్పని భావించి తిని. ఆమె చూపినవిదర్శనముల నింకను సంశయింపవచ్చునా? ఆమె పడిన బహుకష్టములవలన నామె యాకారకంఠస్వర ములు మారెను. అవిషయము నాకిప్పుడెంత యాశ్చర్యముగ

దోఁచుటలేదు. నాప్రియురాలు బ్రదికియుండి, నాతో సంభాషించి, నాసాయముకోరెను. ఆసంతోషము తలఁచుకొనిన నాకు సగము బలమువచ్చినట్లుండెను. నాప్రాణప్రియకొరకై నాప్రాణములఁ ద్యజింప నిశ్చయించుకొంటిని.

కాని యామె సురక్షితముగనున్నఁగదా? వారామె నేమి చేసియుండిరో నామనసున నొకవిధమగు సందేహ ముద్భవించెను. ''మోసగాఁడు-టక్కరి-పచ్చిదొంగ'' అని యామె యఱచినవిషయము నాకు జ్ఞప్తికివచ్చెను. ఆపురుషుల తీరు చూడ వారిట్లు సంబోధింపఁబడుటకుఁ దగినవారని చెప్పవచ్చును. వారితో నెట్లు జోక్యము కలుగఁ జేసికొనవలయునో నాకుఁ దోఁచఁలేదు. ఇవన్నియుఁ బక్కలత జీవించియుండిన గఁదా? ఆవిషయమై దైవముపై భారమువైచితిని. కష్టములన్నియు నెట్లో తరించి యాసుందరినిఁ జేపట్టినట్లు నాలో నేను సుఖదినముల భావించుకొంటిని. ఇట్టి యోచనలన్నియు క్షణభంగురములే.

నాయాశలు మిక్కిలి వ్యర్థములని నాకు సావధానముగ తెలియవచ్చెను. ఈచూరు పద్మలతను వారు విడువరనియు, నామె ప్రాణములు తీయుదురనియు, ఒకవేళ బ్రదుకనిచ్చిన నింక నెట్టి కఠిన కారాగృహములోఁ బెట్టుదురో యనియు నామె జాడలు దీయుట యసంభవమనియు నాకుఁ దోఁచెను. దుఃఖకరములగు నాలోచనల రావద్దనిన పోవునా? సుఖకరము

లగునవి వచ్చి యస్లె యుండునా? నేనింత కంటె విశదముగఁ జెప్పఁజాలను. పద్మలత జీవించు ననియొకింత కాలము, వారామెను హత్యచేయుదురని యొకింత కాలము, నట్లయిన వారి నీజన్మలో విడువనని ఘోరశపథములతోఁ బుచ్చితిని. ఏది యెట్లయిన నీచిత్రచర్యకు సంపూర్ణాము తెలియువఱకు నాప్రయత్నములు మాననని దాటరానిప్రతినఁబట్టితిని.

యోచించి యోచించి నాకు మఱల శిరోవేదన మారంభ మాయెను. గృహముచేరి సావధానముగఁ జూడవచ్చునని యెంచి యప్పటి కాలోచన చాలించి లేచి నిలువఁబడితిని. దేహమునకింకను సంపూర్ణశక్తి కలుగ లేదు. మెల్లగా నామామిడి చెట్టుక్రిందనుండి బయలుదేఱి, చుట్టునున్న పొదలలో దక్షిణపు వైపుననున్న మార్గముగుండ నడచి యడుగులు తడఁబడ మరల బాటఁజేరి దానిమధ్య నొంటరిగ నిలువఁబడితిని. అంతకు ముందొకమారు నేనట్లె యొక్కఁడను నిలిచితిని. అప్పటికిని నిప్పటికిని నెంతమార్పుగలదు? ఈవ్యవధానములో నెన్ని సంగతులు జరిగెను? అప్పుడు నేను నిశ్చింతగా రాడవోలునుండి యాడుచు బాడుచు బలవంతుఁడనై వచ్చుచుంటిని ఇప్పుడు! అనేక చిత్రములు కన్నులారఁ దిలకించి, శక్తి కోలుపోయి నిస్సహాయుఁడనై బాటనడుమ నిలిచియుంటిని. ఆహా! విధికృతంబు నేమనవచ్చును?

ధారాపురమువఱకు నడువగలుగుదునాయని యనుమానించితిని. నా కాధైర్యము లేకపోయెను. ఒంక నిలిచి

లాభము గానక మెల్లగా నడుగులు వేయుచు బయలు వెడలితిని, కొంతదూరమువఱకుఁ బ్రయాణము కష్టతరముగాఁ దోఁచెను. కాని పురము సమీపించినకొలఁదిని నాయాయాసము నశింపఁజొచ్చెను. చల్లనిగాలి వీవఁజొచ్చెను ఆశైత్యోపచారములకుఁ గ్రాగుచున్న నాకణతలు కొంత సుఖము చెందఁ దొడఁగెను. శ్రమతగ్గినకొలఁది గమనము హెచ్చించితిని. కొంచెమునేపటికి మాయూరికి నుత్తరముననున్న చెఱువు చేరితిని. నిండుచంద్రికయందు దానిపై నిచిన్ని యలలు తళతళలాడుచుండెను.

అచట నొక ఱాతిబండపైఁ గొంత కాలము విశ్రమించితిని. విశాలమగు నాతటాక జలంబులపైనుండి వచ్చుగాలి నామనసు బడలినను బాపి జోకొట్టెను. చల్లని యానీటితోఁ గణతలు, ముఖముఁ బలుసారులు కడిగితిని. ఆయాసము గతించెను, శరీరములోఁ బ్రాణవచ్చెను. వేడిగానున్నవదనము తాపముడిగి శాంతించెను. కండ్లు చల్లపడెను. ఎట్టకేలకుఁ బూర్తిగా నీడ దేరితిని. హృదయమునకుఁ గుదుటగలిగెను. లేచి నడక హెచ్చించి ధారాపురము ప్రవేశించితిని.

మేమున్న గృహము చేరుటకు నడివీధిలోఁ గుండఁ బోవు యుక్తముల తిరుగవలసియుండెను. కావున నేను పెద్దబాజారు లోగుండ నడచుచు నిశ్శబ్దముగానున్న బాటకు నిరుపైపుల నున్న మేడలను మిద్దెలను గమనించుచుఁ జనుచుంటిని ఇంతలో నాప్రశాంతసమయభంగము గావించుచు గలగల లాడుచు నొకగుఱ్ఱపుబండి సవేగముగ వచ్చుచుండెను.

నేను కొంచెము తొలఁగి యావేళ నిర్వహ ప్రయాణము చేయుచుండిరా యని వింత జెంది, బండి నన్ను దాటిన తరువాత వెనుకనుండి దానిలోఁ జూచితిని. నడివీధి తూర్పుపడమరలుగ నుండెను. శకటము తూర్పుదెశవశిగాఁ బరుగెత్తుచుండెను. కావున బండి వెనుకభాగ మస్తగిరి చేరఁబోవుచున్న చంద్రుని వెన్నెల ప్రసరించి స్పష్టముగఁ గానవచ్చుచుండెను అందొక మనుజుఁడు సరిగాఁ జివర నాసీనుఁడై యుండెను. వెన్నెల యాతనిముఖముపై బడెను. నేనా భీకరవదనమును గుర్తించితిని. చూచినది క్షణముమాత్రమే యైనను నాదృష్టి యా చామనచాయ మొగమును బాగుగాఁ బరిశీలించెను నిముసములో నాయొడలు జలదరించెను. ఆరాత్రియే నాకు రెండుమారులు గన్పడిన యిద్దరు పురుషులలో నాతఁడు రెండవ యాతడు.

రెండవయాతఁడన నా యభిప్రాయము నాతో మాటాడని పురుషుఁడని వేఱ చెప్పనక్కఱ లేదు. ఆబండిలోఁ పద్మలత యున్నదని నాకు సంశయము జనించెను. బండియాపి పరీక్షచేయుటకు వీలులేదు. నాకధికారము లేదు. శకటమప్పుడే నూఱుగజములు దాటెను. ఎట్లయిన దానివెంబడించి యది యెచ్చట నాగునో కనుఁగొనవలయునని నాకుఁ జెప్పరాని యుద్రేకము కలిగెను. కాని యదియెట్లు సాధ్యమగును? చెంత మఱియొక బండి లేదు. నేను పరుగిడుస్థితిలో

లేను. ఉన్నను నట్లు పరుగెత్తుట భావ్యము కాదు. అది యపాయమునకు మూలమగును అచటనే నిలిచి కొంత యాలోచించితిని. ఎట్టకేలకొక చక్కనియుపాయము తట్టెను వెన్నెలలో నాబండి చారల వెంబడి పోవలయునని నిశ్చయించుకొంటిని. అంతకంటె గత్యంతరము తోఁచలేదు.

ఇఁక నాలసింపక యాశకటచక్రముల గుఱుతు ననుసరించి బయలుదేఱితిని. అట్లు కొంతదూరముపోయిన తరువాత బండియొక సందులోనికిఁ దిరిగినట్లు తెలియవచ్చెను. ఆసందులోఁ వెన్నెల ప్రసరించుటలేదు. అందువలన బండివాళ్ళు నాకుఁ గనుపట్టలేదు. మరల నేమిచేయుటకును దెలియక యటనాగితిని. ఇంతలో మరల గలగలమను మ్రోతపుట్టి యాబండి తిరిగి వచ్చుచున్నట్లు తెలిపెను. అది పోయిన దారిని వచ్చుటలేదు. నావెనుకగా మఱియొక సందులోనుండి యదిమిక్కిలి వేగముగా వచ్చుచుండెను. దానినొక గడ్డము సాహెబు తోలుచుండెను. నేను వెనుకకుఁదిరిగి బండియాపుమని కేకవైచితిని' కాని యాతడు నామాటలు కేకలు విననట్లె నటించుచు శకటము మఱింతవడిగాఁ దోలుచుండెను. బండి నాదగ్గఱకువచ్చెను. సాహెబాపునట్లులేదు.

"బండి ఆపుము" అని గొంతెత్తి పిలిచితిని.

బండివాఁడు వినిపించుకొనలేదు. మాఱుమాటాడకుండ శకటమును దోలుకొని పోవుచుండెను. బండినాపు వెఱవు

తోచక యచట నిలిచి శకటమును తేఱిపాఱఁ జూడఁజొచ్చితిని. అదినాకు లాభకారియాయెను. బండిపై 'లైసెన్సు సంఖ్య 154, అని బల్లపైన స్పష్టముగాఁ గానవచ్చెను. అది బాగుగా గమనించితిని. నాభయము తీఱెను. మనసు శాంతి చెందెను. తేపు వానిని బిలిపించి సావధానముగ నడుగగలనను ధైర్యము చెందితిని.

బండి దృష్టిపథము దాటినతరువాత నచటనుండిబయలుదేఱి మాయింటిదారి పట్టితిని. అచ్చటి కది యెంతో దూరములేదు. నేను పోవుచుండగా నైదు గంటలు కొట్టిరి. అంతకాలము గడచినందులకును నంతదనుక పద్మలత వారికిఁ జిక్కకుండినందులకును నింతతో నేను పలువిధముల యోచించుచు మెల్లగా గృహము చేరితిని. అచట మా యమ్మను లేపితిని. ఆమె నేనట్టి యసమయమున వచ్చుటకుఁ గారణమడుగుచు నాశ్చర్యము చెందజొచ్చెను. అంతకుముందే యామెకేమిసమాధానము చెప్పవలయునో సిద్ధముచేసి యుంచితిని. రాత్రిరాజవోలులో నొక స్నేహితునింటఁ గడపి తెల్లవారువేళ మూడుగంటలకు ధారాపురము బయలుదేరినట్లు చెప్పితిని. తరువాత గొన్ని కుశలప్రశ్నములైనతరువాతఁ బోయి శయనించితిని. కొంతసేపటిదనుక ననేకయూహలు కలవరపెట్ట దొడఁగెనుగాని యచిరకాలములో నే గాఢనిద్ర చెందితిని.

మఱునాఁడు నేను నిద్రలేచునప్పటికిఁ జాలప్రొద్దెక్కెను. రమారమి పది గంటలు కావచ్చుచుండెను. నేను శయ్యవీడి

వెలుపలికిఁ బోవనెంచుచు మేజాబల్లపై నొక చీటిఁ జూచితిని. ఆవ్రాత నేనిదివఱకెఱుఁగమి దానిని వెంటనే విచ్చి యాశ్చర్యముతోఁ జదివికొంటిని. అందిట్లుండెను,

'మీరు చాల శ్రమ చెందితిరి. వినినంతవఱకు సంతసించి యూరకుండుఁడు. ఇఁక ముందుఁ బ్రయత్నములు మీకు మహాపాయకరములు. అనవసర కార్యములలో జోక్యము కలిగించుకొనవద్దు. ఆమె మీరనుకొను స్త్రీ కాదు పిచ్చిది గ్రహించుకొని ముందు సంగతి చూడుఁడు.'

'జ. స.'

---

## నాలుగవ ప్రకరణము

చీటి చిత్రముగనే యుండెను. గాని వ్రాసినవారనుకొనినట్లు నన్నది భయపెట్టి నా యుద్యమమునుండి మరల్పజాలదాయెను. "జ. స" అను దస్కత్తు లేక దస్కత్తులు దొంగవని నాకుఁ దోఁచెను, అవి నిజమైనవియై యుండవచ్చుననియు నట్లు వ్రాసిన పురుషులు ధారాపురములో మారుపేరులతోఁ దిరుగుచున్నారనియు, వారొకయూహ పోయెను ఎట్లయిననేమి ప్రస్తుతమువి కనుగొనుట దుర్లభమని నాకుఁ దెలిసెను. ఆమె మీరనుకొనిన స్త్రీ కాదు" అను వాక్యము కేవలము నన్ను మోసపుచ్చుటకు వ్రాసినదని నేను క్షణ

ములో గ్రహించితిని. ఆమెమాటలు నేను పాటించకుండున ట్లామె పిచ్చిదని వ్రాసినని యోజించితిని. ఆమె పద్మలతయే యనియు నామె నెక్లేసుని మోసగించి నన్ను పిచ్చివానిని చేయుటకై వారిట్టి పన్నాగము పన్నినారని స్పష్టమాయెను. ఆమె వారిచేతఁ జిక్కినది లేనిది బండివానినడిగి తెలిసికొన వలసి యుండెను.

ఇంకఁ బను లారంభింపవలసిన సమయము వచ్చినది. మాయమ్మ పురములో నుండకున్న నాకు మిక్కిలి వీలు. అందుచే నామెను రాజవోలు పంపవలయునని నిశ్చయించు కొంటిని. మా మేనమామభార్య ప్రసవించుదినములు వచ్చు టచే మాతల్లిని బంపవలెనని మామామ మఱియుమఱియుఁ జెప్పెను. ఈమూలముగ మా యమ్మను నాఁటి సాయంకాల మున బండియంద [illegible]లు పంపివైచితిని. నేను ఒంటరిగ నుండుటకు బాగుగా నలవాటుపడినవాఁడ నగుటచే నామె నన్ను నిర్భయముగా విడిచివెళ్ళెను. మాతల్లివిషయమైన చింత దీఱిపోయెను.

తరువాత మాయింటిలోఁ బనిచేయుదాసిని బిలిచి చీటి బల్లమీఁద నుంచిన దెవరని యడిగితిని. "నేనే" న[illegible] యది బదులుచెప్పెను. ఎవ్వరిచ్చిరో యాసంగతి యంతయుఁ జెప్పు మంటిని. సూర్యోదయమునకుఁ బూర్వమే సుమా రిరువదియై దేండ్లస్త్రీ వచ్చి నేనున్నానేమో పేరడిగి, నిద్రించుచున్నా నని తెలిసి, యాచీటి యగత్యముగ చెప్పి, బల్లపైనుంచువెళ్ళె

చేసి వెడలిపోయెనని దాసి వచించెను. వచ్చినస్త్రీ సుందరి యనియు, పేరుచెప్ప లేదనియు, మేలిముసుగు సగము కప్పు కొనియుండెననియు, బండిలో వచ్చి, బండిలోఁ బోయెననియుఁ జెప్పి దాసి యరిగెను. ఆస్త్రీ యెవ్వతె? ఆయిరువురు పురుషులకు సంబంధించినదని విదితమాయెను. ఆమెసంగతి తరువాత విచారింపవలసి యుండెను.

ప్రప్రథమమున 'నంబరు 154' బండిసాహేబును బిలువబంచి విచారింపవలసి యుండెను. ధారాపురమునందలి పోలీసులను వారియుద్యోగస్థుల నెల్లర నేనెఱుఁగుదును. కావున నొక రక్షకభటునితో బండిసంఖ్య చెప్పి, బండివానిని దక్షణమే పిలిచికొని రమ్మని పంపితిని. ఆశఁ డరగంటలో నొక గడ్డము సాహేబును వెంటబెట్టుకొనివచ్చెను. పోలీసు వెడలిపోయెను. బండివాఁడు వంగి సలాముచేసి నిలువఁబడెను. ఆతనికి నలువదియేండ్లుండును—పొట్టివాఁడు. కండ్లెఱ్ఱగా ప్రకాశించుచుండెను.

నేను వానివైపు తిరిగి 'లైసెన్సు నెం 154' బండి నీదేనా? అని గంభీరముగా నడిగితిని.

"చిత్తము" అని యాతఁడు సవినయముగాఁ బ్రత్యుత్తరమిచ్చెను.

'రాత్రి నీవు తోలుకొనిపోయిన యిరువురు పురుషులను స్త్రీని ఎక్కడ దించితివి?' అని వెనుకముందాలోచింపకయే నట్లడిగి వాని మొగము పరీక్షించుచుంటిని. ఆకస్మి

కముగా నడుగఁబడిన యీప్రశ్న కాతనివదన మొకింత వెల్లఁబాఱెను. అతఁడు తడఁబడుచు 'ఏమనుష్యులు మహా రాజ్!'' అని విస్మయము సూచించెను.

నేను వాని నేకదృష్టిగఁ జూచుచుఁ నాకుఁ దెలియును. అబద్ధమాడకు ఝూట్ మత్ బోలో'' అని నిర్లక్ష్యముగా నంటిని.

ఆతండింకను సంశయించు చున్నట్లగపడెను.

''నీవు బండి తోలుకొనివెళ్ళుట, తిరిగివచ్చుట నేను చూచితిని. నేను నిన్నొకచోట నిలిచి కేకలువైచితిని. నీవు విననట్లు నటించుచు బండి విసురుగాఁ దోలుకొని వెళ్ళితివి. నేను నంబరు చూచితిని. తెలిసినదా ?'' అని గుర్తులు చెప్పితిని.

ఆతఁడేమియు మాటాడలేదు. ఏమియు నెఱుఁగనివానివలె నన్నూరక చూచుచుండెను.

బెదరింపులకుఁగాని లొంగఁడని తెలిసికొంటిని.

''అచ్చా! నీ పేరేమి?'' అని భీకరముగా నడిగి పుస్తకము పెన్సిలు తీసితిని.

''నాపేరు జాఫర్ అహమ్మదు'' అని చెప్పి యాతఁడు నాచర్యల గమనించుచు నింకేమియుఁ బలుకలేదు.

అతని పేరు, బండిసంఖ్య పుస్తకములో వ్రాసి మూసితిని. ''నీవు నాకుఁ జెప్పదలఁచుకొనలేదు, కావున నెళ్ళుము.

నే నెవరినో తెలియునా? నీకు 'సమనులు' వచ్చును. పొమ్ము. అలేకు మస్సలాం—జావ్'' అని కోపముగాఁ బలికితిని.

జాఫరహమ్మదు కొంచెము చీకాకుపడెను. "నా పేరెందుకు రాపించారండి నేనేంచేశాను ప్రుంది మారాజ్?'' అని వణకుచు నాతండడిగెను.

"నీవు బండిలోఁ దీసికొని పోయినవారి సంగతి నీకుఁ దెలిసినంతవఱకుఁ జెప్పితివేని నీమీఁద 'రిపోర్టు' చేయను. లేకపోతే కబడ్దార్!''

ఈ మాటలతరువాత నాతనికిఁ దప్పించుకొను తెఱవు తోఁచలేదు. అతఁడు విధేయుఁడై సలాముకొట్టి చెప్తానండి—ఈపితలాటకము నాకెందుకు? వాళ్ళు తమసంగతి చెప్పవద్దని లంచమిచ్చారు. అందువల్ల సందేహం కలిగింది'' అనెను.

నేను మెత్తపడినట్లగపడలేదు "ప్రొద్దున లేచిన మీ బండివాళ్ళకు మాపోలీసువారితో బని. మమ్మల్ని డబాయించ జూచెదవా?'' అని జరిగిన విషయము పూసగ్రుచ్చినట్లు చెప్పుమంటిని.

ఆతఁడు తనకు దెలిసినంతయుఁ జెప్పెను. ఆతనివాక్యములఁ బర్యవసానము నామిత్రులకుఁ జెప్పుచున్నాను రాత్రి నాలుగుగంటలకాలమందొక పురుషుఁడు బండ్లదొడ్డిదగ్గరకు వచ్చి బండికావలెనని పలికెను. జాఫరహమ్మదు మేలుకొనియుంటచే బండికట్టెను. అపుడు పురుషుఁడు జాఫరమహమ్మదుతో

"మా స్త్రీ ఒకతె మూర్ఛరోగము వలన నిచ్చటికి రెండు మైళ్ళదూరమున మూర్ఛపోయినది. అక్కడ మావాడున్నాడు. ఆమెను ఊరులోనికిఁ దీసికొని రావలయును" అని చెప్పెను. బండివాఁడును బురుషుడును వెళ్ళిరి. ఊరికిఁ బడమట నొక తాటితోపుదగ్గర మూర్ఛపోయిన స్త్రీయు నింకొక మనుష్యుడు నుండిరి. వారామెను బండిలోఁబెట్టి ధారాపురములోనికిఁ దీసికొని వచ్చిరి. ఆపురుషులొకచోట దిగి యాస్త్రీని దించిరి. వారిలోఁ గొంచెము చిన్నవాఁడామెను భుజములపై మోసెను. పెద్దవాఁడు జాఫరహామ్మదడిగినంత బాడుగ యిచ్చి పైన నొక యర్ధరూపాయి లంచమొసఁగి త్రోవలో నెవరు పిలిచిన నాగకుండ సరిగా దొడ్డిదగ్గరకుఁ దోలుకు పొమ్మని చెప్పెను. జాఫరహామ్మదట్లే చేసెను. నేను కేకలు వేయుట వినియు నాతఁడు బండి యాపలేదు. ఇంతకంటె నేమియు నెఱుఁగనని బండివాఁడు చెప్పెను.

ఆద్యంతము జాగ్రత్తగా విని "వారు దిగిన దేవీధిలో—ఎవరియింటిముందు?" అని యాతని నడిగితిని.

"కస్పావీధిలో దిగిరి. కాని దిగినయింటిలోనికి వారు పోలేదు. ఆస్త్రీ నెత్తుకొని నడచిపోయిరి. నేను బండి తిప్పుకొని వచ్చితిని"

నేను క్షణకాలము యోచించి "ఆ స్త్రీ నిజముగా మూర్ఛలో నున్నదా? లేక చనిపోయినదా?" అని యప్రయత్నముగా వానిని బ్రశ్నించితిని.

జాఫరహుస్సైను విస్మయమును భయమును బొందెను. తడంబడుచు నాతఁడు "ఎందుకు చచ్చిపోతుంది? మూర్ఛపోయి ఉంటుందండి" అని చెప్పెను.

ఒక యర్ధరూక నిచ్చి "మరలఁ బిలిచినప్పుడు వచ్చి సరిగా మాటాడుము" అని చెప్పితిని. ధనములో నున్న మహిమ వేఱె వర్ణించు టనవసరము. శిరము నేలదాక సలాముగొట్టి జాఫరహుస్సైను తొట్రుపాటుతో నిష్క్రమించెను.

ఆతడు వెడలిపోయిన తరువాత నామనసులోఁ బిచ్చి పిచ్చి యూహలు వొడమెను. పద్మలతనుఁ దఱిమితఱిమి యెట్టకేలకుఁ బట్టుకొని కొట్టి ప్రాణములు తీసిరని నమ్మితిని. ఆమె మూర్ఛపోయిన దనుమాట నాకు నచ్చలేదు. రెండు క్రూర వ్యాఘ్రములచేఁ దఱుమఁబడు లేడివలె నాసుందరి యాహంతకుల పాలాయెనని నిశ్చయించుకొంటిని. వెంటనే పోలీసులను దీసికొని వెళ్ళి పద్మలత పినతండ్రియగు వల్లభరావు గారి యిల్లు సోదా చేయించవలెనని తలచితిని. కాని వారామె నాయింటిలో నుంచరని నేనే సమాధానము చెప్పికొంటిని. పోనిమ్ము జాఫరహుస్సైను సాయముచే నాపురుషుల నధికారము వారికిఁ బట్టించుటకుఁ నేను వారిని గుర్తింపవచ్చును గాని, రాత్రి తన ప్రయాణీకులు వీరేయని బండివాడు నిరూపించుట యెట్లు?—అది పొసఁగదు. ఇంకను బాగుగ నిదర్శనములు దొఱకువఱకును బలవంతముగ నేనూరకుండవలసినదె. అంతకంటె నేనేమి చేయవలెను? వేఱుపాయము లేదు. హంతకులను

ప్రస్తుతము సంతసింపనిమ్ము. వారిదినము రాకపోదు. ఈలోపుగ నేను తొందరపడి చేయునది లేదు. వీధులవెంటను వల్లభరావుగారి యింటియొద్దను దిరుగుచుందును. ఆ యిద్ద రిలో నెవడైనఁ గనఁబడిన గుర్తించగలను. ఏమి సంగతులు జరుగునో చూడవలసియున్నది. అని భాషించితిని.

ప్రయత్నములు నాఁడే యారంభించితిని. సాయంకా లము నాలుగుగంటలవేళ వల్లభరావుగారి మేడయున్న 'కస్బా' వీధిఁ బ్రవేశించితిని. నాకు ముందుఁ గొద్దిదూరమున నా పెద్ద మేడ సుందరముగాఁ గానవచ్చెను. వెనుకఁ బద్మలత యందుఁ దలిదండ్రులతో నివసించియుండెను. నేనప్పుడక్కడను నిత్యము చనుచుండెడివాఁడను. ఇప్పుడెన్నియో మార్పులు జరిగెను. ఆ మేడ వల్లభరావుగారిక్రింద నుండెను. "అయిన నీతఁడు నిజముగాఁ బద్మలత పినతండ్రి కాఁడా? ఆమె నిన్న రాత్రి చెప్పినమాటలు నిజమేనా?—లేనిచో నాసుందరిని వీరేల తెచ్చి పట్టుకొందురు?" అని నేననుకొంటిని.

తప్పక పోలీసులను దీసికొనివెళ్ళి మాయిల్లు పరీక్షచే సినఁ బద్మలతయో యామె శవమో చిక్కునని మరల యోజనపోయెను. అయిన వారే యంత తెలివితక్కువవారా? వారిని గ్రిందటిరాత్రి నేను చూచియుండినవారు నన్ను చూచి యుండరా? చూచిరనుట నిశ్చయము లేకపోయిన జాఫర హమ్మదునకు లంచమిచ్చి యెవ్వరాపమన్న నాపక తోలు మనిపొమ్మని యేల వచింతురు? నేను బండి దిరిగిపోవుట

చూచి బండివానిని ప్రశ్నలు వేయుదురని వారికిఁ దెలియును. అదియుఁగాక వారు వల్లభరావుగారి యింటిముందు దిగనట్లు బండివాఁడు చెప్పెను. అదివఱకే యాలోచించి యుంచి వారామెశవము నెచ్చటికో చేరవేసియుందురు. పద్మలత చనిపోవుట నిశ్చయమైన నామె మృత్యువునకు వారు నాకు సమాధానము చెప్పకుండఁబోరని—పోనీయనని శపథ మూనితిని. 'పగ' యనునది నా హృదయమున రగులఁజొచ్చెను.

ఇట్లాలోచించుచుఁ బోవుచు నొక తములపాకుల యంగడియందొక పురుషుని జూచితిని. ఆముఖము! వేయి ముఖములయందు గుఱుతింపఁగలను. క్రిందటిరాత్రి కథానాయకులలో నాతఁడు రెండవయాతఁడు!

బాగుగాఁ జూచితిని. ఆతనికి త్రింశద్వర్షములుండును. పొడగరి, బలిష్ఠుఁడు. ముఖము గంభీరముగను భీకరముగను నుండెను. కఱకుమీసములు గలవు. కన్నులు జ్యోతులవలెఁ బ్రకాశించుచుండెను. ఎడమకణతపై నరకాని మేరఁ బుట్టుమచ్చయుండెను. అది నాకు మిగుల సహాయకారియని నాకుఁ దెలియుటచే దానిని బాగుగా గమనించితిని. మనుష్యునితీరు, చూపు హంతకుఁడని స్పష్టముగఁ జాటుచుండెను.

తములపాకులు తీసికొని యాతఁడు వెనుకకుఁ దిరిగి చూడకుండఁ దిన్నగా రైలుస్టేషనునకుఁ బోయెను. ఆలోచనలఁ గాలము వ్యర్థమొనర్పక నేనాతని విసురుగా వెంబడించి

తిని, సరిగా రైలువచ్చు వేళయాయెను. ఆతఁడు రాయపుర మునకు టిక్కెట్టు తీసికొనెను. లోపలికిఁ బోయెను. నేనును బోయిని రైలు వచ్చెను. ఆతఁడొక పెట్టెలో నెక్కెను. నేను దానిముందు నిలిచితిని. కొంచెము సేపటికి రైలు కదిలెను. పోవుచు బోవుచు నన్ను చూచి యాపురుషుఁడు వికట ముగాఁ బక్కున నవ్వెను.

ఆనవ్వు నాజన్మలో మఱవఁజాలను. అది పిశాచ హాసము వలె భయంకరముగ నుండెను !

---

## ఐదవ ప్రకరణము

వారము దినములు గడిచిపోయెను. ఈ లోపుగ విశేషములేవియు జరుగలేదు. రాజవోలులో మామేనమామ భార్య యింకను బ్రసవించలేదని తెలియవచ్చెను. కాఁబట్టి మాయమ్మయింకను గొన్నిదినములవఱకుఁ దిరిగివచ్చుటకు వీలు లేదు. ఇది నాకు మిక్కిలి సహాయకారియనుట నిస్సందేహము నేను చిక్కులఁ బడవలసివచ్చును. ఒక్కొక్క మారాకస్మిక కముగా గృహము విడిచి కొన్ని దినము లుండుట సంభవింప వచ్చును భోజనమునకు వేళకు రాకపోవుట; యొక్కొకసమ యమున నింటియొద్ద నిద్రించకుండుట నాకు పరమావసర మైన విషయములేకదా !

ఈ కాలమందు నేను పురములో నాపురుషుల జాడలు తీయుటకై ప్రయత్నములు చేయుట మానలేదు. ప్రతివీధి సంచరించుచుంటిని. ప్రతి మనుజుని జాగ్రత్తగా గమనించుచుంటిని. ముఖ్యముగాఁ బద్మలతగారి మేడచుట్టునుఁ దిరుగాడుచుంటిని. దానిలో నెవ్వరు మనుజులున్నట్లు నాకుఁ దోఁచలేదు. ఇప్పుడా మేడ పద్మలత పితతండ్రియగు వల్లభరావుగారి యధీనమునం దుండెనని చెప్పితినిగదా? ధారాపురములోఁ బ్రతివారునట్లె నమ్ముచుండిరి. నాకుఁ గనపడిన స్త్రీ యాతఁడు వల్లభరావు కాఁడనియు నొక మోసకాఁడనియు నొక్కి చెప్పెను. ఆపురుషుల చర్యలవలన నేను దానిని నమ్మితిని. కాని సత్యాసత్యములు మాత్రము భగవంతుని కెఱుక.

పద్మలతజాడగాని, మాయమైపోయి వచ్చి నాచేతికి చీటి యిచ్చిపోయిన యువతియగు దీర్ఘ స్త్రీజాడగాని నాకు దొరుకలేదు. ఆస్త్రీ యెవ్వరైయుండునా యని మరల బాగుగ నాలోచించితిని. ప్రస్తుతము వల్లభరావని చెప్పుకొనుచున్న యాతనికి భార్యయున్నట్లు తెలియవచ్చెను. బహుశః ఆమెయే యైయుండవలెను. భార్యాభర్త[illegible] కొయులఁ జూడరు అన్నగారు వదెన, వదినకూఁతురు [illegible] వలన వల్లభరావుగారు [illegible] మిత్రుఁడుగాఁడు, చూచుట మానివైచిరి [illegible]. అంతమాత్రమున నేమి? వల్లభరావు ధారాపురమునకు క్రొత్తవాఁడు. అన్న జీవించియున్నంత కాల మాతఁడు [illegible] బంధువులింటను [illegible],

భ్రాతృమరణకారముగ ధారాపురము తిరిగివచ్చి భ్రాతృత్వము గనుక మేడ వస్త్రీన మొనర్చుకొనెను. ఆతనికిఁ బురిలో స్నేహితులు లేరు. ఆతఁడు స్నేహాము చేసుకొనలేను ఆయన భార్యయునట్లే స్నేహితురాండ్రు లేక యుండెను.

మఱి రామపురంవెళ్ళిన పురుషుఁడెవఁడు? ఆతనికిని వల్లభరావునని చెప్పుకొనుచున్న యాతనికిని నేమి సంబంధము? బుద్ధిపోయినంతవఱ కేమియుఁ గన్పట్టదాయెను. ఇర్వురు ప్రాణస్నేహితులై యుండవలెను. అనఁగా నుభయులును తోడుదొంగలని నాయభిప్రాయము. వీరు జనులమోసగించి పద్మలతికను, నామెపినతండ్రికిని జెందవలసిన ద్రవ్యమాస్తిని సుఖముగా ననుభవించుచుండిరి. నాకుఁ బౌర్ణమినాడు జమ్మిచెట్టుదగ్గఱఁ గన్పడిన స్త్రీ పద్మలతయే యైన (అవిషయమింకను సంశయించుట యెట్లు? ఆమె హాలీబానుతోఁ జనిపోయినట్లు పుట్టినవదంతి యీమోసగాండ్ర కృత్యమనట విదితము)—నామె వాక్యములు నమ్మదగినవైన నీపురుషులద్భుతమైన మోసముచేసి యొకరికిఁ జెందు నాస్తిని వారిపేరు పెట్టుకొని దొరలవలెఁ దాననుభవించుచున్నారనుట నిర్ధారితము. ఈదొంగల నేమిచేసినఁజెల్లదు?

పద్మలతిజాడ లేశముసు దెలియరాలేను. ఆమెగుఱించి నాయాశలు రేగఁజొచ్చెను ఎనిమిదిసంవత్సరములనుండియు నీభువిపై లేదనుకొనుచున్న ప్రియురాలకస్మాత్తుగ సజీవమై

కనుపడి, తనకు జరిగిన మోసము చెప్పి, మరల నాదినముననే శత్రులపాలై ప్రాణములు కోల్పోయెనని తలంచుకొనినప్పుడు నాగుండియ లవియకుండుట యెట్లు? నేను బగదీర్చుకొనఁ బ్రతిన పూనకుంటయెట్లు? పద్మలతి జీవించియున్న నాజీవితకాల మంతయు వెదకియైన నాజాడ దీయయత్నింతును. ఆమె ప్రాణము లీహంతకుల పాలయిన విషయము నిశ్చయముగాఁ దెలిసిన నాకంఠమున జీవమున్నంతవఱకు వీరిని ప్రాణములతో విడువను. సర్వేశ్వరుఁడా సుందరి క్షేమ మరయుఁగాక

ఎడమకణతపైఁ బెద్ద పుట్టుమచ్చయున్న పురుషుఁడు రాయపుర మేలచనెనో యెంతియూహించినను నాకుఁ దెలియ వచ్చినదికాదు. అతని దాపురమే నేమో? ఏవిషయమైనను బాగుగా దెలియుటకై యాతఁడరిగిననాటినుండియు నేను రాయపురమునుండి రైల్బువచ్చువేళలకు సరిగా స్టేషనుచెంత నుండుచువచ్చితిని. పగలు పదిగంట కొకటియుల, నేడుగం టల కొకటియు, రాత్రినాలుగు గంటలకొకటియు, మూడు బండ్లవరుసలు రాయపురమునుండి ధారాపురము వచ్చుచుం డెడివి. ఈమూడువేళల నేను స్టేషనుదగ్గఱఁ దప్పకుండ నుండి తిని. కాని యీవారము దినములనుండియు నాతఁడు దిరిగి వచ్చినట్లు జాడలేదు. అతఁడు రాయపురముననో, లేక సమీపమున నేయూరియందో నివసించుచునని నేను నిశ్చయించు కొంటిని. అతఁడువచ్చుట సంభవింపదనుకొంటిని. పోవునాఁ

డాతఁడు నవ్విన వికటహాసమునందు నాకట్టి భావమే తోఁచెను. అయినను నేను స్టేషనున కేగుట మాన లేను.

వారము దినములు గడచిపోయెనని చెప్పితినిగదా! మరల నాదివారము వచ్చెను. క్రిందటి యాదివారమున నేను ధారాపురముబాటపై మామిడిచెట్టుక్రింద మూర్ఛిల్లియున్న వేళకే యీదినమున స్టేషనునొద్ద నొకబల్లపై నాసీనుఁడనై యావలించుచు, రైలురాక కెదురుచూచుచుంటిని ఆకాశ మున మేఘములు క్రమ్ముకొని యుండెను. నామనసువలెనే స్టేషను చీఁకటిగాను, సౌఖ్యహీనముగాఁ గన్పట్టెను. ఎచ్చట నోయొక దీపముమాత్రము వెలుగుచుండెను. నేనేమో యోజించుకొనుచుండఁగనే దీపములు వెలిగింపఁబడెను. నాకు ధైర్యము వచ్చెను. ఒకదినమున నాహృదయమునందలి గాఢాంధకారముకూడ నశించి విషయములెల్లను దేట తెల్లమగునని నేను భావించుకొంటిని. మఱి పది నిముసము లలోఁ పెద్దమ్రోతతో భూకంపమొనరించుచు బండి వచ్చెను నేను లేచి టక్కట్లు దీసికొనుస్థలమున నొక దీపస్తంభము క్రీ నీడలో గోడనానుకొని నిలిచి క్రమక్రమముగ వెలికేగు ప్రయాణీకులముఖములు జాగ్రత్తగఁ బరీక్షించుచుంటిని. కాని యాతఁడు వచ్చునను ధైర్యము నాకు లేదు. అయిదు నిముస ములలో జనులెల్లరు నిష్క్రమించిరి. అతఁడు కనుపడలేదు. నేననుకొనిన సంగతియే కాఁబట్టి నాకుఁ జిత్రముగ లేదు. నేను

నిలిచియున్నస్థలము విడువనెంచుచుంటిని. ఇంతలో నింకొక ప్రయాణీకుఁడు టిక్కట్టునిచ్చి వెలుపలి కేగెను. దీపము వెలుతురు ముందఱ నాకాముఖము విస్పష్టముగఁ గన్పట్టెను. ఎడమకణతపై బుట్టుమచ్చగల యాపురుషుని నిముసములో గుర్తించితిని;

క్షణములో నాకెచ్చటలేని శక్తివచ్చెను. నాప్రయత్నములు ఫలించెను. అతఁడు తిరిగిరానేవచ్చెను. కాబట్టి యాతఁడు రాయపురవాస్తవ్యుఁడు కాఁడు. నే నాలోచనలఁ జాలించి నాస్నేహితుఁడగు టిక్కెట్టుకలెక్టరును డాసి యాచివర టిక్కెట్టునాపురుషుని యడిగితిని. అతఁడు దానిని నాకిచ్చెను. దీపముముందు దానిని బాగుగాఁ బరిశీలించితిని. దానిపైన "చికనూరునుండి ధారాపురమునకు" అని స్పష్టముగ వ్రాసియుండెను. ఇదేమి చిత్రము! ఆపురుషుఁడు రాయపురముపోయి. మూడు స్టేషను లివ్వలనున్న చికనూరు తిరిగి వచ్చి యచ్చటనుండి ధారాపురమువచ్చెనా? చూడఁజూడ నన్ను మోసగించుటకై మొదటిదినమున రాయపురము టిక్కెట్టదీసికొనెనని తలఁచితిని. అతఁడు చికనూరులోనే దిగియుండును, టిక్కెట్టు నాస్నేహితునికి దిరిగి యిచ్చి నేను వెలుపలి కేగితిని.

నాహృదయమందుఁ బ్రతీకారభావము జ్వాలగనుండుచుండెను. పద్మబతికు—నాయాఅవప్రాణమునకే దుర్మార్గులు చేసిన మహాపాపకారము నను నిలువున దహించుచుండెను.

ఆమె ప్రేమప్రవాహమునఁబడి, యాపదలెంచక, నిద్రాహారములెంచక, వాహిని యిష్టమువచ్చినట్లు కొట్టుకొని పోవుచుంటిని.

---

# ఆరవ ప్రకరణము

నల్లనిపూఁత పూసినట్లున్న యాకాశమునందుఁ గారుమేఘములు మదపుటేనుఁగులరీతి విచ్చలవిడి సంచారములు సల్పుచు ప్రచండ ఘీంకారము లొనర్చుచుండెను. వాయువుప్రసురుగ వీఁచఁదొడఁగెను. దృష్టి భేదింపఁజాలని గాఢాంధకారము జగమును గప్పివైచెను. మిన్ను మన్నేకమై పోయెను. దూరమున మెఱపులు తళుక్కుమని మెఱసి క్షణములో మహాత మోరాశియందు లీనమై పోవుచుండెను. భూమి దద్దరిల్లునట్లుఱుములు భీషణారావములతో గర్జించుచుండెను. ఆ నల్లని మబ్బులలోఁ దెల్లని విద్యుల్లత మృత్యుదేవతావికటహాసము వలెనుండెను. ప్రకృతి చెలరేగెను. పెద్దగాలివాన వచ్చుచున్నట్లు తోఁచెను.

ప్రయాణీకులు బట్టలగట్టించుకొని త్వరత్వరగా నెక్కియాపెనుచీఁకటిలో నదృశ్యమైపోవుచుండిరి, శకటములు గలగలలాడుచు నెచటికో దొరలి పోవుచుండెను. మెఱుగుడు

పురుగులవలెఁ గొన్నిదీపము లానలుపులో మినుకుమినుకు లాడుచుఁ గొలఁదికాలమగపడి యంతర్ధాన మగుచుండెను. బండిమనుష్యులకేకలు, హెచ్చరికలు, ఈలలు కొంతసేపు వినఁబడి, క్రమక్రమముగఁ దగ్గి, యంతలో మేఘగర్జనల మయమై పోవుచుండెను. ఆసమయమున గంటలువినవచ్చెను సన్నని ఈలమ్రోగెను. ఒక్కకూఁతవైచి రైలుబండి బయలు దేఱెను. ఆ మహాంధకారమున నొక పెద్దదీపములపంక్తివలె నదికనుపట్టెను. "ఇంజన్" పై వెలుఁగునఁ గాన్పించుఘూమ ముతో గబగబమను మ్రోఁతతో బండి నిముషములో దృష్టిపథము దాటిపోయెను.

నేను స్టేషను వెలికేఁగుడెంచి దృష్టిసారించి చూచితిని. ఎటుచూచినను గాఢచీకటి. నాకేమియు గనుపట్టలేదు. బళ్ళన్నియు వెడలిపోయిన తరువాతఁ జకజక నడచుచు బాట వెంట నొంటరిగా బయలుదేఱితిని. నాకుఁ గాన్పించునంత మేరయును దారి నిర్మానుష్యముగా నుండెను. కణతపై మచ్చగలయాపురుషుఁడాయంధకారమున నెటుపోవుచుండెనో నాకుఁ దెలియవచ్చినదికాదు. ఆనాఁటికాతని ననుసరించుట యసంభవమని తలఁచి తిన్నగా మాయింటికి వెడలుదమను కొంటిని. అంతకంటె జేయునదేమియు నాకుఁ గన్పడలేదు.

కొంతదూరమునడచితిని. మార్గమందు నరసంచారము లేనట్లుండెను. ఏదేని యోజించుచుఁబోవుచున్న నాకకస్మాత్తుగ

మాటలు వినవచ్చెను. ఆగి, చెవులు నిక్కించి వింటిని. ఎవరో యిట్లనుచుండిరి.

"కాయా ? పండా?"

దానికొక కంఠస్వరమిట్లు సమాధాన మొసఁగుచుండెను.

"పండు, పండు, ముమ్మాటికిని పండు."

వెంటనే వికృతహాసము వినవచ్చెను. దానికి మరి యొక బొబ్బనవ్వు బదులు వినఁబడెను. మాటాడునది మను జులా ? పిశాచములా ?

మొదటఁ బ్రశ్నవైచిన కంఠస్వరము నేను తృటికాలములో గుర్తిడితిని. ఆపండువెన్నెలనాఁటిరాత్రి ధారాపురము బాటపై నన్ను పలుకరించినగొంతుకాదా యది ?

రెండవ స్వర మెన్నఁడును వినినట్లులేదు. కాని యా బొబ్బనవ్వు నేనొకమాఱు స్రీమనుదగ్గర వినియుంటిని. ఎడమ కణతపైని బుట్టుమచ్చగల పురుషుఁడే దానికిఁ గర్త. రెండు భూతములును మరలఁ గలిసికొనెను. మంచిసమయమున తగుచోట వారి వికారకంఠస్వరము లుఱుములను ధిక్కరించుచుండెను.

మిక్కిలి ప్రయత్నించి చీఁకటిలో ముందునకుఁ జూచితిని. నాకుఁ గొలఁది దూరమున రెండున్నతాకారములు విసురుగా నడచిపోవుచుండెను. నేనును చప్పుడుచేయకుండ వారిని వెంబడించుచు నేమైనా మాటాడుదురేమోయని జాగ్రత్తగా

వినుచుంటిని. నాదృష్టియంతయు నాపురుషులపై నుంటచే నఱుములవ్రోతలును, గాలిశబ్దమును, మెఱపుల తళతళలను నేను గమనించుటలేదు. అట్లు కొంతదూరము నడచితిమి. వారేమియు మాటాడుకొనలేదు. ఆకస్మికముగా మరల మాటలు వినవచ్చెను.

"వినోదమందిరమునందు సావధానముగ మాటలాడుకొందము"

రెండవ పురుషుడు—చిరుచూరునుండి తిరిగి వచ్చినవాడు మాటాడెను. తిరువాత నిశ్శబ్దము. వారు వడిగా బోవుచుండిరి. నేను నడిగా వెంబడించుచుంటిని. మాకు మధ్యగా గారుచీకటి తెర.

వినోద మందిర మనునది పద్మలతగారి మేడపేరని చెప్పమరచితిని. వారిమాటలబట్టి వారలచ్చటికే బోవుచుండిరని విశదమాయెను. నాకావిషయము వినినప్పటినుండియు సంతోషము కలిగెను. వినోదమందిరము బాగుగా నెఱిగినవాడనగుటచే వారినచట కనుసరించి యెట్లేని వారిప్రసంగము వినవచ్చునని యెంచితిని. అది యాపదకు మూలమని నాకు దెలియకపోలేదు. కాని పద్మలతకొఱకై—నా ప్రాణమునకై—తెగువచేయనెంచితిని. ఆమె యింకను జీవించి యున్నదిలేనిదివారి సంభాషణవలన దెలియునని యెఱుగుదును. ఏదియో యొకసంగతి రూఢిగా దెలిసిన నామెను రక్షించుటో లేక యీహంతకుల శిక్షించుటో సలుపవలసి యుండెను. ఎంత యాపద కలిగిన

కలుగనివ్వదు. వానిగుహకే యీ సింహముల ననువర్తింపక తప్పదు.

మఱి పదునైదు నిముసములలో వినోద మందిరమును సమీపించితిమి. ఇంకను వర్షము రాలేదు. ప్రతి క్షణమును వచ్చునట్లె యుండెను. ఆపురుషులు తలుపుదట్టిరి. నేను కొలది దూరమున నాగితిని. ఎవ్వరో కవాటము తెఱచిరి. వారు లోనికిఁ జనిరి. మరలఁ దలుపుగడియ వేయఁబడెను నేను తక్షణమే కవాటము సమీపించి చెవియొగ్గి వింటిని. వారు మేడమెట్లెక్కుచు నవ్వుచు నేమోసంభాషించుకొను చుండిరి. మాటలు తిన్నగా నాకు వినరాలేదు. నేనిచట విస్తారము కాలము నిలువలేను. తలుపువీడి తోటగోడయొద్ద కరిగితిని.

మేడలోనికి నాకొక మార్గము తెలియును. పూర్వము నేనిచ్చటికి వచ్చుచు బోవుచున్నప్పు డాదారి కనిపెట్టితిని. ఆదారియం దొక్కచోట నే కష్టము. అది గడచిన మిగిలిన దంతయు సులభము. నేను యోచించుటకు నిలువక యొక చోట నెగిరి తోట ప్రహరీగోడ పైభాగము పట్టుకొని కొంచెము యత్నించి పైకెక్కితిని. గోడమీఁదుగఁ గొలఁది దూరము నడచి యొకచోటఁ జెట్టుసాయమున నిశ్శబ్దముగ లోపలికి దుమికితిని. ఆలసించక వెంటనే యుత్తరముగా ప్రహరీగోడలో ద్వారమునొద్దకు బోతిని. వినోదమందిర మంతయుఁ దోటకు నుత్తరమున నుండెను. అక్కడకుఁ బోయి చూడగాఁ దోటతలుపు వైచియుండెను.

నేను దీనికి సిద్ధపడియే యుంటిని. వెనుకఁ బలుమారు చేసినట్లు త్రాటిలో, తలుపుమీఁదుగ మరల గోడపై కెక్కి దొడ్డిలోనికి మెల్లగా దిగితిని. అది విశాలమగు దొడ్డి. మేడ నానుకొని తూర్పుగా దానిలో నొక స్నానగృహముండెను. దానికి నుత్తరముగా సమీపముగా బావియుండెను. అటు వైపుననే స్నానగృహము గోడలో గజమున్నర యెత్తున నడుగున్నర చదరముగ గమ్ములు లేని కిటికీయుండెను. బావి గోడమీఁది కెక్కి నేనా కంతలోఁగుండఁ గష్టముతో లోనికి దిగితిని. ఇంతవఱకంత కష్టము లేదు. ఆ స్నానము కొట్టులో నుండి మేడలోనికిఁ బోవు తలుపు సాధారణముగా దెఱవబడి యుండెడిది. ఇప్పుడునట్లే యుండునా?—నేను చేయు ప్రయత్నపు పర్యవసాన మంతయు నా ద్వారము తెఱచియుండు టయం దాధారమై యుండెను.

ఆగదిలో మిక్కిలి చీకటిగా నుండెను. కట్టెలు, కొంగులు కాలికి తగులకుండ త్రోవ తడువుకొనుచు జాగ్రత్తగా కవాటమును సమీపించి తటతటలాడుచున్న హృదయముతోఁ దానిని నెట్టితిని—అది తెఱచియుండెను.

ఆహా! అదృష్టము ఇక ముందాటంకము లేదని నాకు దెలియును. సంతసమున నుప్పొంగుచు లోనికిబోయి యసలు మేడ ప్రవేశించితిని. సరిగా నాసమయమున నే యురుముల ధమధమా రావములతో జోరున ప్రచండ వర్షపా రంభమాయెను. ఈవిషయ

యును కూడ నాకు సహాయకారి యాయెను. ఒకవేళ దారిలో నాకేమైన దగిలి శబ్దము కలిగినను నదిలోని వారికి వినబడదు. తలుపులు తెరచుటకు మూయుటకు కూడ భయపడవలసిన యవసరము లేదు. నేనొక ద్వారముతరువాత నొక ద్వారముగడచి "హాలు"లో ప్రవేశించితిని. అచ్చట నాగలేదు. గృహముయొక్క మార్గము లన్నియు సంపూర్ణముగా నెఱిగినవాఁడనగుటచే కొంతకాలములో మేడమెట్ల ద్వార, నిశ్శబ్దముగ బైకెక్కితిని.

పైన జేరినతరువాత చుట్టుప్రక్కల గలయ జూచితిని. రెండు గదుల నవ్వల నొకదానియందు వెలుతురు కానవచ్చుచుండెను. ఆపురుషు లచ్చట నున్నారని గ్రహించి మెల్లగా నచట కేగియుంటిని. ఏదో వారు సంభాషించుచున్నట్లు తెలియవచ్చునుగాని వానస్రోతవలన విషయ మేమియో వినరాలేదు. అచట నిలుచుట అపాయకర మగుటయేకాక నాకు వారిప్రసంగము నాలకించుటకు లాభకారిగాదు. కావున ననుమానించక యాపురుషులగది నానుకొని పడమటివైపుననున్న గదిచేరి యాతలుపు నిశ్శబ్దముగ దెఱచితిని. అది వచ్చెను. సంకోచింపక లోన ప్రవేశించి మరల మెల్లగా దలుపు మూసితిని, చుట్టునుజూచి వారున్నగదికిని నేనున్నగదికిని నడుమ నొక కవాట ముండుట గమనించి దానికి జెవియొగ్గి నిలిచి వినదొడగితిని.

ఊహించుకొనుడు సాహసించి శత్రుగృహము జొచ్చి దారికొక గజము దూరమున జీకటిగదిలో నిలిచి వారి హాస్య

ముల వినుచుంటిని. నాయునికి వారికి తెలిసిన నాప్రాణములపై నాస వదలుకొనవలసినదే. వదలుకొనియే నిలిచియుంటిని.

మొట్టమొదట కొలదికాలమువరకు నాకేమియు విన రాలేదు. వెలుపల వర్షము పెద్దమ్రోతతో నెల్లశబ్దముల దనయందు లీనము చేసికొనుచుండెను. ఉన్నట్లుండి యక స్మాత్తుగ ఢామ్మని పెద్దపిడుగుపడిన మ్రోత వినవచ్చెను. ఆధ్వనికి వినోదమందిర మంతయు గంపించెను. అది చల్లారిన నిముసమునకు లోననుండి మాటలు వినవచ్చెను. నేను శ్రద్ధగా నాలించు చుంటిని.

"ఏమి? పేరు శేషులా? శేషులా? ఆయింటి ప్రక్క మేడలో నున్నదాని చెల్లెలా? తెలివిగలదె?" అని వల్లభ రావని ధారాపురమునందు వ్యవహరింప బడుచున్న యాత డనుచుండెను. అనగా పౌర్ణమినాడు నాతో సంభాషించిన యాతడని చెప్పనక్కరలేదు.

"అవును! ఈ విషయ మొకందులకు మంచిదాయెను" అని యాతని చెలికాడు (ఎడమకణతపై బుట్టుమచ్చకల వాడు) ప్రత్యుత్తర మిచ్చెను.

ఇరువురును వికటముగా నవ్విరి. ఆనవ్వు వర్షపుఘోర శబ్దము నందు లయమై పోయెను.

ఇంతలో నేమో మ్రోతపుట్టెను. ఎవ్వరో తలుపు దఘాలున దెఱచి ప్రవేశించినట్లు శబ్దముకలిగెను. ఈస్వనికి

హేంతువేమని నేనాశ్చర్యము జెందుచుండ బిగ్గరగా స్త్రీకంఠ స్వరమున నిట్లు వినవచ్చెను.

"అయ్యో! అయ్యో! మేడక్రిందికి బెద్దత్రాచు పాము వచ్చియున్నది. రండు, రండు—త్వరగా"

దీపము తీసికొనినట్లును, వారు ముగ్గురు గదివిడిచి నట్లును నూహించితిని. ఆమాటాడినది వల్లభరావుభార్యయని తలచితిని. కాని సరిగా నీసమయమునందే యీగోలయేమిటి?

ఇట్లు యోచించుచుండగా నేనున్న గదితలుపు దభాలున దెఱవబడియెను. ఒక్కమారుగ వెలుగు గదిలోనికి బ్రవహించి నాకన్నుల మిఱుమిట్లు గొలిపెను. నా యెదుట నిరువురు దీర్ఘకాయులగు పురుషులును, వారిప్రక్క దివ్వె పట్టుకొని యొక స్త్రీయు గంభీరముగా నిలువబడిరి.

గృహములోనికి వచ్చిన త్రాచుపామును నేనేయని గ్రహించి నిర్ఘాంతపడితిని.

---

## ఏడవ ప్రకరణము

భయంకరముగా నాయెదుట నిలిచినవారి ముగ్గురి యాకారము లిప్పటికిని నా కండ్లయెదుట మెదలుచునేయున్నవి నేను వారి నీజన్మలో మఱవజాలను. గృహయజమానుడగు వల్లభరావు త్రింశద్వర్షప్రాయుడని చెప్పియుంటిని. వెలుగునం

డాతని ముఖము స్పష్టముగాఁ జూచినప్పుడింకొక పదియేం డ్లెక్కువ యుండవచ్చునని తోఁచెను. పెద్ద కఱకుమీఁసములు. ఎఱ్ఱసికండ్లు—తీవ్రమగు చూడ్కులు—గంభీర భావము. ఆతఁడు మిక్కిలి బలాఢ్యుఁడు. తీఱుఁజూడఁ ఘాతకుఁడని వదనమున వ్రాసియుండెను.

ఆతని సహకారికి నించుమించుగ నదే యీడుండెను వల్లభరావుకంటెఁ గొంచెము పొడుగు తక్కువ—(నిశ్చయ ముగాఁ గాదని తెలియువఱకు నింటి యజమానుని వల్లభ రావని పిలువ నిశ్చయించుకొంటిని) వెనుక చెప్పినట్లు రెండవవానికి నెడమ కణతపైఁ బెద్ద పుట్టుమచ్చగలదు. మిగిలినవిషయములందు ముఖము, తీరు, బలము తన స్నేహి తునంబు వలెనేయుండెను.

ఆస్త్రీ కిరువదియైదేండ్ల వయస్సుండెను. సుందరి మంచి శరీరచ్ఛాయ గలది. ఏవిషయమునందును వల్లభరావు నకుఁ దగినట్లుండెను, వారము దినముల క్రిందట నాకుఁ జీటి దాసీముఖమున నిచ్చినది, యామెయేయైయుండునని గ్రహిం చితిని. అట్టి భయంకరతరుణమున వారి యాకారభావములు గమనించుటకు నాకు మనసెట్లు వచ్చునని మీలోఁ గొంద ఱాశ్చర్యము చెందవచ్చును. కాని యాపదయనిన నాకు లక్ష్యము లేదు. అదియుఁగాక వారి యాకృతులు గమనిం చుట నాకు ముఖ్యమైయుండెను. వారిని స్పష్టముగాఁ జూచుట కదియే ప్రథమము. మఱియు, వ్రాయుట కింత తడవు

పట్టినకాని, చూచుటకు యొక్క క్షణములో నాయెను. తరువాత క్షణములో నాయపాయస్థితి యోజించితిని. వారికి లొంగనా? వారు బలిష్ఠులు—పోరి లాభము లేదు నిరాయుధుఁడనై వారికి వశ్యమైన? వారు నన్ను విడువరు; వింతకై పోలీసుల కప్పగించిన నప్పగింపవచ్చును. వారితో బోరాడ నిశ్చయించుకొంటిని. ఎట్లయిన వారిని గడచిన ముందుత్రోవ నాకుఁ దెలియును, తప్పించుకొనఁగలను. ముహూర్తమాత్రములో నాకు చిత్రాలోచన దట్టెను. ఒక్క మాఱుగ నా స్త్రీ చేతిలోని దివ్వె నార్చిన? ఇంకఁ జెప్పవలసినదే లేదు.

ఈ యాలోచనలు భంగమాయెను. 'పిచ్చిప్రయత్నములు చేయకుము. నీవు మమ్మునుండి తప్పించుకొనలేవు.' అని వల్లభరావు గంభీరముగాఁ బలికెను. అతని నేత్రములు ప్రకాశించుచుండెను.

'ఈతని నారక్షకభటుల కప్పగించి చోరీ నేరము క్రింద, అనుచున్న రెండవ యాతని వాక్యములకు నేనడ్డమువచ్చితిని.

'నేను చోరుఁడనుగానని ధారాపురమున కెల్లఁ దెలియును. మీ కెట్టి చోరులను బట్టువాఁడన నిదర్శనము చూపఁబోవుచున్నాను—'

'వీరాలాపములే' అనుచు గృహయజమానుఁడు వెళ్ళఁగా నన్నును. నేనాతని హుంకారమును సహింపఁగాలేను.

'నన్నానతుకభటుల కప్పగించుట నాశ్రేయస్సునకే మూలము. విచారణజరుగును. జరిగినసంగతులన్నియుఁ జెప్పు దును. దొంగవలె నేను దొంగలయింటిలోనికి బ్రవేశించు టకు హేతువులు చెప్పుదును. వినోదమందిరములు సోదా చూచి పద్మలతనో, రూమెశవమునో—'

నేనకస్మాత్తుగ నాగితిని. వారొకరిమొగ మొకరు తీక్షణ ముగఁ జూచుకొనుచుండిరి. నామాటలకు మనసుల జంకు చుండిరని తలఁచి నేను బెదిరింపులు మరల నారంభించితిని.

'మీరు వ్రాసిన చీటిగలదు ఈ స్త్రీ దానినిచ్చినట్లు నాదాసి సాక్ష్యముగలదు. మీరు పద్మలతను జంపి తీసికొని వచ్చినట్లు బండివాఁడు జాఫరహమ్మదు సాక్ష్యముగలఁదు—'

వారు నామాటలు విననట్లు నేను తెలిసికొంటిని. నన్నేమి చేయవలయునో వారు నేత్రములతో సంభాషించు కొనుచుండిరి. నేత్రావధానమునందు గట్టివారని వారిచర్యల వలన గ్రహింపవలసియుండెను. నన్ను చంపుదురేమోయని తలంచి పాఱిపోవుటకు నే నే ధీరయత్న మొనర్పనెంచి యిట్లంటిని.

'ప్రాణములుండ మీరు నన్ను పట్టుకొనఁజాలరు. చూడుడు, వెంకట్రామ వేళ్లు తప్పించుకొనునో!'

అనుచు అకస్మాత్తుగ నాస్త్రీవైపు లంఘించితిని. ఆమధయపడి చేతనున్న దివ్వె క్రిందపడెను. ప్రయత్నము నిష్ఫల మాయెను.

మతియొక్క క్షణములోనే నిరువురు బలాఢ్యులకుఁ జిక్కితిని. వారు నన్ను కొట్టలేదు; తిట్టలేదు. వారిలో నొక డొక యెఱ్ఱనిబుడ్డితీసి నాముక్కునొద్ద నుంచెను. నాకు మత్తు వచ్చెను. గది తిరిగెను. మనుష్యులు పిశాచములవలెఁ గన్పట్టిరి. దివ్వె ప్రచండజ్వాలవలెఁ దోఁచెను. పాదములక్రింద నగాధము కానుపించెను.

నేను స్మృహతప్పి క్రిందఁ బడితిని.

నాకు మరలఁ దెలివివచ్చి చూచునప్పటికి బాగుగాఁ దెల్లవాఱి యుండెను. నేనొక మాదిరి చీఁకటిగదియందొక మంచముపైఁ బరుండియుంటిని. పైన నున్న కిటికి తెల్లగాఁ గానవచ్చుటచేఁ బిలువవచ్చెనని తెలిసికొంటిని, నేను వినోద మందిరము ప్రవేశించి, యందలివారగల రహస్యసంభాషణ విన బోయి వారిచేఁ బట్టువడినట్లు జ్ఞాపకమువచ్చెను. వారు నాకేదో మత్తుద్రావకము వాసనచూపిరనియు నేను స్మృహ తప్పి మేడపైన పడిపోయితిననియు స్మరణకు వచ్చెను. అప్పుడు రాత్రి పైదుగంటలవేళ నగుటను జోరునఁ గురియు చుండెను. ఇప్పుడు నేనెచట నుంటిని ? ఈ చీఁకటి యేమి ?

నేనుమంచముపై లేచి కూర్చుంటిని. నాచుట్టుప్రక్కల నను చీఁకటిగనుండెను. గదిచిన్నది. నాముందు పెద్దతలుపుం డెను. అది వెలుపల బాధింపఁబడియుండెనని వేఱ చెప్ప నక్కఱలేదు. మంచముప్రక్క నొక చిన్న కొయ్యబల్ల

యుండెను. అంతకంటె నాకేమియుఁ గన్పట్టలేదు. నలువైపుల నెత్తయినగోడలుమాత్ర మస్ఫుటముగాఁ గానవచ్చుచుండెను.

నేనొక చెఱసాలయందున్నట్లు దెలిసికొంటిని. అది యొక నేలకొట్టు. వినోదమందిరమునకు నేను వచ్చుచుఁ బోవుచున్నప్పుడు నేలకొట్లు చూడలేదు. వానితోడ నాకేమువసరము? ఒకసమయమున నాప్రియురాలి యింటనే నే బందీనై యుందునని నేను కలనైన ననుకొనలేదు, కాని కాలవైచిత్ర్య మట్టిది. ఇట్టి రహస్యవిషయములందు మనమితరులగృహములు ప్రవేశించినప్పుడు చిక్కకుండ నున్న మర్యాదకష్టము గాని నావలె బట్టుబడిన యనేకసంకటములకును నవమానములకును పాలుగావలసివచ్చును అయిన నేనధైర్యము చెందలేదు. రహస్యముగా వినోదమందిరము చేరినవాఁడను. దురదృష్టమువలన నందలివారికిఁ జిక్కినప్పుడు రాఁగలకష్టములకోర్వ సంసిద్ధుఁడనై యుండవలసినదే అయిన వారు నన్నిచట నుంచుటలో నుద్దేశమేమి? వారి రహస్యములు నాకుఁ దెలిసెనను నూహతోఁ జంపనెంచిన నాకార్యము నేనుమూర్ఛలో నున్నప్పుడే జరిగియుండెడిది. అది వారి యభిప్రాయము కాదు, మాటమాటకు నిండుప్రాణము తీయుట యన్న నెట్టికటికవానికైనఁ జేతులు వచ్చునా? మఱి నన్నీ నేలకొట్టులో నుంచుట యేల? నేను యోచించితిని. నాకుఁ దెలియవచ్చినది కాదు, త్వరలోనే తెలియునని తలఁచి యోపిక వహించితిని.

ఇంతలోఁ దలుపు తెఱచిన శబ్దమాయెను. ముందునకుఁ జూచితిని. నాకట్టెదుటనున్న కవాటపుఱెక్కలు లోనికిఁ దెఱచుకొనెను. ఒక మనుష్యాకారము ప్రవేశించి తలుపు మూసి దానినానుకొని నిలువఁబడి, మంచముపై గూరుచున్న నన్ను తీవ్రముగా, జూడజొచ్చెను. ఆయున్నతాకారము, ఆచీఁకటిలో సాభ్రికిఁ గనుపడిన యముని దీర్ఘాకృతివలె నుండెను. నేను క్షణములో గుర్తించితిని. నాయెదుట నిలుచున్న యాతఁడు గృహయజమానుఁడని తెలిసికొని యాతనితోఁ దగురీతిఁ బ్రసంగింప సంసిద్ధుఁడనైతిని.

"ఇతరులవిషయములలో జోక్యము కలిగించుకొని యిట్టి నీచస్థితికిఁ బాలైతిని. మావ్యవహారములు నీకేఁదులకు" అని యాతఁ డెగతాళిగా మాటాడెను.

"ఎట్టి నీచస్థితులకైనను పాలయి చోరులను, హంతకులను పట్టుట మా విధాయకము— నేను దానిని నిర్వర్తించుచున్నాను" అని నేనుసగర్వముగాను నిర్లక్ష్యముగానుపలికితిని.

ఈ సమాధానమున కాతఁడు పండ్లు పటపట గొఱికెను. సహజముగ రక్తవర్ణముగనున్న యాతనిసలోచనము లిప్పుడు మఱింత ప్రకాశించుచుండెను.

"ఇచ్చట చోరులెవ్వరు?" అని యాతఁడు సగర్వముగా ధిక్కారముతో నఱచెను.

"వల్లభరావుగారికి రావలసినయాస్తి, యాతనిఁ జంపి, మీరు పేరుతో ననుభవించుచున్నవారు చోరులు" అని నేను నిర్భయముగాఁ బ్రత్యుత్తర మిచ్చితిని. "పద్మలతను జంపిన వారు హంతకులు!"

ఈమాటలకాతఁడు మండిపడునని యూహించితిని. కాని యట్లు కాలేదు. అతఁడు విచిత్రమందహాసము చేసెను. "ఆమె యొక పిచ్చిది. నీవొక పిచ్చివాఁడవు. ఆమె పద్మలత కాదని నమ్మవు చిన్నప్పటినుండియు నెఱుఁగుదువు కదా ?— అయిన నామె నీప్రియకాదని తెలిసికొనలేకపోతివా ? దొంగలనుపట్టు తెలివి దీనిలో లేకపోయెనేమి ?" అని యాతఁడు పరిహాసము చేసెను.

"ఆమె పద్మలత కాకపోయిన మఱెవ్వరు ? ఉంగరము, జాబులు నామెకెట్లు లభించెను ? నన్నెట్లెఱుగును ?" అని నేనడిగితిని.

ఆఁతడు మరల నవ్వెను. "అవి క్రమక్రమముగాఁ దెలియును. నీవిప్పుడు మాయధీనమందున్నావు. నిన్నూరక విడిచెదను పొమ్ము. కాని పోవుటముందిఁక మావిషయములో నెట్టి జోక్యమును గలిగించుకొనననిదాటరాని యొట్టు పెట్టుకొన వలయును." అని యాతఁడెను.

ఈసంగతి యసంభవమని నేను చెప్పవలయునా ? నా కంఠమున జీవములుండఁ బద్మలత విషయమై ప్రయత్నములు

మానవని వెనుక మీఱరాని ప్రతిజ్ఞపట్టితిని. అందువలన నా విషయ మాతనితోఁ జెప్పి యిట్లంటిని. ఇప్పుడు నీవు చెప్పినట్లు చేసిన వెనుక శపథము తప్పుదును. అది తప్పినవాఁడను లెక్క లేకుండ నిదియుఁ దప్పెదను. కావున నీవు చెప్పునది కుదురదు,

"మరల బాగుగా నాలోచించుకొనుము. లేకున్న నీకర్మ మనుభవింపుము" అని యాతఁడు తలుపు దఢాలున వైచి తృటికాలములో నిష్క్రమించెను.

---

## ఎనిమిదవ ప్రకరణము

గృహయజమానుఁడు క్రోధమనస్కుఁడై నిష్క్రమించిన తరువాత నొకనిముసకాలముండి మరల యోజించుకొనఁ జొచ్చితిని. అతని నిబంధనలకు నేనొప్పుకొనలేను. ఇఁక నన్నాతఁడేమి చేయును? ఊరక విడుచునా? విడువఁడు నేనాతనికిఁ బరమశత్రువుననుట యాతఁడెఱుఁగడా? ఎట్లయిన నన్ను కడ తేర్ప యత్నించునా? వారిలో నొకనినైనఁ జంపి కాని నేను చావను, నిజముగా నాస్త్రీ పద్మలత గాక పిచ్చిది యేయైన, నిజముగా నాతఁడు వల్లభరావే యైన నింతగోల యెందులకు? నన్ను నిబంధనలచేఁ గట్టివేయుట కేల ప్రయత్నించును? సంగతి చూడ వారివిషయము లన్నియు సరిగాలేవు. నా పద్మలత మరణవ్యవహారములో నేదో వింతయున్నది.

గృహాధికారి చరిత్రమునందేదో చిత్రమున్నది. అది సాధించి నిజస్థితిగతులు తెలిసికొననినాజన్మమేల? ఒకవేళ—ఈ స్త్రీ పద్మలత కాకపోయినను—నిజముగా నాప్రాణేశ్వరి జీవించి యున్నదేమో—!

బలమున నీఁతరాక మునిఁగిపోవుచున్న యాతఁడు గడ్డి పరకనైన నేలఁ గట్టిగా పట్టుకొనును? నాకు మొదటినుండియు నున్న యాశ నశింపలేదు. అప్పు శోకపట్టు మీఁద నుంటిని, వీరిచేజిక్కిన సుందరపద్మలతయైన సరే—లేనిచో నిజమైనపద్మలత యేమాయెను? ఆమె యుంగరముఁ గాగితములు నీమె కెట్లు వచ్చెను? ఈమెకు నాచరిత్ర యెట్లు తెలియును? తాను పద్మలతనని చెప్పుకొనుటలో నీమెయుద్దేశ మేమి? నిజమైన వల్లభరా వేమాయెను? ఆతనిపేర ధారాపురమున వినోద మందిరము నందున్న యాతఁ డెవఁడు? ఈచిత్రచరిత్ర యంతయు నేమి? ఈవిషయము లాద్యంతము, తెలిసికొనువఱకు నేను యత్నములు మానవలదనుకొంటిని. ఈప్రతిజ్ఞ పట్టుట సులభమే కాని, దీనిని నెఱవేర్చుట మిక్కిలి కష్టము. అయినను నేను ధైర్యము నొందలేదు. సాధనమునఁ బనులు సమకూరు ననుట నిర్వివాదాంశమని నే నెఱుఁగుదును.

అయిన నీవేళలో నిట్టి యాలోచనలఁ గాలము పుచ్చుచుఁ గూరుచున్న వీరెవ్వఁడో బలవంతముగా నన్ను తుదముట్టింపవచ్చును. నేనసహాయుఁడను—వారు మిక్కిలి

బలాఢ్యులు. నేనేమి చేయఁగలుగుదును? అందువలన శీఘ్రమే యెంత తొందరగా వీలైనంత తొందరగాఁ దప్పించుకొనఁ జూడవలెను. ఆపని సామాన్యము కాదు. ఆమాట యనుకొని యూరకుండరాదు. క్షణము పొల్లుపోనీక ప్రయత్నమారంభించుట మంచిదని తలంచితిని. ఈయూహతో మంచముపై నుండి లేచి దిగి నాలుగు మూలల వెదకితిని. అందేమియు లేదు. గోడలపై నొక్కమేకైనా నున్నట్లు కన్పట్టలేదు. నాకెదురుగ వాకిలి, నా దక్షిణమున నాలుగు గజముల యెత్తున నలూడు కమ్ములును, చదరపు టర్ధగజము వైశాల్యమును గల యొక గవాక్షమును నుండెను. గదిలో నేలపై నిటికరాళ్ళు పఱుపఁ బడియుండెను. అందొక మంచము, కొయ్యబల్లయుఁ దప్ప నింకేమియు లేవు ఎత్తయిన గోడలు—ఇనుచీఁకటిగొట్టు—తప్పించుకొను నెట్లు వేది? మఱలఁ దలుపు తెఱచికొని యధికారి ప్రవేశించెను. అంత త్వరలో నాతఁడు తిరిగి వచ్చునని నే ననుకొనలేదు. తిరిగి యేపనిమీఁద వచ్చెనో యని యాతని వైపు చూచుచుఁ గూర్చుంటిని.

"వెలుపలికి రమ్ము. కాలకృత్యంబులు తీర్చుకొనుము. పాఱిపోనని మాత్రము మాట యిమ్ము" అని యాతఁడనెను.

"నామాటయందు నీకు నమ్మకమెట్లు?" అని నేనంటిని.

"నాకు నమ్మకము కలదు. నీవు పలాయనము చేసినను భయము లేదు. నీగుణము మాత్రము తెలిసికొనినవారమగుదును." అని యాతఁడు నిర్లక్ష్యముగాఁ బలికెను.

"అనినమాట తప్పను—ఆనియమమైనీకనుమానమక్కరలేదు" అని నేను సమాధానముచెప్పి యాతనివెంట బయలుదేరితిని.

మేముభయులమును మేడదిగి తోటలోనొక మూలనున్న దొడ్డిలోనికేగితిమి. అందు బయలుగృహముండెను. అచ్చటఁ గాలకృత్యముల నిర్వర్తించుకొని యాతనివెంట తిరిగివచ్చితిని. మరల గదిలో నన్నుంచి యచ్చటఁ గొన్ని ఫలములు రొట్టెను, నీరుపెట్టి యాతఁడు కవాటము బంధించి నిష్క్రమించెను.

మేము నాయుళ్ళుమగుటచే నిరభ్యంతరముగ వాని నారగించి సేదదీరితిమి. ఇట్లెట్లెంతకాలము?

పవలంతయు నిట్లే కడచెను. ఆహారజలంబులుండనిచ్చి పోవుటకంటె యజమానిగాని, మరెవ్వరుగాని నాకెట్టి శాంతి భంగమును గలిగింపలేదు. గృహమంతయు నిశ్శబ్దముగనుండెను. ఆదినమున నాకు రెండవపురుషుఁడుగాని, స్త్రీగాని యగపడలేదు. ఇంటిలో వారున్నట్లు సందడియైనలేదు. కొంత భాగము నిదురించియుఁ గొంతయోచించియుఁ గొంత తోఁచక యాపలించియుఁ బగలంతయు నెట్లో పుచ్చితిని. అది నాకొక యుగమువలె నుండెను. మొదటిదినముననే యిట్లున్న, నింకముందెన్ని దినములుండవలసివచ్చునో?—కానున్నది కాకమానదని వేదాంతమార్గ మవలంబించితిని.

ప్రొద్దుగ్రుంకెను. నాగది చీఁకటిపడెను. అందొంటరిగ నేను కూర్చుండి యుంటిని. నాకు దోఁచ లేదు. మంచముపైఁ బరుంటిని. కనులు మూసికొని యుబుసుపోక విలవిలలాడఁ జొచ్చితిని.

గదిలోఁ జీఁకటి హెచ్చెను. వెలుపల నెట్లుండునో కాని యందు మాత్రము గాఢాంధకారముగ నుండెను. కనులు తెఱచినపుడెల్ల నావిషయము మారి మరల వాని మూసికొనఁ జొచ్చితిని. ఎచటనో పాడుపడిన బావియడుగున రాత్రివేళనున్నట్లుండెను. ఒక దీపమైనను నిచ్చెదరా ?

గృహములో నెట్టి సవ్వడియు లేదు. ఎవరైననున్నారా! లేక దిక్కు లేక యీ గదిలో నిల్లు—

అకస్మాత్తుగ నాకొక మూలుగు వినఁబడెను. నేను శ్రద్ధగావింటిని. మరల నొక సూక్ష్మ స్వరమే వినవచ్చెను. నాశరీరమున రోమములు నిక్కపొడిచెను. నిముసములో నేదో ఘోరకృత్యము జరుగుచున్నదని తలఁచితిని.

'నన్ను—నన్ను—చంపుచున్నారా... నిష్కారణ... చంపవద్దు' అని స్త్రీకంఠస్వరమున నస్పష్టముగా నతిహీన స్వరమున వినఁబడెను.

ఎవరో యధోలోకమునుండి మాటాడుచున్నట్లు తోఁచెను.

'చంపిన—జాగ్రత్త ! దుర్మార్గులారా ! దయ్యమై మీయంతము కనుగొందును—భద్రము !' అని మరల నాకంఠమున నే బెదరింపులుస్ఫుటముగా వినఁబడెను. ఆ కంఠస్వరము—ఆ బెదరింపులు !

చీఁకటిలో నేనుమంచముపైనుండి నేలమీఁదికిలంఘించితిని. తలుపు దడాలున దన్నితిని. ప్రియయొక్క ఆర్తనాదము విన్న బోనులోని సింహమువలె గదిలో గిజగిజలాడుచుఁ దిరుగఁజొచ్చితిని.

మరల నెంత ప్రయత్నించినను నాకెట్టిమాటలును వినరాలేదు. ఉద్రేకముతో గదిలో నేను నడుచుచున్నప్పుడు కలుగుచున్న పదధ్వనికంటెఁ దిరిగి యెట్టి శబ్దము వినరాలేదు. మరలఁ బ్రశాంతము రాజ్యముసేయఁ జొచ్చెను.

ఆ దీనాలాపము మఱవగలనా ? అది పద్మలతయే. వారము దినముల క్రిందట మాటాడినగొంతే. అయిన వారామెను హత్య చేయుచుండిరా? చేసిరా? నా దేహమున నెత్తురు గ్రాగుచున్నట్లుండెను. ఒడల వశంబుగా నుండెను. నా యసహాయస్థితికి నన్ను నేను నిందించుకొంటిని. ఏమి చేయగలను? బిగ్గఱగా నఱచిన?—పిచ్చితనము.

ఈ క్షణమువఱకుఁ బద్మలత జీవించియున్నదా ? చంపదలఁచుకొన్నవా రిదివఱకే యేల చంపియుండరు? ఇట్టి యసందర్భవిషయముల కెవ్వరు ప్రత్యుత్తర మిత్తురు ?

ఆ నిశ్శబ్దమునకు నాకర్థము తెలియలేదు. పద్మలత యంత సామీప్యములో నెచట నుండెనో? ఆమె యెందుకు మూల్గెనో ఎందుల కాబెదిరింపులఁ బలికెనో? ఆసమయమున నాచేతిలోనొక కత్తియుండ యీపురుషులు నాకెదురుగ నున్న నొక్కపెట్టున వారి నిర్వరఁజంపియుందురు—పొడిచి నలినలి చేసియుందురు. ఇది నాకిప్పుడు కలిగిన యూహ. దాని పర్యవసానము నేను యోజింపలేదు. నాస్థితి యంతయు—జరుగుచున్న సంగతిసందర్భములు చూడ నొక్కటి మాత్రము నిశ్చయమాయెను.

ఎట్లయిన నేను నేఁటిరాత్రియే తప్పించుకొనవలయును?—కాని యెట్లు?

కవాట మకస్మాత్తుగఁ దెఱవబడెను. ఒక్కసారిగ గదియంతయు వెలుతురు మయమయ్యెను.

చేత దివ్వెపట్టుకొని నాయెదుట గృహయజమాని సహాయకారిగ నిలచెను. తెఱచియున్న తలుపు వైపుమాత్రముగాజూచితిని. తప్పించుకొనవలెనని నాయుద్దేశముకాదు పరువెత్తి గదులన్నియు వెదకి, పద్మలత బ్రతికియున్నది లేనిది నిశ్చయించి పగదీర్చుకొనవలెనని నాయొక్క కోరిక.

కాని వెలుపల నెవరో నిలిచియున్నట్లు కనిపెట్టితిని అచటిఁ జీకటిలో సగముకన్పడికన్పడనట్లు వల్లభరావున్నతాకారముండెను. కావున నా ప్రయత్నము నిష్ఫలమగుటయే

కాక, మీదుమిక్కిలి వారు నాకు సంకెళ్ళు కూడ వేయవచ్చును అప్పుడు? రెంటికిఁ జెడ్డరేవడివలె నగును.

చేయునది లేక క్రోధముగా నాయెదుట నిలిచియున్న యాతని నేకదృష్టిగాఁ జూచుచు నప్రయత్నముగ "ఆమెను హత్యచేసిన అరే! మీ ప్రాణములు కాచుకొనుఁడు!" అని యఱచితిని. వెలుపల వికటముగా నవ్వు వినవచ్చెను.

"ఎవరెను హత్యచేసిన?" అని యా పుట్టుమచ్చ వాఁడు సావధానముగ నడిగి దీపము గదిలోనుంచి, బల్లపై రొట్టెలు, నీరు, నొక చిన్నకత్తి నుంచెను.

"ఎవరైనా?—" నేను భయంకరముగా మాటలాడితిని. "ఎవరైనా? మీ రెఱుఁగరా? మీకాలము రాకపోదు. పద్మలతను విడువుఁడు విడువుఁడు"

నేను విస్తారము మాటాడలేకపోతిని. ఆమెదుస్థితిఁ తలఁచికొనినప్పుడు నాకు బాష్పములు వచ్చెను.

"నీమాటలు నాకుఁ దెలియవు. నీకేమి వినఁబడెను?" అని యాతఁడు నెమ్మదిగాఁ బ్రశ్నించెను.

"ఆమె మూలుగు వినఁబడెను. ఆమె వాక్యములు వినవచ్చెను—"

ఆతఁడు నామాటలకడ్డము వచ్చెను. "అనవసర కార్యములఁజోక్యము కలుగఁజేసికొనిన వారందఱికిని నిదియే శిక్ష. జేప్ప నీకో నవకాశముగ మాటాడవలసి యున్నది నీసంగతి

చూచుకొనుము'' అనుచుఁ గవాటము దభాలున వైచి నిష్క్రమించెను.

నాయుద్రేకమును మన్నింపుము నీ యాజ్ఞ యెట్లున్న నట్లు జరుగును. నా యవివేకత క్షమింపుము'' అని దేవుని ప్రార్థించితిని హతాశుఁడనైనతోడనే భగవంతుఁడు జ్ఞప్తికివచ్చెను

---

## తొమ్మిదవ ప్రకరణము

రాత్రి పదిగంటలాయెను నేను మంచముపై గూర్చుండి దీర్ఘముగ యోజించుచుంటిని. ఎదుట బల్లపై రొట్టెలు, నీరు, చేతికత్తి యట్లే యుండెను. నేను వానిని ముట్టలేదు నాబుద్ధి యాకలిదప్పులపై లేదు. నేను తప్పించుకొను నుపాయమరయు చుంటిని. ఆ నాఁటికిఁక నెవ్వరును నాగదికి రారని నిశ్చయించితిని. వాఁడే తప్పించుకొనవలయునని నాకు మిక్కిలి యుద్రేకముగా నుండెను. నేను క్షేమముగా వెలుపలనున్న బద్మలతనింకను రక్షింపగలనను ధైర్యముండెను. అందువలన నా స్వేచ్ఛకొఱకై భగీరథప్రయత్నము చేయ నెంచితిని. తప్పించుకొంటినా మంచిది. లేనిచో నష్టములేదు. పగసాధన చేసితిమిక దా యనుతృప్తియైన నుండును. నిద్రరాక శయ్యపై నటు నిటు విసుగుతో బొర్లాడుటకంటె నేదియో యుపయోగకరమగు పని చేయుట మంచిది.

అప్పుడు నాకొక యాలోచన కలిగెను. నేనున్నది నేలకొట్టుకదా ? కిటికీ సుమారు నాలుగు గజముల పైన నుండెను. దానిలోనికెక్కి చూచిననే నవ్వైపుననున్న విషయము బాగుగా దెలియును. బహుశః నేను తోటవైపున నుంటిననియు, గవాక్షములోనుండి వెలుపలికిం జూచినం దోట నేలదగ్గఱగా నుండుననియు నూహించితిని. అనుమానము తీర్చుకొనుటకై మంచముపైనుండి లేచి దానిని కిటికీక్రిందుగ గోడ కానించితిని. ఎవరైన దటాలున గదిలోనికి రావచ్చునని నాకుం దెలియును. అందుచే దానిని లోన గడియవైచెదనన్న దలుపునకు లోపలివైపున బంధించు వెరవులేదు. కాని యాపత్కాలములందే భగవంతుఁడు సాయమును జూచుచుండును. నేనాకొయ్యబల్ల తీసి కవాటమున కడ్డముగ నానించితిని. వెలుపలినుండి విసురుగా ద్రోసిన నాబల్ల యాగదు. కాని యది కొంత యాటంకముగ నుండును. దానిపై వస్తువుల ననాటుగ బెట్టితిని. తలుపు నెవరైన దెఱవ నెంచిన నవి వెంటనే క్రిందబడును. ఈలోపుగ నేను మంచము నద్ది యెవ్వరికి ననుమానము లేకుండ జేయవచ్చును.

తరువాత నేను నిశ్శబ్దముగా మంచముపై నెక్కి కొంత ప్రయత్నించితి కిటికీకమ్ములబట్టుకొంటిని. వానినాధారము చేసికొని, మంచముపైనుండి కాళ్ళుతీసి వెలుపలికి దొంగి చూచితిని. బయట జీకటిగ నుండెను. నల్లని పెద్దయాకారములు

చుట్టును గావచ్చెను. అది తోట యని నాకుఁ దెలిసెను. నేనూహించినది తప్పు కాదు—క్రిందికిఁ జూచితిని. నేల కన్పట్టుట లేదు. కాని యది సమీపముగానుండు నది మాత్రము నాకుఁ దెలియును. ఆకాశమున మేఘములు క్రమ్మియుండెను. ఒక్క చుక్కయైనఁ గన్పట్టలేదు. నేను దీపము వెలుగుముందునుండి వచ్చుటచే వెలుపల బొత్తిగా గొంత కాలము చూడజాలనైతిని. అట్లు ఇనుపకడ్డీలు పట్టుకొని వ్రేలాడుట కష్టముగ నుండెను. చూచిన విషయమునకు సంతసించి క్రిందికి జాగ్రత్తగా దిగివచ్చితిని.

ఎవ్వరును తలుపు తెఱవనట్లు స్పష్టమాయెను. అయినను నేనా కొయ్యబల్లను దానిస్థానమునుండి కదలింపలేదు. ముందింకను గొన్ని యత్నములు చేయవలసి యుండెను; అందువలన దేనికైనను మంచిదని దాని నచటనే యుండనిచ్చితిని.

ఇకముందు యోజన మేమి? నేనది వఱకే యాలోచించి యుంచితిని. కొయ్యబల్లపై జేతికత్తి పరీక్షించితిని. అది తగు వాడిగానే యుండెను. సంతసించి రెండురొట్టెలు తింటిని, దాహము తీర్చుకొని కార్యప్రధాన ప్రారంభించితిని. మొట్టమొదట గోడ కానించియున్న మంచము చప్పుడు లేకుండ మరల నెప్పటిస్థానమున బెట్టితిని. దానికి పాదములవైపున నల్లియున్న త్రాడు జనపనారతో జేసినది అది నా చూపుడు వ్రేలు లావుండి మిక్కిలి గట్టిగానుండెను. త్వరత్వరగా

దానినంతయు మంచమునుండి విప్పివేసితిని. అది మొత్తము పదిగజములపొడవుండెను. దానిని రెండు పేటలుగాబెట్టి యొకవైపున ఉచ్చుపెట్టితిని. దానికి గజముక్రిందుగ మూడు మూరులు త్రాటిని మెలవేసి గట్టిముడి యేర్పఱచితిని.

ఒకసాధనము సిద్ధమాయెను. రెండుపేటలుగానుంటచే దాటిప్పుడైదుగజములపొడవు మాత్రమే యుండెను. ఎంత యత్నించినను అది త్రెంపజాలనంత బలముగానుండెను. దానికొకవైపున గట్టియుచ్చును దానిక్రింద గజముదూరములో నొక గట్టిముడి యుండెను. ఆముడి నాపిడికిటి పరిమాణము గలది.

ఆగదియందొంటరిగా దీపము వెలుతురున, రాత్రిపది గంటలవేళ గంభీరనిశ్శబ్ద భావములతో నేను స్వేచ్ఛకై గ్రయు ప్రయత్నములు నాకిప్పటికిని గండ్లగట్టినట్లున్నవి. గప్పుడు నామనస్సెల్లు దడదడలాడెను. తలచుకొనిన నాకే యాశ్చర్యమయ్యెను.

తరువాత మంచమును గోడకు కిటికిక్రింద మరలనిలువబెట్టి త్రాడు భుజముపై వేసికొని మరల బైకెక్కితిని. అచట సరియైనస్థానముచూచి, మూడినుపకమ్ములలో నడుము వైపున నున్నదానికి ఉచ్చుపెట్టి దానిలోగుండ త్రాటి రెండవకొన దూర్చి క్రిందికిలాగి ఉచ్చుకట్టికి దట్టముగా బిగించివైచితిని. ఈపని నేను చెప్పినంత సులభముగాదయిన నేను. ఎడమచేతితో గమ్మిపట్టుకొనుటచే బనియంతయు గుడిచేతితో జేయవలసె

వచ్చెను. మొదట మొదట కొంతకష్టమాయెను గాని నేనధైర్యము చెందక పట్టుదలతోఁ బనియొనర్చితిని. ఎట్టకేలకు నాపట్టుదల గెలిచి త్రాడు గట్టిముడిపడెను.

నాముఖమున గొలదిగ జెమటపోసెను. దానికి నేను గర్వము చెందితిని. కార్యసాఫల్యమునకై నాలో మిక్కిలి సంతసించితిని. త్రాటిబలిమి. పరీక్షించుట అనవసరమైయెనను, కేవలము నాసంతోషమునకై దానినిబట్టి వ్రేలాడితిని. అది తెగవలెనన్నను తెగునట్లులేదు. ఇంతవఱకు నేనువేసిన గట్టిముడి యిప్పుడు గవాక్షమునకు గజముక్రిందుగ నుండెను. మిగిలిన నాలుగుగజముల త్రాడును క్రిందికి వ్రేలాడుచుండెను. దానిలో నాలుగడుగులు నేలపై బడియుండెను.

ఉన్నతస్థితిగతులింతకంటె విశదముగా జెప్పఁజాలను. నేను ముడిపై నెడమకాలుంచి కుడికాలు కిటికీయడుగుభాగమున నానించితిని. ఎడమచేతితో ద్రాడుముడివేసిన కమి పట్టుకొంటిని ఇట్లు నిలిచియున్నప్పుడు నాకుడిచేయి స్వేచ్ఛగా నుపయోగించుటకు వీలుగనుండెను.

నాపనులారంభింపవలసిన స్థలమిట్లు కట్టుదిట్టము చేసి, త్రాటివెంట మెల్లగా క్రిందికి దిగివచ్చి మంచముతీసి యొక మూల గోడకు నిలువబెట్టితిని. తరువాత దీపముతగ్గించి, కిటికికి క్రిందుగ బ్రక్కనబెట్టితిని. ఇందువలన గవాక్షమునీడయు, దానిలో నానీడయు దోటలోనికి బడవు. ఇట్లుచేయుట యావసరమైయుండెను. ఆవైపునదోటలోనికి బెక్కు గవాక్షము

లుండవచ్చును. ఎవరైననుజూచుట సంభవింపవచ్చును. అందుచే నపాయము కలుగవచ్చును. త్రోవయంతయు వాడి ముండ్లుండినప్పుడు ముందుదారి తడివి కాలుమోపుట మంచిది. చేతికత్తి తీసి, తెఱచి, నోట బట్టుకొని త్రాడునురల బ్రాకి యంతకు ముందు నిలిచినట్లు నిలిచితిని, నాయెడమ కాలు ముడిపై నాధారము చేసితిని. దక్షిణపాదము కిటికీ యడుగున బూనిక చేసితిని. ఎడమచేయి కమ్మిని గట్టిగా పనా కొనియుండెను. కుడిచేతిలో గత్తియుండెను. అది స్వేచ్ఛగా నుండెను.

నాప్రయత్నముయొక్క యుద్దేశమేమి? చెప్పెదను. ఆ గవాక్షమునకు మూడు కడ్డీలుండెను. అది యర్ధగజము చదరపువైశాల్యముగలిగియుండెనని చెప్పితిని. ఎడమచేతికడ్డీకిని గోడకును నడుమ మూడంగుళముల వెడల్పుండెను. మధ్యకడ్డీకిని, దానికటునిటు నున్నవానికిని నడుమ నొక్కొక్కదానికి నారంగుళముల వైశాల్యముండెను. కుడిచేతివైపున గమ్మికిని, గోడకును మూడంగుళముల స్థలముండెను. నేను త్రాడుముడి వైచినదియు బట్టుకొనియున్నదియు నెడమవైపుకడ్డీ. మధ్యకమ్మిని తొలగించిన అటు ఆఱంగుళము—ఇటు ఆఱంగుళములు—అడుగుమేర ఖాళీస్థల మేర్పడును. కిటికీక్రిందికి నర్ధగజముంటచే యాకంతలోనుండి నేను సులువుగా దప్పించుకొనవచ్చును.

నాపన్నుగడ చదువరులకు బాగుగా దెలిసినదని నమ్ముచున్నాను. కాని కష్టమంతయు నామధ్యకమ్మి తొలగించుటలో నున్నదని నేను వేఱే చెప్పనక్కఱలేదు. అది మిక్కిలి కష్టతరమైన పనియని తలచితినిగాని తుద కంత భారముగ బరిణమించలేదు.

కుడిచేతిలోనున్న కత్తితో ఇనుపకమ్మి యున్న కొయ్యను పైవైపున కెక్కి వేయ నారంభించితిని. ఆ కొయ్య అంతగట్టిది కాదు. అయినను కడ్డీ వెలుపలికి గనుపడు వఱకు గోయు నప్పటికి నాకు శరీరమున మిక్కిలి చెమటపోసి చొక్కా దేహమున కంటుకొనెను. ముఖముపైనుండి స్వేద బిందువులు పనిచేయుచున్న హస్తముపై బడుచుండెను. నేను నిశ్శబ్దముగా పనిచేయవలసి యుండుటచే రెండుమూడు మారులు లాగితిని. క్రిందికి దిగి విశ్రమించితిని కాళ్ళునొప్పి యెత్తెను. ఆరాత్రి తప్పించుకొనిన తప్పించుకొనినట్లు తెల్లవారిన నాయాశ లడుగంటిపోవలసినదే! ఈసంగతి నాకు బాగుగా దెలియుటచే బాధ కోర్చుకొంటిని.

ఇక కడ్డీ గోడలో విస్తారముండదని నాకు దెలియును. అందువలన కత్తితో గోడను త్రవ్వితిని. పావుగంట కాలములో గమ్మిపైకొన బయటపడెను. కడ్డీమధ్య పట్టుకొని కదలించితిని. అది కదలజొచ్చెను. ఇక దానియాధారము క్రిందకొయ్యలోను-గోడలోనుమాత్రమే పైకడ్డీయంతయు విడిగా వచ్చెను

నేనచటనే కొంచెమలపుతీర్చుకొని, యొక్కమారు నాబలమంతయు వినియోగించి, కమ్మిమధ్యపట్టి గడిలోనికి వంచితిని. అది విస్తారము లావుగా లేకపోవుటచే సులభముగ వంగెను. ఈపని చేయుచున్నప్పుడు కత్తి నోటితో బట్టి యుంచితిని. ఇప్పుడు దానిని మెల్లగా గ్రిందనుంచి వచ్చితిని. దీపము నార్పివైచితిని.

ఎదుట స్వేచ్ఛ నన్నాహ్వానము చేయుచుండెను. పరమేశ్వరుడు నాప్రయత్నములపై హసించెను. ఇప్పుడు మనుష్యుడు దూఱుటకు వీలైనంత కంత యేర్పడెను. దాని పొడవు అర్ధగజము, వెడల్పు అడుగునై యుండెను. నేను దానిలోగుండ వెలుపలికి దిగవలసియుండెను.

కిటికీలోగూర్చుండి త్రాడుపైకి జేసుకొని వెలుపలి వైపున దోటలోనికి జారవిడిచితిని. ఒక గజమైన గ్రిందికి బోకముందే యది నేల తగిలెను. కాబట్టి యిక నాకు ద్రాటి సాయ మనవసరమని తలచి దానిని లోపలికి లాగి లోన జారవిడిచితిని. తరువాత గొంత యత్నముమీద నా సందులోగుండ దూఱి క్రిందికి జారితిని. నేల తగిలెను. కమ్మిని పట్టుకొనిన చేతుల విడిచితిని. నేను పవలెల్ల కలవరించిన స్వేచ్ఛను బొందితిని. వినోద మందిరము తోటకు ఉత్తరపుహద్దునను, కట్టడమునకు దక్షిణపు గోడచెంతను నేను చీకటిలో నిలిచి యుంటిని—నా మనసుబుకి పోవుచుండెను. ఆకస్మికముగా నా రాత్రి యంధకారమును, నిశ్శబ్ద

మును జించుచు నొక్క యార్తనాదము వినవచ్చెను. ఆ కంఠము క్షణములో గుర్తించితిని. అది మిక్కిలి సమీపమున వినవచ్చెను. ప్రక్కన నొక కిటికీ కానవచ్చెను. అచ్చటికి జప్పునబోయి, ప్రక్కగా దానిలో నుండి లోనికి జూచితిని. లోపల పెద్దగదిలో దివ్వె వెలుగుచుండెను. అచ్చట నొక శయ్యపై బద్మలత గిజగిజలాడుచుండెను—కాని యాచూపేమి? ఆమె నోటివెంట, కనులు మిఱుమిట్లు గొలుపుచు నెఱ్ఱని రక్తము ప్రవహించుచుండెను.



## పదియవ ప్రకరణము

నాతల తిరిగినట్లయ్యెను. నేనా ప్రదర్శనమును జూడజాలనైతిని. తెల్లని నా ప్రియురాలిదుస్తులపై నెఱ్ఱని నెత్తురు—ఆ చూపు భయంకరముగ, ఘోరముగ నుండెను. నా కొడలు పులకరించెను. ఒక్క నిముసకాల మామె విలవిలలాడి నిశ్చలముగ బవళించెను. ఆ నిశ్చేష్టతకర్థము నాకు దెలియలేదు. ఆమె నిదురించుచున్నదా? లేక పెద్ద నిద్దురయా? నా కనులలోని కశ్రువులు వచ్చెను. దీనభావముతో నా బద్మలత సుందరాకృతివంక జూచితిని. ఆ యాకారము నేను మఱవగలనా? ఇప్పటికిని నా కనులముందఱ గన్పట్టుచున్నది.

ధవళశయ్యపై వాడిన పుష్పమువలె నామె పడియుండెను. నా కన్నులు తెఱచికొని లేవు. శిరోజములు చిందరవందరగా బడియుండెను. ముఖమున గళలేదు పెదవు లెండిపోయినట్లు కన్పట్టెను. చక్కని కనుబొమలు ముడివడియుండెను గడ్డముమీదను, వక్షముపైనను రుధిరము స్రవించియుండెను. ఆ తీరు చూచి యామె మృతినొందినదని నిశ్చయించితిని. అప్పుడేమి చేయవలయునో నాకు దోచినది కాదు. ఆ గదిలోనికి బోవాలను. పోయిన నా యుపాయము నకే కారణమగును. వెళ్ళి యా రక్షకభటులను బిలిచికొని వత్తమన్న ఆమెను వారు చంపినట్లు గురుతు? అయినను ముందేమి జరుగునో చూడవలయునని మిగుల నాతురపడుచుంటిని. ఆ సమయమున నా పద్మాంతను-నా సర్వస్వమును విడిచి పోవుటయెట్లు? నాకు గాళ్ళురాలేదు. అచ్చటనే యుండి ముందు జరుగు విధానము చూడనెంచితిని. నా మనసులో బగ యెట్లు మండుచుండునో వర్ణించిన దీఱదు.

అంతలో నడుగులచప్పుడు వినవచ్చెను. నేను ప్రక్కకొదిగి జాగ్రత్తగ చీకటిలో నిలిచితిని. లోపల వెలుగులో నడచుచున్న వృత్తాంతమంతయు నేను చూడవచ్చును గాని లోనివారు అంధకారములో గవాక్షము ప్రక్క గోడ నానుకొని డాగియున్న నన్ను గమనించుట సంభవింపదు.

ఈగది నాగదివలె నేలకొట్టుకాదు. తోటభూమియు గదినేలయు సమముగానే యుండెను. నా కెదురుగ గవాట

ముండెను దానిని తెఱచికొని యాయిరువురు పురుషులును, నాస్త్రీయువచ్చిరి. వారివదనములందు దయాదాక్షిణ్య భావములు లేశమైన గన్పట్టుటలేదు సాటిసుందరి సజ్జపై జచ్చిపడియుండుట చూచి యాతరుణి యాశ్చర్యముగాని, భయముగాని, కరుణగాని సూచింపలేదు. అట్టి సుకుమార శరీరమునందు సుకుమారగుణమగు జాలి సుంతయైన లేనందులకు నేను వింత చెందితిని. వారు మువ్వురును శయ్యను సమీపించిరి. గృహయజమాను డానిశ్చలాకారమువంక దదేకదృష్టిగ నాలుగు నిముసములకాలము చూచెను. ఆతని యనుచరుడు, భార్యయు నాతనివైపునను. శయ్యవైపునను జూచుచు నట్లేనిలచిరి.

"మాధవీ! ఈమెగుండెపై జేయిపెట్టి చూడుము" అని యజమాని యెట్టకేలకు మెల్లగా ననియెను.

ఆ స్త్రీ పద్మలతనుడాసి గుండెపైన హస్తముంచి రెండు నిమేషములు పరీక్షించి నాలుక చప్పరించెను. నాకు దేహము వశములో లేదు. పోతవిగ్రహమువలె నట్లె నిలిచి నేను వారివంక జూచుచుంటిని. వల్లభరావు పద్మలత ముక్కుపుటములయొద్ద వ్రేలుంచి కొంతకాలము నిదానముగా బరిశీలించెను.

"అయిపోయినదా" అని యాతనిసహకారి యడిగెను.

"ఆమెచిక్కులు వదలినవా?" అని మాధవి యడిగెను.

వల్లభరావు దలయూచెను. "కాక ఏమున్నది? చిక్కునారినుండి పనివేళవచ్చి శేషులు వినోదమందిరములో నృత్తి చెందినది" అని యాతడు గంభీరముగా బలికెను...

మరల మేఘములు లేకయే నాముందొక్క దారుణపు పిడుగు ప్రచండారావముతో బడినట్లాయెను! నేను విన్న మాటలు నిజమా? కలయా? నేనచట నిలిచియుంటినా లేక యిది వెఱ్ఱిభ్రమయా? 'శేషులు మృతిపొందినది' అని యాత డింతకు ముందుచ్చరించెనా? ఇకను విభ్రమ మెట్లగును? వారు నాముందుగదిలో నిలిచియుండిరి. అందొక స్త్రీ శయ్యపై జచ్చిపడియుండెను. ఆమె పద్మలత కాదని నాకు స్పష్టమాయెను. ఈ యెనిమిది దినములనుండియు నే నెంత మోసపోతిని? వారామె పిచ్చిది యనిన నమ్మనైతిని. ఇప్పుడు వారి వాక్యములు నిజమని తెలిసెను.

అయిన నిజమైన పద్మలత యేమాయెను? ఆమె జీవించి యుండెనా? అట్లయిన నామె యుంగరము నుత్తరములు నామె కెట్లు వచ్చును? ఏమో మోసగించి తెచ్చియుండ గూడదా? ఎట్లయిన పద్మలత నాకండ్లముందు మాత్రము చనిపోలేదు. మృతినొందిన దేవతెయో శేషులు—నా కూజటగలిగెను.

తరువాత సావకాశముగ యోజించుకొనవచ్చుననియు నూహించి నేనువారి నొకేరీతిగ దిలకించుచు జెవులు మిక్కిలి నిక్కించి వినుచుంటిని. అయిననామె పద్మలత కాదనువిషయమును సంతోషమును బ్రతినిముగమును నాకుజ్ఞప్తికివచ్చుచునే యుండెను. మొదటనీ శేషులనుజూచినప్పుడు చిరకాలముక్రిందట మరణించిన పద్మలత మరల బ్రతికివచ్చినట్లయ్యెను. ఇప్పుడీమె

పేరు వినినప్పుడు కండ్లయెదుట జరిగిపోయిన దనుకొనుచున్న ప్రియురాలు త్రుటిలో వేఱుస్త్రీగా మాఱిపోయెను. వారు కొలది కాలము నిశ్శబ్దముగానుండిరి. తరువాత వల్లభరావిట్లనియెను. 'నీవు చిక్కుబాఱిపోయినప్పుడు శేషులుతల్లి మొదలగువారేమనుకొనుచుండిరి?' ఈ ప్రశ్న, యెడమకణతపై బుట్టుమచ్చవాని కుద్దేశింపబడెను. అతడిట్లు సమాధానము చెప్పెను. 'చెప్పలేదా? ఈమె ముసలితల్లికి ఈమె ధారాపురము బెదరించుటకు వచ్చుచున్నట్లు లేశమైన దెలియదు. కూతురింకేదో యూరికి పోయెననియు త్వరలో దిరిగివచ్చుననియు నామె తలచుచుండును' అతడనెను. గృహాయజమాని కూడ మందహాసము చేసెను. మాధవిసహితము కొలదిగ హాసము సూచించెను.

'మనను బాగుగా బెదరించినది.' అని వల్లభరావింకను జరుగునప్పటికోడకే యెగతాళిగా మాట్లాడెను.

'పద్మలతను మోసముచేసి యేమిఫల మనుభవించినది? ఆమె యుంగరము నుత్తరమును మనకు దెచ్చియిచ్చినది?' అనుచు నెగతాళిగానే మాతని సహచరుడు పలికెను.

అయిన పద్మలత జీవించి యున్నదా? ఇంకను సందేహ మెందులకు? నేనచట నున్నానని తెలియక వారెట్టి రహస్యములు వెడల గ్రక్కుచుండిరి? నాసంతోషము భరింపశక్యము కాకుండెను. అక్షణము పోయి ఆ సూరంతయు గాలించి నా ప్రియురాలి జాడ కనిపెట్టవలయునని నాకు

దొందర కలిగెను. అయిన దానినెతో యత్నముమీాద నాపి వారి సంభాషణ యింకను శ్రద్ధతో నాలకించదొడగితిని.

'మనమేమి మాటలాడుచుంటిమి?—అవ్వాలగదిలోని వెంకటరావు మేలుకొని యున్నాడేమో?' అని యా స్త్రీ పలికెను. భయములేదు—ఇప్పు డర్ధరాత్రముదాటినది ఆతడు తప్పక శయనించియుండును—పిచ్చివాడు. నిజమైన పద్మలత చిగనూరిలో అలివేణిగారియింట్లో ఖైదీగా ఉన్నదని తెలియక, యీామెను బట్టుకొని పద్మలత, పద్మలత యని భ్రమపడుచు గలవరించుచున్నాడు' అని వల్లభరావు వికల హాసముతో నవియెను. నన్ను తిట్టిననుసరే కాని వారి కను మాటలాడిన బాగుగ నుండునని నేను తలచితిని వారి రహస్యములునాకెంత తెలిసిన నంతమంచిది. తెల్లవారిన తోడనే మొట్టమొదటి రైలుపై జిగనూరు వెళ్ళుటకు నిశ్చయించితిని. ఎనిమిది సంవత్సరముల క్రిందట మృతినొందినవా రందరును బ్రదికివచ్చుచుండిరి. నిజమైనవల్లభరావుకూడ జీవించియుండెనేమో!

'అబ్బా!' ఆస్త్రీ విసుగుతో ననెను. 'గోడలకు చెవు లుండు నందురు—అశుభములు మాటాడవలదు!'

స్త్రీకి నున్న తెలివి పురుషునికి స్వప్నములో రాదు. హాధవి సత్యము వచించెను. ఆసమయమున గోడలు నా చెవులు పెట్టుకొని వినుచుండెను. 'భయము లేదు లెమ్ము'

అని వల్లభరావు మెల్లో నిర్లక్ష్యముగా ననెను. నేను పొంచి యున్న సంగతి తెలిసినయెడల లాతని నోటినుండి మెప్పుకును వెలువడియుండవు! "సతారాం! ఈమె నెత్తుకొనుము. తోట లో మూలనున్నగోయి—మనము ముందుగనే—దేనికైనా—మంచిదని—దానిని త్రవ్వియుంచితిమి—దానిలో నీభోగస్త్రీని పెట్టి రూపుమాపివైచెదము! ఎత్తుకొనుము!" అని వల్లభరావు తన సహచరునితో వికృతముగా నవ్వుచు వచించెను.

పాపము శేషులు భోగస్త్రీయనియు, నామె జీవించి యుండగనే యామె గోరి త్రవ్వబడెననియు నేను తెలిసి కొంటిని.

ఇంకొక విషయముకూడ క్షణములో గ్రహించితిని. ఎడమ కణతపై బుట్టుమచ్చ వానిపేరు సతారామనియు నాకు వెనుకవచ్చిన చీటిలో "జ స" అని యున్న సాతకము లలో నొకటి యాతనిదనియు నాకుం దేటతెల్లమయ్యెను. సతారాము శేషులను సులువుగా భుజములపై నెత్తికొనెను. వారు దివ్వె యచటనే యుంచి యాగది వీడి, తలుపు వేయక యె వెలికిం జనిరి. మరల నంతయు నిశ్శబ్దముగ నుండెను.

---

## పదునొకండవ ప్రకరణము

శేషులశవము తీసికొని వారు త్వరలోనే తోటలోనికి వత్తురని నాకుం దెలియును. వారికంటం బడకుండుటకై యొక

చెట్టుప్రక్క పొదమాటున నేను నక్కితిని. నాగదిలో దీప మార్పివేయుట మంచిదాయెను. లేనిచో వారు తోటలోనికి వచ్చినప్పుడు నాకిటికీ వారికి గన్పడవచ్చును. అందువలన వారి కనుమానము గలుగవచ్చును. దానివలన నాకిక నపాయము గలుగునని కాదు. నేను ప్రహరీగోడ దాటి క్షణములోఁ బలాయన మొనర్పగలను. అయిన నప్పుడే యటుల జేయవలెనని నాకు లేదు. వారు ముందు చేయవలసిన విధానము గమనింప వలయును. ముఖ్యముగా వారిసంభాషణ విననవలసియుండెను.

ఆకాశమున నింకను మబ్బులు విడలేదు. నక్షత్రములు కన్పట్టుటలేదు, క్రిందటిరాత్రి తెల్లవారుజామున గురిసిన పెద్దవర్షమునకుఁ దడిసిన నేల యింకను దడియారలేదు. తోటయంతయు గాఢాంధకారముగా నుండెను. మిన్ను మన్నేకమైనట్లు తోఁచెను. గాలిలేదు. సమయము ప్రశాంతముగానుంట భయము గొలుపుచుండెను. పురుగు పుట్ర యుండవచ్చునని రవంతయు సంశయింపక, నేనొక ఉన్నత వృక్షము మఱుగుననొదిగి తోటవాకిలివైపు చూచుచుంటిని. ఆవాకిలి ఉత్తరపువైపున నుండెనని చెప్పియుంటిని. అది యచిరకాలములోనే తెఱచుకొనునని తెలిసి నాదృష్టి సారించి, పొదమాటున నుండి, దానివంక జాగ్రత్తగా జూచుచుంటిని.

ఆ యర్ధరాత్రంబున నచట నిలిచియున్న నాయోజన లేమి? ప్రప్రథమంబున నాస్వేచ్ఛ నాకపరిమితానందదాయక

ముగ నుండెను. దానిపై జనిపోయినది శేషులను వార కాంత యనియు, బక్నలత యలివేణి యను స్త్రీయింట జికునూరులో నుండెననియు దెలిసెను. ఆ చోరులలో నొకనిపేరు సతారా మని తెలిసెను. 'జ' యని సంతకము చేసినవాని నిజనామ మెఱుగ జాలనైతిని. వల్లభరావనునది మోసపు పేరని నిశ్చయమూమెను. ఆతనిభార్య పేరు మాధవి-ఆమె యాతని భార్యయా ? అదియు సందేహింపవలసిన విషయమే ! వారు శేషులను క్రమక్రమముగా జంపిరా ? సంశయింపవలసి యున్నది. నేను పలాయనము చేసిన సంగతి కనిపెట్టిరా ? లేదు. అందువలన వారి సంభాషణ వినుటకును, భావిచర్యల గమనించుటకును నాకు మిక్కిలి యవకాశ ముండెను.

తోటవాకిలి తెఱచినప్పుడామెను నేను జాగ్రత్తగా జూచుచుంటిని. మొదట శవమును భుజముపై వేసికొని సతారాము వచ్చెను. నడుమ నొక దొంగ లాంతరు పట్టు కొని మాధవి నడుచుచుండెను. ఆమెను గృహ యజమాను డనుసరించు చుండెను. ఆదీపము ముందు మాత్రము కొలదిగ వెలుగునిచ్చుచు సతారాము కన్పడునట్లు చేయుచుండెను. మిగిలినవా రిద్దరును జీకటిలో నుండిరి. ఆ యర్థరాత్రమున నిశ్శబ్దముగా నట్టి ఘోర కార్యములు నిర్లక్ష్యముగా జరుపు చున్నవారు మనుష్యులా ? పిశాచములా ? వారు తోటలో నైరుతిమూలకు జనిరి. గోయి యా వైపున నుండెనని నే నూహించితిని. నేను మిక్కిలి నిశ్శబ్దముగా నడుగులో నడుగు

వేయుచు, వారి కారుగజనుల సామీప్యమునకు బోయితిని. అచ్చట బ్రహారీగోడకును, వృక్షమునకును నడుమ నిలిచి. కొంచె మసాయము కలుగునట్లు తోచిన వెంటనే గోడమీదికి జెట్టుసాయమున నెగిరి వీధిలోనికి దుమికి చీకటిలో నదృశ్యమై పోవ సిద్ధముగ నుంటిని. చెట్టుమరుగున జాగ్రత్తగా నిలిచి వారు చేయుపనులును, జరుపు సంభాషణయు గమనింప బహుశ్రద్ధగా నుంటిని. మాధవి దీపము క్రిందబెట్టెను. సతారాము శవమును నేలపై బెట్టెను. వల్లభరావు చతికిల పడెను. ఆ కొంచెపు వెలుతురులో నాకు వారినుం డొక గొయ్యి కానవచ్చెను.

"చిత్రముగదా!" వల్లభరావు ప్రసంగ మెత్తుకొనెను. "చిత్రముగదా! చికుమూరులో బుట్టి, చికునూరిలో బెరిగి, తుదకీ శేషులు మన గృహములో ప్రాణములు విడిచి, మన తోటలో గోతిలో బూడ్చిపెట్ట బడుచున్నదిగదా! భూమిలో నెవరి చావెక్కడ వ్రాసిపెట్టి యున్నదో యెవ్వరి కెఱుక ?"

"అవును, దుర్మార్గులారా! మీ చావెచ్చటనో యెవరి కెఱుక ?" అని నేను మనసులో వారిని శపించితిని.

"పాపము! శేషులుతల్లి యింకను, ఇంకను, ఇంకను తన బిడ్డవచ్చునని ముసిలికళ్ళతో ఎదురు చూచుచుండును! నలుగురితో బాటు తనకూతురుకూడా పిడికెడు మన్నయినది

యని యామె కెట్లు తెలియును ?" అని సతారాము వేళా కోళముగ మాటాడెను. వారు ముగ్గురును నవ్వుకొనిరి. అది భూతముల వికటహాసమువలె భయంకరముగ నుండెను. 'నేను మొట్టమొదటినుండియు జెప్పుటలేదా ? ఆ పద్మలతను కూడ మర్దనముట్టించిన యీకష్టములు మనకుండవుగదా ?—' అనుచున్న మాధవి మాటలను గృహయజమాని యడ్డువచ్చి యిట్లనెను. 'సతారా మామెను బ్రదుకనిచ్చెను. ఆమెపై నిట్టి పిచ్చిప్రేమ వద్దనిన వినెనా ? ఎనిమిది సంవత్సరముల నుండి మోహించుచుండినను నేమైన లాభముకలిగినదా ? అలివేణి యెంత యత్నించియు నేమైన ఫలముతోచినదా ? ఆపిల్లలను వృథాగా నిర్బంధమున నుంచుటకంటె బరలోక యాత్ర కనుపుట మంచిది పోనిమ్ము. నాకెందుకు ?' సతా రాము ప్రసంగ మందుకొని యిట్లనెను. "మీరేమైన ననుడు. ఆ పద్మలతను నేను చంపవేయును. ఆమె యొప్పుకొనకపోయి నను నాకు లక్ష్యములేదు. ఆమె యందమును రాలు—మాచి, చూచి—'

"పోనిమ్ము, పోనిమ్ము" వల్లభరావనెను. 'పట్టుదల కలవారు సాఫల్యము కాంచెదరు.'

వారు కొలదికాల మూరకుండిరి. పద్మలత జీవించి చీకటిగూటిలో నున్నదనుట నిర్వివాదాంశము. సతారా మామె ప్రాణముల గాపాడినవా డాయెను. అత డామెను ప్రేమించి, నిర్బంధమున నుంచినను ప్రమాదములేదు. ఎట్టిన

నిప్పటికైన నామె జీవించియున్నదే పదినేలు. ఆమె కష్టముల కంతము సమీపించెనని నాకు దృఢముగా దెలియును ఈ శేషు లామె నుండి నాపేరు ముద్రితైన పెట్లో గ్రహించి మమ్మెల్ల మోసపుచ్చి, యాదొంగల బెదరించి, వారి క్రౌర్యాగ్ని కింధన మాయెను. అయిన బద్మలత నన్నింకను దలచుచున్నదా? ఆశ కంతములేదు. తప్పక నిత్యము నన్ను తలచుచున్నదని నేను నమ్మితిని. ఈప్రచండ మోసమునందు జిత్రమేమన బద్మలత కాని యామె పద్మలతనని చెప్పుకొను చుండెను. వల్లభరావు కాని యాతడు వల్లభరావు నని చెప్పు కొనుచుండెను. వారి నామముల నీ రుపయోగించ జూచు చుండిరి. ధనములో నున్న మాహాత్మ్యము వర్ణింపదరమా! పద్మలతనని చెప్పుకొనిన యామె తగు దాడన యీ దొంగల చేతి బొందెను. అట్లె వీరును నితరులచే దగు శిక్షను బొందు దురా?—పొందుదు రనియే యూహింపవలసి యున్నది.

నిజమైన పద్మలత బ్రతికియున్నది—ఆమెను రక్షింప నున్నాను. నిజమైన వల్లభరావో? నే నాలోచనల గట్టిపెట్టి వారి చర్యలయందే మనసంతయు నుంచితిని. సతారాము గోతిలో దిగి కొలదిగ రాలిన మట్టిపెళ్ళలను దొలగించివేసెను. మాధవికుండ జతకలపదెను. గృహయజమానియు, నామెయు సతారామువంక జూచుచుండిరి. అతడు కొలదికాల మం దుండి పైకి వచ్చెను. సరిగా నాసమయమునుున నొంటిగంట

కొట్టిరి. అట్టిఘోరకృత్యమునకు తగుచోటు—తగు మను జులు—తగువేళ "శవమును దించుదమా ?" అని యజమాని చెలికానిని హెచ్చరించెను. "ఇంకను ఆలస్యమేల? ఇప్పటికే నిద్ర మిక్కిలి చెడినది, రమ్ము" అని సఖారామనెను. యజ మాని లేచెను. సఖారాము శేషులపాదములు పట్టుకొనెను యజమాని చేతులు పట్టుకొనెను. వారామె నొకవస్త్రము నందైన జుట్టలేదు. నేనా జాలిగొలుపు వదనము చూడజాల నైతిని. పాపమామెను నొప్పికాదా? ఏమో. ఇంకను ప్రాణ మున్నదేమో! వారు తిన్నగా జూడలేదేమో! అనుచు నేను నన్నే ప్రశ్నలు వేసికొంటిని.

"దింపుము—పట్టు" మని సఖారామనెను.

శేషుతల్లిమాట నాకు జ్ఞప్తికివచ్చి యామెదుఃఖము తలచికొనినంతనే బాష్పములు కాఱనారంభించెను.

"ఇంకొక గోరీతవ్వి యా వెంకటరావును గూడ బెట్టిన బనిలో బని తీరిపోవును !' అని యజమాని యనెను.

అతనిపై దుముకుదమా యనునంత యాగ్రహము కలిగెను. దానిని ప్రయత్నించి యాపుకొంటిని. అయినను అది మూగకుండ "వెంకటరావును జంపుటకు మీతాతలు దిగిరావలెను !" అని పండ్లు పటపట గొఱుకుచు నఱచితిని. మాటలు క్రోధావేశమున, నోరుజారివచ్చె ! వారిభయము చూచితి వనెను సూంధని కేకనైచెను. సఖారాము కాళ్ళు

విడిచెను. యజమాని పాదములు వదలెను. శవము క్రింద బడెను. ఇక నే నాగలేదు. గోడయెగిరి, వీధిలోనికి దుమికి క్షణములో వారి దృష్టిపథమునుండి మాయమైతిని.

---

## పండ్రెండవ ప్రకరణము

తెల్లవారెను. మరల నేను స్వేచ్ఛగా నా గృహము సం దొక్క శయ్యపై సుఖముగా శయనించియుంటిని. నా జీవిత కాలమునందు రెండు రాత్రులను మఱపజాలను. ధారాపురము రాధారిబాటపై సిరువురు మనుజులను జూచి నది మొదలు, నేను పురములో గుఱ్ఱపుబండినిగాంచి జాఫరహమ్మదును బిలిచి ఫలము గానకపోయి శయనించిన నాటి రాత్రి మొదటిది. రెండవది క్రిందటిరాత్రి. నేను వినోదమందిరమునందు ఖైదీగానుండి తప్పించుకొనుట మొదలు, తోటలో నైఋతిమూల వల్లభరావు మొదలైనవారు శేషులను బాధిపెట్టబోవునపుడు వారిని బెదరించి, గోడ దుమికి, సందుల గొందులబడి నా యిల్లు చేరి శయనించిన నిన్నటి రాత్రి, వారము దినములక్రిందటి దానివలెనే యద్భుత విషయములతో గూడినదై, ఘోరమై, భయంకరమై, యనేక ముఖ్యాంశములతో నొప్పుచు నా భావి జీవితము మార్చివైచెను.

పది గంటలకు భోజనముచేసి నేను సుఖముగా బడక కుర్చీపై విశ్రమించి జరుపవలసిన విధానమును గూర్చి దీర్ఘముగా నాలోచింప దొడగితిని. చినూరుపోవుబండి రెండు గంటలకు గాని రాదు. దానిపై జినూరు తప్పక వెడల నిర్ధారించితిని. ఇంక జాల వ్యవధానముంటచే సంగతిసందర్భములు చక్కగా యోజింప నవకాశముండెను.

ప్రప్రథమమున నాకొక భయము జనించెను. క్రిందటి రాత్రి తోటలో నేను వారి సంభాషణవినుచు, జర్యలగమనించుచు బొంచియుండినట్లు నేనచుటవలన వారికి విశదమాయెను. సావధానముగ నాలోచించినప్పుడు నేను చేసినపని పెద్దతప్పని తెలిసికొంటిని. ఉద్రేకమువలన వారికి నాయునికి తెలిసినవారు ముందుసంగతి విచారించుకొన నవకాశమిచ్చితిని. దానివలన వారు జాగ్రత్తపడి, శీఘ్రముగ చినూరు సతారాముని బంపి, పద్మలతను మాయముచేసిన? రాత్రి యొంటిగంటన్నరకు రాయపురము పోవుబండి యుండెను. దానిపై సతారాముగాని, వల్లభరావుగాని చినూరు పోయియుందురా? శేషులు శవమునుబూడ్చివేసి రైలుకు వెళ్ళుటకు వారి కవకాశమేది? నేను తోట వీడునప్పటికే యొంటిగంట దాటియుండెను. అంతసంగతి జరిగిన తరువాత వారు శవమును ఆగోతిలో బాతిపెట్టరు. నే నారక్షకభటుల దీసికొని వత్తునని వారు భయపడి కళేబరమును వేఱొకచోట

బోధము చేసియుందురు. ఈపని చేసి చికనూరుబండి యందు కొనుటకు బొత్తిగా కాలములేదు. అదియుగాక నేను వారి సంభాషణ మెంతవఱకు వింటినో వారికెట్లు తెలియును?

కావున వారనుమానించి చికనూరు వెళ్ళదలచిన నేను రెండుగంటల బండికే పోవలయునుగదా? అట్లయిన వారు నా కంటబడకుండ నెట్లు పోవుదురు? నేను వెంబడించి వారి ప్రయత్నభంగము చేయుదును. పద్మలత యున్నగృహము వారే నాకు జూపినవారగుదురు, తత్క్షణమే చికనూరిలోని యారక్షకభటుల సహాయ్యమున నామెను రక్షించి దొంగలనుబట్టవలయును. అప్పుడు సంగతులన్నియు వెలువడును. అటుగాక యెవ్వరును చికనూరు రాకపోయిన నన్నివిధముల మేలగును. నాకు వలసినంత సావకాశముండును.

అలివేణి యెవ్వతె? ఆమెకును, వీరికి నేమిసంబంధము! చికనూరిలో నామె గృహమెచ్చట? మొన్నటిరాత్రి నేను వినోదమందిరములోనికి వారి ననుసరించినప్పుడు నేను పట్టుపడకముందు వారనుకొనుచున్న మాటలు నాకు జ్ఞప్తికి వచ్చెను. కావున నలివేణిగారి గృహము శేషులుగారి యింటి ప్రక్క నుండవలయును శేషులు భోగస్త్రీ—అలివేణియునై యుండవచ్చును. ఉండవలెను అందుచే నానిగృహము కనుగొనుట యంతకష్టము కాదు. ఆమెకును ధారాపురమునందలి యీదొంగలకును నున్న సంబంధము నిమ్మళముగాన దెలియవచ్చును. అంతవఱకు నోపిక వహించి యుండవలెను,

ఏది యెట్లయినను చికనూరు ప్రయాణము మధ్యాహ్నము రెండుగంటలబండికి నిశ్చయము. దాని పర్యవసానము భగవంతుని కెఱుక. బండి చికనూరులో నైదు గంటలకు దిగును. ఇల్లు కనుగొనుటకు నాకు వ్యవధియుండును. అలివేణి మొకలకువారు పద్మలతను దాచిపుచ్చ ప్రయత్నించిన దగు ప్రతిక్రియ ముందుగనే యోజించి యుంచితిని. ఈలోపుగ నాలుగు గంటల కాల ముండెను. ఉబుసుపోవుట యెట్లు ?—నా కొక యుపాయము తట్టెను.

ధారాపురమునందు "పోలీసు యిన్‌స్పెక్టరు"గ నున్న శ్యామలరావు నా ప్రాణస్నేహితుడు. మేము బాల్యము నుండియు నొకరిప్రాణ మొకరుగ నుంటిమి. ఆతనితో నా రహస్యము లన్నియు జెప్పుచుండెడివాడను. పద్మలతను గూర్చి యెన్నిమారులో జెప్పి యెన్నిమారులో నాతని యెదుట జించుచుండెడివాడను. ఆతని రహస్యము లన్నియు నాకు జెప్పుచుండెడివాడు. నే నిప్పు డాతని చెంతకు బోవ నిశ్చయించితిని.

నేను పోవునప్పటికి శ్యామలరావు చుట్టగాల్చుకొనుచు నొక కుర్చీపై సాధారణముగ గూర్చుండియుండెను. ఆతడు నావలెగాక పొడవరి. సరిగా రెండుగజములు నుండెను. నే నెనిమిదంగుళము లాతనికి తక్కువగ నుంటిని. ఆతడు సన్నగా నుండునుగాని, బలవంతుడు, పెండ్లియైనది, పిల్లలు గలరు. శరీరఛాయ చామనచాయ. ముఖము సాధా

రణముగా జెలు నవ్వులో గూడియుండును కాని, యవసరము వచ్చి నప్పుడు మిక్కిలి గంభీరముగ నుండగలడు— గొప్పగ మీసములు గలవు. అన్నివిధముల బోలీసు ఇన్‌స్పెక్టరుపనికి దగినవాడు.

"రావోయ్, వెంకటరావ్, రమ్ము కూర్చుండుము" అని యాతడు నాకొక కుర్చీచూపెను. నే నాసీనుడనైతిని.

"ఈనడుమ జొత్తిగా వచ్చుట మానినావు. ఊరిలో లేవా?" అని శ్యామలరావు గుప్పుగుప్పున బొగ విడుచుచు నడిగెను.

"ఊరిలోనే యుంటిని—కాని—"

"కానియేమి?" అత డనెను. "ఏమి జరిగినది? నీతీరుచూడ నేవియో విశేషములు జరిగినట్లున్నవే!"

"ఔను విశేషములన్న విశేషములా?" నేను ప్రత్యుత్తర మిచ్చితిని? "వినిన మిక్కిలి యాశ్చర్యము చెందుదువు. అతిఘోరములు!"

"అయిన వెంటనే యారంభించుము—వెంటనే!" అని యాత డాశ్చర్యము సూచించుచు నడిగెను.

"మొదట శుభసమాచారము వినుము—పద్మలత జీవించియున్నది!" శ్యామలరావు చేతిలోనుండి చుట్ట క్రింద బడెను. మరల జన్మలో నాత డంత యాశ్చర్యము చెందడని చెప్పగలను. ఆతడు స్తంభితుడై పోయెను.

"నిజముగా—పద్మ—పద్మలత—"

నే నాతనిమాటల కడ్డువచ్చితిని. సంగతు లాద్యంత మను వినుము. నీవు నిర్ఘాంతపడుట మానుదువు.''

నేను నాకథ మొదలుపెట్టితిని. జరిగినవిషయము పూసగ్రుచ్చిన ట్లాద్యంతము నాతనికి త్వరగా వినిపించితిని. భక్తశ్రేష్ఠుఁడగు ప్రహ్లాదుడు సహితము విష్ణుసంకీర్తన సుధారసమునంత యాత్రభానముతో గ్రోలియుండడు శ్యామలరావు ఆశ్చర్యము సూచించెను—భయముకూడ గనుపఱచెను. ఘోరమని యఱచెను. చిత్రమనుచు లేచెను. అద్భుతమనుచు నడ్డము వచ్చెను. మఱియు నా యా సమయముల ననేక భావముల వెలిపుచ్చెను. గంటలకాలములో విషయములన్నియు జెప్పితిని. అప్పటికే పంద్రెండు గావచ్చుచుండెను. అప్పుడు మేమిట్లు ప్రసంగించితిమి. ''నే చెప్పిన నిదర్శనములపై వీరిని బట్టుకొనవచ్చునా?'' అని నేనడిగితిని. ''కష్టమని తలంచెదను'' శ్యామలరావు సమాధానము చెప్పెను. 'చీటివారు వ్రాసినట్లు నిరూపించుట కష్టము. నిజమైన పద్మలత జీవించియున్నట్లు తెలిసినను మనమామెను జూచువఱకు నాయంశ మనుమానాస్పదము క్రిందనె యుంచవచ్చును—'

'మఱి యాకిటికీ? నేను తప్పించుకొనిన గవాక్షము—శేషులను బాతిపెట్టినగోయి?—' అని నేనాత్రముగా ప్రశ్నించితిని. శ్యామలరావు నవ్వి యిట్లనెను. ''అకిటికీ యొక గొప్ప సాక్ష్యము గాఁజాలదు. ఇంక శవముసంగతి యంటవా ?

నామాటలు నమ్మరైతిరి. శేషులా గోరీలో లేరు. ఇంత జరిగిన తరువాత వారు జాగ్రత్తపడియుందురు.'

ఆతడింకను సరిగా ముగింపకమునుపే యొక పోలీసు వచ్చి సలాముచేసి నిలువఁబడెను.

''ఓరీ! ఏమి విశేషములు!'' అని శ్యామలరావడిగెను.

'మనదక్షిణపు కాల్వలో ఒకస్త్రీ శవము తేలినది. తమరు రావలయును' అని వాడు వినయవిధేయతలతోఁ బ్రత్యుత్తర మొసగెను. నేనును శ్యామలరావు నొకరిముఖ మొకరు చూచుకొంటిమి. మేమూహించినట్లే జరిగెను. భయపడి వారు శేషుల శవమును దక్షిణపు కాలువలో బారవైచినట్లు వీశదమాయెను. అయిన దీని వలన నొక విషయము మేలాయెను. వల్లభరావుగారి, సత్యారాముగారి చిన్నారు వెళ్ళలేదనుట స్పష్టమయ్యెను.

ఇన్‌స్పెక్టరు లేచెను. నేనును లేచితిని.

'చూచుటకు వచ్చెదవా' అని యాతఁడు నన్నడిగెను.

'వచ్చెదను' అని చెప్పితిని.

'చూచి తరువాత చిన్నారుపోయిన యచ్చట నీప్రయత్నములు చేయుము. నీ జయాపజయంబులంబట్టి ముందు జరుగవలసిన క్రమము విచారింతము.'

మేము అరగంటలో దక్షిణపు కాలువగట్టునకు వచ్చితిమి అచ్చటనొక గుంపుయుండెను. మమ్ముజూచి వారు దారియిచ్చిరి. మేము గుంపుమధ్యకు బోతిమి. అచ్చట బచ్చికపైనొక స్త్రీ

శవముండెను. చూపుమాత్రములో నది శేషుల శవముని గ్రహించితిని. ఇన్ స్పెక్టరు నానంక జూచెను. నేను తల యూచితిని. మేమిద్దరము జాగ్రత్తగా జూచితిమి. ఆమె నడుమున కొక త్రాడు కట్టబడియుండెను. అది తెగుటచే రాయిక్రిందనే యుండి శవము తేలెను. ఎంత తడసిన నెత్తురు మచ్చలింకను నామె గడ్డముపైనను, వక్షముపైనను, గాన వచ్చుచుండెను.

ఒకట్టి నిట్టూర్పు పుచ్చి, శ్యాములగారు దగ్గర సెలవు తీసికొని, నేను విచారముతో మెల్లగా నడుచుచు స్టేషను దారి పట్టితిని.

---

## పదమూడవ ప్రకరణము

స్టేషను కేగుచుండగా త్రోవలో నాకొక యోజన దట్టుటచే నింటికి జని నా యాదుగుళ్ళ 'రివాల్వరు' (ఒక విధమగు తుపాకి) తీసి భద్రముగ నంగరకాలలో దాచితిని. చేసిక్కైనను పంచితని మజికొంత పైకము తీసికొంటిని. గృహాధికారులతో గొన్ని దినములవఱకు బహుశా రానని చెప్పి, వారి సెలవుగైకొని గమ్యస్థానము చేరితిని.

అప్పటి కొంటిగంటన్నర కాలమాయెను చిక్కుతూరు నకు టిక్కట్టు తీసికొని యొకచోట గూర్చుండి మనసులో నొక విధమగు ననుమాన మంకటచే నటునిటు వచ్చుచు

పోవుచున్న మనుజులను జాగ్రత్తగా బరిశీలించుచుంటిని. కొలదికాలము గడచెను. బండివచ్చు వేళయాయెను, నేను లేచి సిద్ధముగ నిలువబడితిని. సతారాముగాని, వల్లభరావు గాని, రానందులకు నాకు జిత్రముగనుండెను. వచ్చిరేమో? అయిన నాకు గనబడలేదేమి?

నాకు సంభవించిన యీ చిత్రచరిత్రలో గ్రొత్త భాగము వచ్చినది నేను ధారాపురము విడిచిపోవుచున్నాను. ఇకముందు జరుగు విశేషము లన్నియు నించుమించుగా దుది వఱకును ధారాపురము వెలుపల నితర స్థలములయందు నడచును. ఇంత దనుక బద్మలత జీవించి చికనూరులో నున్నట్లును, ధారాపురములో వినోదమందిరమునం దున్న వారలు నిజమైన వల్లభరావు, భార్య కారనియు మాత్రము తెలిసెను. ఇకముందు వారి యునికిపట్లను, చరితమును విచారింపవలసి యుండెను.

నేను ధారాపురము విడిచి యెన్ని దినములుండవలసి వచ్చునోయని తలపోయ జొచ్చితిని. అలివేణిగారి యింట నెట్లు చాకచక్యముగా మెలగవలయునో యను సంగతి పలు విధముల బలుమారు లూహించుకొన దొడగితిని. సతారాము తప్పక బండికివచ్చునని నాకు నమ్మకముకలిగెను. కాని యెంత చూచిన నాతని జాడను గనుపడకపోవుటచే వింతగనే యుండెను. ఇంతలో దూరమున మ్రోతపుట్టెను. గబగబ లాడుచు బండి వడిగా ధారాపురము వచ్చుచుండెను.

అప్పుడు మఱొకసారి నా చుట్టుప్రక్కల నున్న గుంపులవైపు శ్రద్ధగా జూచితిని. కాని నేను వెదకుచున్న ముఖము కాన్పింపలేదు బండి వచ్చెను. నేనెక్కితిని. ద్వారమునొద్దనే కూర్చుండి దిగువారిని, ఎక్కువారిని బరీక్షించుచుంటిని. "ప్లేటుఫారము" (Plat Form) అంతయు నల్లకల్లోలముగా నుండెను. సరకులు దించు వారును, సామానులు మోయువారును, కేకలు వేయు కూలివాండ్రును, సర్దు పోలీసువాండ్రును, ఎక్కు ప్రయాణీకులును, దిగు ప్రయాణీకులును, పళ్ళబుట్టల వారును, మిఠాయి గంపల వారును, తములపాకులమ్ము వారును, "సోడా, లిమ్నేటు" అని కేకలు వేయువారును—ఆ స్థలమంతయు గందరగోళ ముగా నుండెను.

ఆ గందరగోళములో నొక్క క్షణకాలము నాకొక ముఖము కనుపట్టెను. కణతపై పుట్టుమచ్చ యొక్క క్షణము బాగుగా గానవచ్చెను. ఆ క్షణములో నేను సతారామును గుర్తుపట్టితిని. కనురెప్పపాటులో నావదనము మాయమై పోయెను.

నేనూహించిన ట్లాయెను. సతారాము బండికి చికు నూరు వచ్చుచుండెను. ఆతడు నన్ను చూచియుండునా? నేనును చికనూరు ప్రయాణము చేయుచున్న ట్లాతనికి దెలియునా? సిస్సందేహము. అంతవఱ కెచ్చటనో దాగి యుండి, నేను బండిలో బ్రవేశించిన తరువాత నాతడువచ్చి

యెక్కెను. ఆతని గోప్యవర్తనమువలననే నారాక యాతనికి దెలియునని తలపవలసియుండెను. నేను మరల జాగ్రత్తగా జనుల జూడ నారంభించితిని. కాని యాతని వదనము తిరిగి నా కగపడలేదు. ఎచ్చటనో యెక్కెనని తెలిసికొంటిని. మఱి కొంతసేపటికి బండి కదలెను

నా భావి ప్రవర్తననుగూర్చి పరిపరివిధముల ద్రోవలో నాలోచింప జొచ్చితిని. సతారాం నేనెక్కిన బండిలోనే వచ్చుచున్నాడుగదా? ఆతడు తప్పక చికనూరులో దిగును. నేను నచ్చటనే దిగుదును. నేను పురమునకు గ్రొత్తవాడ నగుటచే అలివేశిగారి గృహము విచారించుటకు గొంత కాలము పట్టును. ఈలోపుగ సతారాము ఆ భోగస్త్రీ యింటికి వెళ్ళును. ఆత డెఱిగినచోటే కనుక దొంగరగా నాతడు పోగలడు. పోయి, నేనా గృహముచేరుటకు పూర్వమందే పద్మలతను మాయమాటలచే నచ్చటనుండి తప్పించి నన్ను మోసగింప వచ్చును. అప్పుడు నా ప్రయత్న మంతయు నిష్ఫలమగును. చికనూరి ప్రయాణము వ్యర్థమగును. కాబట్టి చేయవలసిన పనియొక్కటె కనబడుచున్నది సతారాముసు కనుదాటి పోనీయగూడదు. చికనూరు దగ్గిర దిగుటతోడనే యాతనిని నీడవలె ననుసరింపవలసి యుండెను—కాని లాభ నష్టములబట్టి తరువాత సంగతి విచారింపవలసి యుండును.

నేనాప్రకారమే చేయనిశ్చయించితిని. చికనూరులో బండిదిగినప్పటినుండియు నాచాకచక్యమంతయు వినియోగించి

సత్యారాము ననుసరింప దలచితిని, అతడు తిన్నగా అలివేణి గృహమున కేగుట సహజము. ఒకసారి యచట జేరినతరు వాత పద్మలతను నాదృష్టిపథమునుండి యాతడు తప్పింప జాలడు. అమెను రక్షించుట సులభమగును పద్మలతను మరల జూడగలుగుదును. ఆమెకు మహోపకార మొనర్చినవాడ నగుదును. దానికి బ్రతిఫలము?—

నేను చెప్పనక్కరలేదు. అయిన పద్మలత యెట్లు న్నదో? చిక్కియున్నదో హతాశయై జీవచ్ఛవము వలె నున్నదో? ఆవదన మిప్పటికిని ముద్దులు మూటగట్టుచుండును ఆపెదవులపై నిప్పటికిని మందహాస మిల్లుగట్టుకొనియుండునా? ఆ శరీరమున నింతకనుక గాంతి కృశింపకుండునా? ఆనీల నేత్రములం దిప్పటికిని నమాయకత్వము ప్రకాశించుచు నోలుకచుండునా? ఎనిమిదేండ్ల కారాగృహ మహాకఠిన వాస మామె నెట్టిదుర్దశల పాలుచేసియుండదు? ఆమె మనసెంత చిన్నపోయెనో? వదనబింబ మెంత విన్నవోయెనో? పూర్వమువలె నుండకపోయినను గుర్తించుటకైన వీలుగ నున్నదో లేదో? నిజముగా నామె నాలుగైదుగంటల కాలము లోపల జూడనున్నానా? ఈ చిరునూరు ప్రయాణము నిజ మేనా? ఈ వారముదినముల నుండియు జరిగిన విశేషము లన్నియు, గలలుగావుగదా? నేను నిద్రనుండి లేచునప్పటికి ధారాపురమునందు శయ్యపై నుండనుగదా?—ఎట్లగును?

ఎనిమిది దీర్ఘసంవత్సరములనుండి నాప్రియురాలు జీవించియున్నను నేను కనుఁగొనలేఁ పోతిని గదా? ఆమె హాలీబాదులో మరణించెనన్న వెంటనే నమ్మి యెంతమూర్ఖుడనైతిని! నాప్రేమయు నొకప్రేమయేనా? ఇట్టి ద్రోహియందు బద్మలతకింకను గౌరవమును, ప్రేమయు నెట్లుండును? కాని బాగుగా విచారించి చూడనిందు తప్పేమియున్నది ? ఇంత మోసము జరుగునని యెవ్వ రూహిం చగలరు ? ఆమె పినతండ్రిని నేనుగాని ధారాపురవాసులు మఱెవ్వరుగాని యెఱుగకపోవుటచేనింతప్రమాదము సంభవించెను. పద్మలత జీవించియున్నసంగతి తెలిసినప్పటినుండియు నాచేయు ప్రయత్న మంతయు నామె యందలి నాకున్న యనురాగమును చాటుటలేదా ? ఆమె తన వెంకటరావును వేఱువిధముగా భావించుట యెన్నటికిని సంభవింపదు.

త్రోవపొడుగునను నీప్రకారమే మరల మరల రకరకములుగ యోజించుకొన జొచ్చితిని. త్రోవలోవచ్చిన ప్రతి స్టేషను దగ్గఱను దిగు మనుజులను, నెక్కు మనుజులను జాగ్రత్తగా జూచితిని. సతారాము బండిదిగునని నాకు ధైర్యము లేదు. కాని దేనికైనను మంచిదని నాయత్నముపై నేనుంటిని. 'రైలు' మిక్కిలి మెల్లగాఁ బోవుచున్నట్లు దోచెను. ఆప్రకారము నడచిన ప్రొద్దుగ్రుంకిన తరువాతగాని చికునూరుచేరదని తలఁచితిని. ప్రతిస్టేషనుసందును చాలాఆలస్య మగుచున్నట్లు

కనుపట్టెను. అది నాయుద్రేకముగాని బండి సరిగానే పోవు చుండెను. మామూలువేళకే చిరుమూరు చేరునట్లుండెను. అయిన నెప్పుడు చిరుమూరులో అడుగుపెట్టుదునా యని తహతహపడుచుంటిని. నామనసు గిజగిజలాడుచుండెను.

సాయంకాల మైదుగంటలగునప్పటికి సరిగా బండి చిరుమూరుకొద్ద నాగెను. నేను కొంతకాలము దిగక దిగువారిని పరీక్షించుచుంటిని, కాని సతారాము దిగినట్లు కనుపట్టలేదు. నేను దిగి టిక్కెట్టు తీసికొనుచోటున కరిగి యచట నిలిచి వెలుపలి కేగువారినొక్కొక్కరిని బరీక్షించు చుంటిని. ప్రయాణికులసంఖ్య క్రమక్రమముగా దగ్గెను. తుదకు నేనొక్కడనే నిలిచియుంటిని. ఇంకను సతారాము జాడలేదు.

బండి స్టేషను విడిచెను. అచటనున్న కొద్దిమందిమను ష్యులలో నాతనిజాడ కానరాలేదు. ఇంకను అయిదు నిము సములాగితిని టిక్కెట్టు లిచ్చుచోటనే నిలిచి చూచు చుంటిని. ఆతడు కన్పడలేదు. బహుచిత్రము! సతారాము చిరుమూరులో దిగలేదు!

వెనుకస్టేషనులలో దిగియుండడు, ఇచ్చట దిగలేదు. మరల నేదైన మోసము జరుగుచున్నదా? కాక నేనెవ్వరినైన జూచి సతారామను భ్రమపడితినా? ఆ విషయముమాత్రము నాకు మిక్కిలి నమ్మకముగా నుండెను. సతారాములు కన్ను లార జూచితిని ఒక్కడుగామే కానిదున్నా. ఆతడు ధారాపుర

యములో బండి యెక్కినట్లు నేను రూఢిగా జెప్పగలను ఆ విషయము నిస్సందేహము.

అయిన నాతడు చికనూరులో నేటికి దిగలేదు. రాయపురము పోయియుండునా? అం దాతని కేమిపని? పద్మలత యచ్చటలేదు. సతారాముప్రవర్తన యగోచరముగనుండెను. కాని నేనిక వింతచెందుచు నచ్చట నిలువక వెలుపలి కేగితిని.

“అయ్యా! బండి కావలయునా?” అనుచు నొక గుఱ్ఱపు బండివా డడిగెను.

“కావలయును” అని సమాధాన మిచ్చితిని.

“ఎక్కడికి?”

“అలివేణియను భోగస్త్రీయింటికి” అని నేను యా యిల్లెఱుగునేమోయని వాని నడిగితిని.

“ఎఱుగుదునండి—అంబాలయమువద్ద” అని వాడు చెప్పెను.

“అయిన బోనిమ్ము.”

నేను బండి యెక్కితిని, పావుగంటకాలము చికనూరు నడివీధిలోగుండ బ్రయాణముచేసి యొకమూల తిరిగితిమి. అది యొకసందు. దానిచివర దెల్లని గుడి యొకటి కానవచ్చుచుండెను. అది అంబాలయమని బండివాడు చెప్పెను. బండి యకస్మాత్తుగా నాగెను. నేను దిగితిని.

“అలివేణి గృహమేది?”

"ఈమేడయే" అని బండివాడు నా కుడిచేతివైపున నొక కట్టడము చూపించెను. అది ధనికులకు జెందినట్లు తోచుచుండెను. దానిప్రక్కన మఱియొక మేడ యుండెను.

"ఇదెవ్వరిది"

"శేషులు అను దానిది"

నా కనుమానము తీఱెను. బండివానికి కూలి యిచ్చి పంపితిని. తత్క్షణమే వెనుకముం దాలోచింపక వాకిటతలుపు తట్టితిని. అది త్వరలోనే తీయబడెను. నాయెదుట సుమారిరువదియైదేండ్ల తరుణి నిలిచియుండెను, ఆమె దేహముపై బెక్కు నగ లుండెను. సుందరి. నల్లని కాటుకకళ్ళు. ఆమె తాంబూలము సేవించుచుండెను.

"అలివేణి యెవ్వతె?"

"మాఅక్క" అని చెప్పి నన్నేకదృష్టిగ నామె చూడ జొచ్చెను.

"ఇంటిలో నున్నదా?"

ఆమె యాశ్చర్యము సూచించెను. "లేదు నిన్ననే మోచుకూరు వెళ్ళినది" అని సమాధాన మిచ్చెను.

"ఒక్కర్తే పోయినదా?......పద్మలతను తీసికొని వెళ్ళినదా?"

ఆమె నిర్ఘాంతపడినట్లాయెను. తడబడుచు "తీసి-కొని-కొని—పోయింది!" అని యామె సమాధానము చెప్పెను.

నాపాదములు నేలలో బాతుకొనిపోయెను. నేను స్తంభమువలె నట్లే నిలువబడితిని.

# పదునాల్గవ ప్రకరణము

ఒక విషయము పలుమారులు సంభవించి నప్పుడు దాని యందలి క్రొత్తపోవుట సహజము. నాలుగుమారులు దొంగ నొంటరిగ జూచినవా డైదవసారి జంకడు. పది మారులు శవముగాంచిన యాతడు పదునొకండవసారి వానిని గూర్చి భీతిచెందడు. కొంతకాలము రాత్రుల దిరిగినవాడు తరువాత నొంటరిగా నెట్టి గాఢాంధకారమునందైన సంచరింప సాహసించును. అభ్యాసమువంటి విద్యలేదు.

నా విషయమునందు నంతే యాయెను. మొదట మొదట నేదైన ననుకొనని సంగతి జరిగిన మిక్కిలి వింత జెందెడివాడను. కాని యట్టి యద్భుతవిషయములు పెక్కు నా యనుభవములోనికి వచ్చుటచే నాపిచ్చి పోయెను. అనగా నేదైన మోసము జరిగినప్పుడు ఆశ్చర్యము సూచించెడివాడ గానని నాయభిప్రాయము కాదు. వింతచెందెడి వాడనే కాని కొలదికాలము మాత్రమే అచిరకాలములో మనస్థైర్యము తిరిగి వచ్చెడిది.

ఇప్పుడు నట్లు జరిగెను. ఆ వార్త కొంత వాక్యములు నన్ను స్తంభితుని జేసెను. అలివేణి నన్ను మోసపుచ్చెనని గ్రహించితిని. కాని వెడగువలె విస్తారికాల మట్లు నిలుపక

నాముఖమునందలి యాశ్చర్యభావము నణచివైచి, గంభీర ముగా నామెతో నిట్లంటిని.

"నీతో గొంత మాటాడవలసి యున్నది."

ఆమెయు నాశ్చర్యమునుండి కోలుకొని 'ఏమి మాటా డవలయును ?' అనెను. ఆమెతీరుకూడ గంభీరముగానుండెను.

'పద్మలతవిషయము'—కాని నీ పేరేమి ?

"నాపేరు తార. కాని పద్మలత విషయ మేమి' అని యామె నిర్లక్ష్యముగా ప్రశ్నవేసి చలింపక యట్లే నిలిచి యుండెను.

"ఇచ్చట జెప్పజాలను. లోనికి రమ్ము. ఇది మిక్కిలి అవసరమైన పని—చావు బ్రతుకులు" అని నేనంటిని.

ఆమె కదలలేదు. త్రోవలో నడ్డముగ నిలిచి యను మానము సూచించు చుండెను. నాకు చిరాకుగా నుండెను.

'చావుబ్రతుకు లేమి ?' అని యెట్టకేల కామె మెల్లగా నడిగెను.

"పద్మలత విషయమే" నేను విసుగుతో బ్రత్యుత్తర మిచ్చితిని. 'నేను సతారాము నెఱుగుదును. వారి మోస మెఱుగుదును. పద్మపైకీ యెఱుగుదును. ఇప్పుడామెను విడి పింపవచ్చితిని. నాకు సాహాయ్యము చేసిన నీకు గొంత బహు మానము—కోరుకొనుము.'

ఇంకను తార సంకోచించుచున్నట్లే కన్పట్టెను. ఆమె నన్ను చూచుట మానలేదు. నావాక్యము లామెయం దెట్టి మార్పును కలిగింపలేదు.

"రెండునూర్ల రూపాయలు చాలునా?—మూడు? నాలుగు?—పద్మలతను సురక్షితముగా నాకు జూపిన నైదు వందలు?—అమెను నాకప్పగించిన వెయ్యి? ఏమి?' అని నే నాసగొలుపుచు నడిగితిని.

"లోపలికి రండు" అని యామె దారితీసెను. నే ననుస రించితిని. మేడలోని హాలు ప్రవేశించితిని. అచ్చట గుర్చీపై దాను గూర్చుండి యామె నా కుయ్యాలబల్ల చూపెను. దానిపై నేనాసీనుడ నైతిని.

"ఒప్పుకొంటివా?" అని నే నడిగితిని.

"వేయి రూపాయలకు—'అని యామె వెంటనే సమా ధాన మొసగెను.

"మంచిది, నాప్రశ్నలకు బ్రత్యుత్తరము లిమ్ము'

"అడుగవచ్చును."

నేనారంభించితిని. ఎవ్వరెవ్వరిప్పు డీమేడ వీడిరి?'

"మా అమ్మ, అక్క అలివేణి పద్మలత నిన్నసాయం కాలమే గుర్రపు బండిలో మోముకూరు వెడలిరి."

నా రెండవప్రశ్న "పద్మలతను ఆకస్మికముగా దొల గించుటకు గారణమేమి?'

'సతారాము దగ్గఱనుండి వచ్చిన టెలిగ్రాము— "అర్జంటు"

సతారాము నన్నెట్లు మోసగించెనో నాకుఁ దెలిసెను. కాని యిది యేమి విపరీతము? నాబుద్ధి నాచెంతనే యున్నదా? నాకన్నులు మండిపోయినట్లయ్యెను. నేను తారను జూచుచు మహాగ్రహమున 'ఓసీ! నన్ను మోసపుచ్చ జూడకుము. పాముతోఁ జెలగాటమా! జాగ్రత్త!' అని యఱచితిని.

తార వడకెను. ఇది యేమి! నేను నిన్ను మోసగించితినా? ఎట్లు?'' అని యామె యడిగెను.

'టెలిగ్రా మెప్పుడు వచ్చెను? నిజము చెప్పుము. దాచవద్దు. భద్రము!' అని నేను బెదరించితిని.

''నిన్న సాయంకాలము నిజము దాచుటలేదు'' అని నిర్భయముగా నుత్తరము చెప్పెను.

వారు నిన్న టెలిగ్రా మెట్లిచ్చియుందురు? నిన్న రాత్రి యొంటిగంటయప్పుడుగదా తోటలో అన్నిసంగతులుజరిగెను. అంతవఱకును వారికెట్టి యనుమానమును లేదు. నిన్న యెట్లు తంతియిచ్చియుందురు? తారమాటలు నాకు నమ్మకముగ దోచలేదు. కాని యామెచెంత ప్రశ్నించియు లాభము లేకపోయెను. టెలిగ్రాము చూతమన్న నది వారే తీసికొనిపోయినట్లు తార చెప్పెను. కాలమువిలువ నాకుదెలియును. అచ్చట నుత్తరప్రత్యుత్తరములతో వ్యర్థసంభాషణ చేయుటకు వ్యవధానములేదు. కావున నంతటితో నాసంగతి విడిచివేసితిని. కాని విషయము మాత్రము మిక్కిలి విచిత్రముగ నుండెను.

"ప్రస్తుతము వారు మోదుకూరులో నుందురా?" అని యామె నడిగితిని.

"ఉందురు."

"నీవు నన్ననుసరింపవలయును — వొంటనే మోదుకూరెంతదూరము?"

"ఇరువది మైళ్ళు — దక్షిణముగా."

"లెమ్ము బహుమానము నుఱచిపోకుము. వేయి రూపాయలు!" అని నేను చెప్పి లేచితిని ఆమెయు లేచిత్వరగా రెండుమూడువస్త్రములు మూటగట్టుకొనెను.

మఱియరగంటలోపుగ నొక నడియుగు అశ్వశకటము నందు చికనూరు దక్షిణముగా దొరలిపోవుచుంటిమి. త్రోవలో తారనెన్నియో ప్రశ్నలడుగవలెనని నా కూహలు పోయెను. తనయక్క యుదంతమంత సులభముగ నామె యేల చెప్పెనో వింతగా నుండెను. ఆవిషయమై నేను సరకు చేయలేను. కేవలము వేయి రూపాయల యందాశచే నటులఁ జేసినను జేయవచ్చును. ఆమె నొక ప్రశ్నమాత్ర మడుగక యూరకుండజాలనైతిని.

"పద్మలత మిక్కిలి చిక్కియున్నదా?"

తార వెంటనే ప్రత్యుత్తరమిచ్చెను. "మేమామె నెట్టి కష్టమును పెట్టలేదు. అందుచే ఆమె బాగుగా చిక్కలేదు"

మనసునకుఁ గొంత యూరటకలిగెను. నాతరువాత ప్రశ్నయేమన, "ఎనిమిదేండ్లామెను మీరెందుకు మీమేడలో చెఱసాలయందుంచిరి.

తార తడవుకొనలేదు. "ఆమె పిచ్చిదియై యున్న ప్పుడు వల్లభరావుగారామెను మాకు అమ్మివేసెను. మేమా పిచ్చి కుదిర్చి—"

ఆమె యూగెను. అప్పటికి గనుచీకటి హెచ్చుచుండెను. ఆ యంధకారములో సహితము నానేత్రములాగ్రహమున బ్రకాశించుచుండెను. అయినను ఆమెతో వాదించి లాభము లేదని తెలిసికొని యిక బ్రశ్నలు చాలించితిని.

త్రోవ యంధకారమయ మాయెను. బాట ప్రక్క చెట్లు నల్లగా గానవచ్చుచుండెను. ఆ పెనుతెమ్మంబున గలగలమను బండిమ్రోత తప్ప నింకేమియు వినవచ్చుటలేదు. నేనొక వెలకాంతతో నట్టిసమయమున బండియందు క్రొత్త ప్రదేశములకు బ్రయాణ మొనర్చుట తలచుకొనిన నాకే మహాశ్చర్యముగ నుండెను. కాని యీ వారము దినముల నుండియు ననేక చిత్రస్థానము లందు విచిత్రసమయముల నుండుచు వచ్చితిని. నాది పోలీసు పని యగుటచే నాకు నట్టి ప్రయాణములకు లజ్జింప నవసరము లేదు మఱియు నుద్దేశము మంచిది. దారిలో దొంగలభయము లేదు. ఉన్నను నాయొద్ద "రివాల్వరు" ఉండెను.

సుమారు తొమ్మిదిగంటలకు మోదుకూరు చేరితిమి. అది బస్తీ. అచట నొక కోమటియింట దిగితిమి అచట భోజనము చేసి తారయు నేనును బయలుదేరితిమి. కొంతదూరము పోయినతరువాత నామె యొక పెంకుటి యింటియందు బ్రవేశించెను. మరల నైదు నిముసములలో దిరిగవచ్చెను.

"ఏమైనది!"

తార పెదవులు చప్పరించెను, "నే నను కొన లేదు. ఈ దినము సాయంకాలమే యీయిల్లు విడిచిరట—"

హతాశుడ నైతిని. కాని మరల ధైర్యము చిక్కబట్టి "ఎటు పోయిరి ? తెలిసినదా ?" అని యడిగితిని.

సరిగా తెలియరాలేదు. దాసరపల్లి పోయియుందురని నాయూహ.

మఱియొక యూరు ! "ఎంతదూరము ?" అని ప్రశ్నించితిని.

"ముప్పది మైళ్ళు—"

"నడుమ యూళ్ళున్నవా ?"

"పల్లెలు మాత్రము గలవు. అచట భోజనము చేయ వచ్చును."

ఇక నారాత్రికి ప్రయాణము లాభము లేదు. మేము బడలి యుంటిమి. అదియుగాక మోదుకూరునందు బండి దొరకదు. నాటికి నేను వైశ్యులింట శయనించితిని. తార తన బందుగు లింట బరుండెను.

రాత్రి నాకు నిద్దుర పట్టలేదు.

ఎట్లకేలకు తెల్లవారెను. మే మిరువురము శీఘ్రగమనము చేసితిమి. జట్కాబండ్లు లేవు. క్రిందటిదినమున వచ్చిన బండివాడు చికుసూరు వెడలిపోయెను. మిక్కిలి విచారించగా బాగుగా ధనమూశ పెట్టినతరువాత నొక రెండెడ్లబండి కుదిరెను. తొమ్మిదిగంటలకు దానిలో నెక్కి దాసరిపల్లి బయలు వెడలితిమి.

పవలెల్లు గడచెనో తెలియదు. యోజించియు నప్రదేశమువలనను మేము మిక్కిలి కష్టముగా ప్రయాణము సలిపితిమి. మార్గమధ్యమున నొక సంసారియింట భోజనమొనర్చి యచట నొకగంట విశ్రమించితిమి. మరల బయలుదేరు నప్పటికి రెండుగంటల మధ్యాహ్న మాయెను. అప్పటికి సగముదూరము గడచితిమి. ప్రయాణపు బడలిక తార యత్యద్భుతముగా నోర్చెను. ఆమె లేశమును విసుగుకొనలేదు. నేనామె శాంతమున కాశ్చర్యము చెందితిని.

ఎడ్లు మంచివే. త్వరగానే నడచుచుండెను. కాని యీ ప్రయాణము జన్మలో మఱుగువల్లు లేదు.

ఎట్టకేలకు దాసరిపల్లి వచ్చెను. అచట బండిబాడుగ నిచ్చి తార దారిచూపిన యింటి కరిగితిమి. అప్పటి కారు గంటలాయెను. కనుచీకటి పడుచుండెను. నేను వీధిలో నిలిచితిని. ఆమె లోనికి వెళ్ళి వెంటనే తిరిగివచ్చెను.

"ఏమైనది ?"

"వారిచ్చటికి రాలేదు." అని యామె నవ్వెను.

నా కనుమానము పుట్టెను. "రమ్ము" అని చెప్పి యామెను మనుష్యసంచారము లేని యొకచోటికి దీసికొని వెళ్ళితిని.

అచట నామె నొకట భయంకరముగ గలచితిని.

"ఇచ్చటి కెందుకు వచ్చితి ?"

నేను ప్రత్యుత్తర మీయలేదు. అంగరకాలోనుండి "రివాల్వరు" తీసి యామె కణత కానించితిని.

"అబదితివా, చచ్చెదవు! తల వేయివ్రక్కలగును! నిజమైన పేరుచెప్పుము." అని యముఁనివలె నడిగితిని.

"నాపేరు—పేరు—తార—అని చెప్పలేదా!"

"తల పగులును—నిజము చెప్పుము!"

"చంపవద్దు. అని యామె వణఁకుచు జెప్పెను. "నా పేరు—అ-లి-వే-ణి!"

---

## పదినేనవ ప్రకరణము

అలివేణి వాక్యములవలన నా మనసునం దెట్టి మార్పులు క్షణములో జరిగెనో వేఱ చెప్పనక్కఱలేదు. వెనుక శేషులమాటలు విని మోసపోతిని. ఇప్పు డీమె పలుకు లాలకించి తెలివి తప్పితిని. తనపేరు తారయని చెప్పి, నిజమైన నామము కప్పిపుచ్చి, నాకెంతయో యుపకారివలె వచ్చి యలివేశి నేను పద్మలతను చూడకుండ జేసెను. మీఁదుమిక్కిలి నన్ను తప్పుదారికి దెచ్చి తనతల్లి పద్మలత నెచటికో తీసికొనిపోవుటకు మిక్కిలి సాయ మొసఁగెను. ఇప్పు డామె నేమిచేయవలెనో నాకు దెలియలేదు. శిరము భిన్నాభిన్నము చేయవలెనని యుండెనుగాని కోప మాపుకొంటిని. క్షణము యోజించి యామెకు దెలిసిన

దంతయు జెప్పునట్లు చేసి, యూమె చేసిన మోస పర్యవ
సానము మేలుగ ముగింపదలచితిని.

ఆమె నిర్ఘాంతపడి, తెల్లని కళ్ళతో నన్ను అప్ప
వాల్పక చూచుచు నట్లే నేలపై నాసీనయై యుండెను. ఆమె
స్థితిని జూచినప్పుడు నాకు గనికరము కలుగలేదు. ఆమె
చేసిన మోసపునైజ మట్టిది. ఏ సమయమున ప్రతిక్షణమును
నా ప్రాణపదముగ నెంచుకొనుచు నమూల్యముని తలంచు
చుంటినో, యట్టి సందిగ్ధ తరుణమున నొకదినమెల్ల అలివేశి
నన్ను కోలుపోజేసెను. ఆమె యభిప్రాయము కనుగొనవలసి
యుండెను.

"నన్నిట్లు మోసపుచ్చుటలో నీ యభిప్రాయమేమి?"
అని నే నామెను గద్దించి యడిగితిని.

ఆమె ప్రత్యుత్తర మీయలేదు. స్తంభితయై నన్నట్లే
చూచుచుండెను. నాకు క్రోధ మాగుటలేదు.

"ముమ్మాటికి జెప్పుచున్నాను. నేను వేయు ప్రతి
ప్రశ్నకును నీవు సమాధానము చెప్పవలసియుండును. లేక
పోయిన—నా చేతిలోనిది యేమి ?"

"రివాల్వరు" అన యూమె గజగజ వణకుచు జెప్పెను.

"ఇదిగో దీనిని నీ కణత కానించినాను. కాచు
కొనుము. నన్ను మఱల మోసగించినట్లు తోచిన నీతల
నజ్జునజ్జు చేసెదను. ఇచట నీకెవ్వరు తోడురారు—నన్నెవ్వ
రెఱుగరు—నిన్ను చంపి నేను పాఱిపోయెదను. భద్రము!
దాచక ఉన్నసంగతులు సరిగా చెప్పుము."

"చెప్పెదను—నన్ను చంప—వద్దు" అనుచు నామె కన్నీరు గార్పజొచ్చెను. కాని నేనామె బాష్పముల గమనింప దలచుకొనలేను. నాప్రశ్న లారంభించితిని.

"నన్ను మోసగించుటలో నీయభిప్రాయ మేమి?"

"ఇది మాపన్నుగడ—" ఆమె కన్నీరు తుడిచికొనుచు జెప్పెను. "మా అమ్మయు, పద్మలతయు జట్కాలో వెళ్ళిరి. నేను మిమ్ము మోసగించుట కింటివద్ద నుంటిని. తుపాకితీయుడు నా కణత నొప్పి యెత్తుచున్నది."

నేను రివాల్వరు కణతపైనుండి తీసి మెడముగా బట్టుకొంటిని. "బండిలో మీ అమ్మయు, బద్మలతయు మాత్రమేనా వెళ్ళినది."

"అవును. వారిద్దరు మాత్రమే."

"ఇప్పుడు చెప్పుము. టెలిగ్రా మెప్పుడు వచ్చెను?"

"సతారాముకొద్ద నుండి నిన్న పదిగంటలకు వచ్చెను. వెంటనే మా అమ్మ, పద్మలత వెళ్ళిరి."

"ఎచ్చటికి వెళ్ళిరి?"

ఒక తెప్పపాటుకాల మామె శంకించెను. కాని నా చేతిలోని రివాల్వ రామె యనుమానముల ద్రోసిపుచ్చెను.

"విలాసగిరికి" అని యామె సమాధాన మిచ్చెను.

ఆపేరు నేను వినలేదు "విలాసగిరియా ఎచ్చట? ఇచటికెంతదూరము?"

"రాయపురమున కెనిమిది మైళ్ళ అది ఒక కొండ; దానిపైన బాడుపడిన పెద్దదేవాలయము కలదు. అది దూరమునకు గన్పట్టుచుండును. ప్రస్తుతము వా రందున్నారు.

"సతారాము కూడానా ?"

"అవును. ఆతడు రాయపురమువచ్చి వారినందుఁ గలిసికొని విలాసగిరి తీసికొనిపోవును.

సతారాము చిఱునూరులో నేటికి దిగలేదో నాకు దెలిసిపోయెను." జెలిగ్రాము మూలమున నాయాశలు విఫలము లయ్యెను.

"వారిప్పటికిని విలాసగిరి యందుం—దురా" అని నేను మరల అడిగితిని.

"నిస్సందేహము." అని యామె ధైర్యముగా బ్రత్యుత్తర మిచ్చెను.

"నిన్నుకూడ దీసికొనిపోయెదను. వారిచట లేక పోయిన—సీతల—"

ఆమె నా వాక్యముల కడ్డమువచ్చి "అక్కఱలేదు. వారచ్చట గొన్నిదినములుందురు నన్ను తీసుకొనిపోవచ్చును."

"వారి యుద్దేశమేమి ?"

"చెప్పజాలను. సతారాము, మాయమ్మ ఏమి నిశ్చయించెదరో"

ముఖ్యమైన ప్రశ్న మొకటియుండెను. ఇంతకుముందే దానిని పలుమారు లడుగవలెనని, తలంచియు నూరకుంటిని. ఎట్లకేలకు నామనసు ఆగలేదు.

"సతారామును పద్మలత తిరిగి ప్రేమించుచున్నదా?"

"లేదు. ఆమె తనతల్లిని, పినతండ్రిని, మిమ్మును దలంచుకొనుచుండును."

నాహృదయముపైనుండి పెద్దబరువు తీసివేసినట్లాయెను. ఆమె సమాధానమువలన నాకు మఱిరెండు ప్రశ్నలు స్ఫురించెను.

"ధారాపురమునందు వల్లభరావునని చెప్పుకొనుచున్న యాతని నిజమైన పేరేమి?"

"తెలియదు."

"ముమ్మాటికి?—రివాల్వరు చూడుము."

"ముమ్మాటికి," అని యామె చలింపక సమాధానమిచ్చెను.

"నిజమైన వల్లభరావు జీవించియున్నాఁడా?"

"తెలియదు—ముమ్మాటికి"

ఇంకను నెన్నియో ప్రశ్న లడుగవలసి యుండెను. అన్నిటికంటె పెద్దప్రశ్న పద్మలత సంగతి యామెకు దెలిసినంత దనుక నాద్యంతము చెప్పుమని యడుగుటయే కాని కాలము లేదు. ఇదివరకే కాల మమూల్యమైనది ఇప్పుడు పదిరెట్లు! పద్మలతను వారేమి చేయుదురో? తెక్కలుండిన

నాక్షణమేపోయి విలాసగిరి గుడిపై వ్రాలియుందును. తెక్కలు లేవు. కావున నున్న సాధనములతో బ్రయాణము వీలైనంత త్వరలో సాగించవలసి యుండెను. అందుచే నేను రివాల్వరు దాచి కొంత సామ్మోమెయుండు బడవైచి యిట్లంటిని.

'పామ్మో, ఎట్లుచేరుదునో, యెప్పుడు చేరుదునో నాకు లెక్కలేదు. చిరునూరుపామ్మో. మరల మోసవృత్తి యారంభించుము. ఎవరో తల చెక్కలుచేసి విడిచిపెట్టెదరు—పామ్మో'

అనుచు నుహాగ్రహమున నావార కాంతను విడిచి నేను దాసరపల్లి వెడలి యచ్చట నొక కమ్మయాసామియింట భోజన మొనర్చి యచటికి రైల్వేస్టేషను నెటువైపున నెంత దూరమున నుండునని యడిగితిని. పడమటగా బది క్రోశముల దూరమున నున్నదని తెలియవచ్చెను. బాటయుండెనేమో కనుగొంటిని మట్టిదారికలదని తెలిసెను.

'ఇచ్చట ఎవరికైన గుఱ్ఱపుబండి కలదా?'

'గ్రామ మునసబుగారికి ఉన్నది.''

ఆయాసామిని తోడుతీసికొని గ్రామ మునసబుగారి గృహము చేరి యాయనతో నావృత్తి చెప్పి మిక్కిలి యగత్యమైన పనిమీాద గుఱ్ఱపుబండి కావలసివచ్చెనని విషయము కొలదిగ జెప్పితిని. ఆతడు సత్పురుషుడు తత్క్షణమే బండి కట్టించెను. ఒక దీపముకూడ నిచ్చెను. ఆతనికి నాకృతజ్ఞత తెలిపి ఫలిహారక లీయబోతిని— కాని యాతడంగీకరింప లేదు.

మరల జీకటిలో నొక మట్టిదారి వెంట దాసరపల్లికి బడమటగా ప్రయాణము చేయుచుంటిని. మేము బయలుదేఱు నప్పటికి దొమ్మిదిగంటలు దాటెను. బండివానిని మేముపోవు చున్న స్టేషను పేరడిగితి. 'అరుణాచల' మని యాతడు తెలి పెను. నేనిదివఱకే యాపేరు వినియుంటిని. రాయపురము పోవుబండి యరుణాచలమునకు సరిగా పండ్రెండు గంటలకు వచ్చును. అది యచట నాగదు. కావున 'రైలు' మీద వెంటనే పోవు నాస వదలుకొంటిని. అయినను అరుణాచలము త్వరగా చేరవలెనని నాకుద్రేకముగా నుండెను. కాలమెట్లు గడచెనో తెలియదు త్రోవలో జిన్ని కాలువలవలన గొంత యాలస్యమాయెను. ఒంటిగంటకు మేమరుణాచలము స్టేషను చేరితిమి. బండివానికి రెండురూప్యములు బహుమానమిచ్చి నేను స్టేషనులోనికి బోయి సరకులబండి రాయపురము వెళ్ళు నది వచ్చునాయని యడిగితిని. అరగంటలోపుగ నొకటి రాగలదని తెలిసెను—నాసంతోషము !

మీరేమైన ననుడు. 'వేళావిశేషము'లందు నాకు మిక్కిలి నమ్మకముగలదు. నేను జట్కాబండి యడిగినంతనే గ్రామమునకబుగా రే.వేళ లేవకుండ నిచ్చెనో మాయదృష్ట మున కదే ప్రారంభము. ఆ క్షణమునుండియు ప్రతి విషయ మునుకలిసివచ్చెను. చిక్కుదారమునం దొక్క కష్టమగుముడి తీసిన మిగిలిన చిన్నచిక్కు లెల్లనుడిపోవునో మాసూపవ లాక్షణమునుండియు చెల్లాచెదరు కాజొచ్చెను. అంతవనుక

ప్రతికూలముగ నుండిన విధి నిముసములో ననుకూలముగ మారెను. సరకులబండి రెండవ యదృష్టము.

అరగంటలో నది వచ్చెను. దానిలో 'గార్డు' నకు గొంత లంచమిచ్చి యందెక్కితిని. అది మనుష్యులబండికంటె నాలస్యముగా బోవునని నాకు దెలియును. సరకులు దించుకొనుట, ఎక్కించుకొనుట యాలస్యమగును. కాని రాయపురముపోవు మనుజులబండి మఱునాడు తొమ్మిదిగంటల ప్రొద్దెక్కినప్పటికిగాని యరుణాచలమురాదు. అంతకుముందే నేను రాయపురము చేరుదును. బండిలో యోజించుచు బరుండి నిద్రించితిని. నిద్ర లేచునప్పటికి బండి రాయపురములో వచ్చి యాగియుండెను. దిగి వెలుపలికేగితిని.

అప్పటికి దెల్లవారుజామున నైదు గంటలాయెను. నేనొకచోట ముఖము కడిగి యూరిలోని కేగితిని. దెల్లవారెను. ఒక "కాఫీ హోటలు" నందు క్షుధ తీర్చికొని యొక జట్కా విచారించితిని. విలాసగిరి కని చెప్పినప్పుడు బండివాడాశ్చర్యము సూచించెను. 'అచ్చట దగ్గఱ యూరు' లేదని చెప్పెను. కొండదగ్గఱనే పనియుని చెప్పితిని. వాఁడు బండి కట్టెను. దడదడలాడుచున్న హృదయముతో ప్రయాణ మొనర్చితిని.

మేము విలాసగిరి జేరునప్పటికి ఎనిమిదిగంటల ప్రొద్దెక్కెను. బండివాని నొక తోటలోపునందు దాచి యచటనుండుమనియు గంటలో దిగి వత్తుననియు జెప్పి నేను

కొండ యెక్కుట ప్రారంభించితిని. పాడుపడిన తెల్లని దేవాలయము చాలాసేపటినుండి నాకగపడుచుండెను.

అందు పద్మలత యున్నదా!

అది యొక కొండగుట్ట. పదునైదు నిముసములలో దాని యగ్రముచేరి గుడిముందు నిలిచితిని. అది పెద్దది పాడు పడియుండెను. తలుపు మూసియుండెను. తలుపు నెట్టితిని. గడియలేమి రెక్కలు విచ్చెను.

లోన నొకశయ్యపై నొక ముసలిది కూర్చుండియుండెను. క్రింద నేలపై—ఆమె పద్మలత యగునా!

“పద్మలతా?” అని కేకవైచితిని.

మిగిలిన సంగతులు నాకు దెలియవు ఆ జవ్వని యులికిపడి లేచెను.

“వెంకటరావ్!” అని యఱచి యాసుందరి నన్ను గాఢాలింగన మొనర్చి, నా కౌగిటిలో మూర్ఛపోయెను.

---

## పదునారవ ప్రకరణము

ఎంత కాలమునకు బునర్దర్శనమాయెను! ఎనిమిదేండ్లకు కాదు. ఎనిమిది యుగములకు! చనిపోయినదని యాశలన్నియు వదలుకొనిన పద్మలత మరల బ్రతికివచ్చెను. ఆమెను నా హృదయమునకు హత్తుకొనినప్పుడనుభవించిన సంతోషము, సౌఖ్యము

పారవశ్యత ప్రేమించి చిరకాలవియోగ మనుభవించినవారికే యెఱుక. ఆమె యుచ్ఛ్వాసనిశ్వాసములగాలి నాకంఠమును మృదువుగా, దాకుచున్నప్పుడు—నేనెచట నుంటిని? ఈమె పద్మలత యగునా? నేను వెంకటరావునగుదునా? ఎనిమిదేండ్ల క్రిందట మరణించిన యీయామె యిప్పుడెట్లు సజీవయై నావక్షస్థలముపై విశ్రమించి యున్నది? ఆనందము హద్దుమీఱి నప్పుడు సత్యాసత్యవివేచన నశించిపోవును.

కాని నేనేమి చెప్పుచున్నాను! ఇన్ని యోజనలకు నాకు వేళ యెచ్చటిది? అన్ని సంవత్సరముల తరువాత జూచిన పద్మలత వదనమును తనివిదీఱునట్లు చూచుటకు నాకు కాలము లేదు. మూర్ఛిల్లియున్న యీయామెను సేదదీర్చుటకు నాకు వ్యవధిలేదు. కౌగిటిలోనున్న యీయామెను చాపపై బరుండబెట్టుటకు నాకు సమయము లేదు. నాప్రేమను చదువరులు మన్నింతురుగాక—ఆమె మద్దుపెదవుల ముద్దాడుటకు గూడ నాకవకాశము లేదు. ఎన్నాళ్ళకు అని వింత చెందుటకు గూడ నాకు వ్యవధానము లేదు.

గుడియంతయు మాఱుమ్రోగున ట్లొక ప్రచండమైన కేక వినవచ్చెను. సింహగర్జనము ఉఱుముమ్రోత దానిముందాగవు. గర్భాలయము తలుపులు దఢాలుమని తెఱచుకొనెను. లోనుండి యొక మనుజుని యున్నతాకారము నాకు నాలుగు గజముల దూరములోనికి గభాలున లంఘించెను.

అతడు సతారాము.

నే నెడమచేతితో పద్మలతను చుట్టి, కుడిచేతితో రివాల్వారు వెలికితీసి యాతని హృదయమునకు గురిపెట్టితిని.

ముందుకు కదుగు వేయబోవుచున్న యాతడు తెల్లపోయి తటాలున నాగెను. మరల ముఖమెఱ్ఱవారెను కన్నులు మండిపోవుచుండెను. పెదవులు కంపించుచుండెను. కనుబొమలు ముడిచికొనియెను. శిరోజములు చిందరవందరగా బడెను నుదుట జెమటపోసెను. ఎడమకణతపై బుట్టుమచ్చ మఱింత పెద్దదిగా నున్నట్లు కన్పట్టెను. శత్రువుపై దుముకనా? వద్దా యని యాత డనుమానించుచున్నట్లు కన్పట్టెను. చుట్టుప్రక్కల నేమి జరుగుచున్నదియు గమనింపక యాతని నేకదృష్టిగా జూచుచు నేను నిశ్చలముగా నట్లే నిలిచియుంటిని. తుపాకి యాతని గుండెలకు సరిగా బారుపెట్టబడియేయుండెను. "సింహము గుహ చేరితివా! నీచావు మూడినది!" అని బొబ్బలు పెట్టుచు సతారాము ముందున కడుగు వేయ గాలు నెత్తెను. పోలిక బాగుగనే యుండెను. ఆతడు సింహము వలెనే యుండెను. గర్భాలయము గుహ యనవచ్చును— కాని నేను నిర్భయుడగు వేటకాని ననుట యాతడు మఱచెను. వెనుకంజవేయలేదు. "ముందున కడుగు వేసితినా మఱి ఒత్తుచున్నాను. నిన్ను ఆరు మారులు పేల్చెదను. నెత్తురు ముద్దను చేసెదను. ఎముకల కుప్పవయ్యెదవు—కపడ్దార్" అని గంభీరముగా బలికితిని.

ఎత్తిన కాలు దించి యాతడు మరలసాగెను. ఈమారు సతారాము పళ్లు పటపట కొఱుకుట స్పష్టముగ వినబడెను.

'నీతుపాకి తగులబడ! నాకిది యెక్కడ దాపరించినది!' అని యఱచుచు నాతడు నాచేతిలోని రివాల్వరును ఘోరముగ శపింపజొచ్చెను.

'సింహముగుహకు వచ్చువాడు ఊరకవచ్చునా?' దాని నాశనసాధనము తీసికొనిరాడా?

నామాటల కాతడు గోడలు వడకునట్లు హుంకరించెను. "మే మిచ్చట నున్నట్లు నీకెవ్వరు చెప్పిరి?"

"మీఅలివేణి చెప్పినది—"

"మాఅలివేణి యేమి? ఆమెకు మాకు ఉన్న బంధుత్వము కూడ చెప్పినదా,' అని సతారాము బిగ్గఱగా ధిక్కారములో నడిగెను.

ఇంతవఱకును పిడికిళ్ళుపట్టియున్న హస్తము లిప్పుడాతడు వక్షస్థలముపై మడిచెను.

"చెప్పలేదు కాని త్వరలోనే తెలియవచ్చును" అని నేనాతని ప్రశ్నకు సమాధానము చెప్పితిని.

"ఎట్లు?—"

"మీరందఱు పట్టుపడినప్పుడు"

ఆతడు వికటముగా నవ్వెను. "ఈమారు నిజముగా గెలిచితిని అయినను సంపూర్ణముగా గాదు."

"నేను పిచ్చివాడనై యీమెను విడువలేను. మీ సంగతి తొందరగా జూడవలసియుంటచే వచ్చితిని"

"అలివేణి ప్రస్తుత మెచ్చటనున్నది?" అని యాతడు గంభీరముగా నడిగి నావదనమొకే విధముగ జూడజొచ్చెను.

"దేవుని కెఱుక"

"ఆమెను చంపితివా, దుర్మార్గుడా!" యనుచు సతారాము మరల బిడికిళ్ళు పట్టెను.

"చేసిన మోసమునకు తల సహస్రభాగముల జేసి యుందును—కాని అలివేణి స్త్రీ—"

సతారాము విపరీతముగ దలయూచెను.

"కాచుకొనుము!" అని కెవ్వునఱచి యాతడు గభాలున నామీదికి భయంకరముగ లంఘించెను.

నేను ఏమరియుందునని యాతనియుద్దేశమైయుండును. కాని వాని ప్రతిచర్యయు సూక్ష్మముగా గమనించుచు నేనప్రమత్తుడనై యుంటిని తుపాకి కాల్చకతప్పలేదు. అది సతారాము తెలివితక్కువ అయినను ఆతనిచంపుటనాకిష్టములేదు.

రివాల్వరు క్రిందికి వంచి యాతని మోకాలుమీదుగా గాల్చితిని.

గదినిండ బొగచుట్టుకొనెను. ఢామ్మనిమ్రోతపుట్టెను.

"చచ్చితిని!" అని యొక కేక వినబడెను.

"అయ్యో! నాయనా!" అని పెద్దయేడ్పువినవచ్చెను.

నేలపై నేదియో పెద్దపదార్థముపడినట్లు చప్పుడాయెను. రెండునిముషములలో పొగ విచ్చెను. వస్తువులు మరల స్పష్టముగ కన్పడజొచ్చెను. సతారాము నేలపై నడ్డముగా బడియుండెను. అతనితొడలోనుండి యెఱ్ఱని నెత్తురుకాలువ ప్రవహించుచుండెను. నాకు జాలికలుగలేదు. నేనాతని ప్రాణములతో విడిచితిని—ఆతడేమైనచో నిర్దయతో నన్ను చీల్చి వేసియుండడా? మా 'నాయనా!'యని పెద్దపెట్టున నేడ్చుచు అలివేణితల్లి సతారాముప్రక్కనబడి యేడ్వ జొచ్చెను. "నోరుమూయుము! నేను చావలేను. ఈ మాత్రమునకు చావను!'' అనుచు సతారాము కఠినముగ వేశ్యమాతను వారించెను. ఆమె బొబ్బలుపెట్టుట చాలించెను. నేను పద్మలతను చాపపై బరుండబెట్టి యలివేణితల్లిని సమీపించితిని.

ఆమె గడగడ వణకజొచ్చెను.

"ఇక స్త్రీలను జంపుదును. హా, హాహాహా'' అనుచు సతారాము పిశాచమువలె బిగ్గఱగా నవ్వసాగెను.

"ప్రేలకుము'' నేను కర్కశముగా సమాధానము చెప్పితిని. విస్తారము వదరిన కపాలము భిన్నభిన్నమగును.

"ప్రతిమనుష్యుడు ఒక్కమారె చచ్చును. నేను బెదరింపులకు చచ్చువాడను గాను'' అనుచు సతారాము మరల నవ్వెను. నేనంతట వేశ్యమాతవంక దిరిగితిని. ఆమె నాకాళ్ళపై బడెను. "సతారాము నాకొడుకు బాబూ! రక్షింపుము.

రక్షింపుము—నాకు ఒక్కడే కొడుకు! అనుచు నామె వల వల యేడువదొడగెను" "ఓసీ! వగలుచాలించి నాప్రశ్నలకు సమాధానము చెప్పుము" నేను కఠినముగా నంటిని, "నేను నీ కొడుకును రక్షించెదను. "చిత్తం బాబూ! చచ్చి నీకడు పున పుట్టుతాను అని ఆమె నాపాదము లెంతో కష్టముమీద వదిలెను. నేను నాప్రశ్న లారంభించితిని.

"సతారాము నీకొడుకా!"

"అవును బాబూ"

"మాధవి"

"చెప్ప—చెప్పవద్దు" అని తడబడుచు సతారాము సగము లేచి యఱపుచే మరల గ్రిందబడెను.

"నా పెద్దకూతురు నాయనా!" అని వేశ్యమాత చెప్పివేసెను.

"ధారాపురములో వల్లభరావు నని చెప్పుకొనుచున్న వాని పేరేమి?"

"అయ్యో! అయ్యో! నాకొడుకు మూర్ఛపోయి నాడు" అని వేశ్యమాత విలపింపజొచ్చెను.

"ఏడవకుము, నేను చెప్పితిని. నేను రాయపురిము పోయి వైద్యుని పంపుదును. ఈలోపుగ నీతని కేమియు ప్రాణాపాయము లేదు."

ఇక నేనచ్చట జేయున దేమియు గన్పడలేదు. ఒక పాత్రలోనున్న నీరు తెచ్చి పద్మలతముఖముపై జల్లితిని. ఆమె కన్నులు విచ్చెను. నాముఖము చూచుటతోడనే యామె వదనము వికసించెను నేనెచ్చట నున్నాను?'' అని యామె మృదువుగా నడిగెను.

''నీప్రియునివద్దను —నేను వెంకటరావును.''

''కలగాదుగదా? నిజముగా నీవు వచ్చితివా?''

''కలగాదు,నిజముగా నేనువచ్చితిని.నిన్నురక్షించితిని''

ఆమె కనులయందు అణగిఅణగియున్న యనురాగ మొక్కమారుగ పైకుబికెను. ఆమె చేతులెత్తి నాకంఠమును బలహీనముగా గౌగలించెను. వంగి నేనామె పెదవుల ముద్దాడితిని.

ఆ ముద్దు!

ఆమెను చేతులతో నెత్తుకొని, యాగుడి విడిచి కొండ దిగ జొచ్చితిని.

---

## పదునేడవ ప్రకరణము

మఱియొకగంటకు నేనును, పద్మలతయు గుఱ్ఱపుబండిలో రాయపురమువైపు మెల్లగా ప్రయాణము చేయుచుంటిమి. ప్రొద్దున తొమ్మిది గంటలాయెను. నేనును ఆమెయు వి[illegible]

గిరివైపు చూచితిమి. దానిపైన దేవాలయము తెల్లగా ప్రకాశించుచుండెను. దానిని చూచినకొలదిని నాధైర్యమును, జయమును, ప్రియురాలి రక్షణయు, కళ్లకు గట్టిన ట్లగపడుచుండెను. మహానందముతో నా మెవదనమువైపు చూచితిని.

నాదృష్టులయందలి భావమూమె గ్రహించెను. నవ్వుచు నా చేయిపట్టుకొని యెత్తుచు కృతజ్ఞత యొలుకునట్లు నన్ను మనోహరముగా జూచెను. ఆ చూపు చాలును. నా శ్రమయంతయు సఫలమయ్యెను.

"నేటికి నీకీ దీనురాలియెడ దయగలిగినదా ?" అనియామె మృదువుగ బలికి చిరునవ్వు నవ్వెను.

"నేను మనుష్యమాత్రుడను" నేను సగర్వముగా సమాధానము చెప్పితిని.

"విషయములు పరమేశ్వరుని యిచ్ఛప్రకారము జరుగును. దేవునకి హృదయపూర్వక వందనము లర్పించుదము."

ఆమె మందహాసముతో గనులు మూసికొనియెను. కాని యొక్కక్షణములో ముఖము గంభీరభావముసూచించెను మనసున సర్వేశ్వరునికి వందనము లిచ్చుచుండెనని తెలిసికొంటిని.

అప్పుడామె ముఖము చక్కగా బరీక్షించితిని. నేనూహించినంతిగా పద్మలత చిక్కియుండలేదు. ముఖము మిక్కిలిగా చిన్నవోయియుండలేదు. ఆమె కఠిన కారాగృహమున

నుంపబడినట్లు తోచుట లేదు. ఆమెనుజూచిన ఆమాట తలం చుటకు గూడ వీలులేదు. మనసున నేత్రోపచారమున్నట్లు వదనము స్పష్టముగా జెప్పుచుండెను. అందు దీనభావ మచ్చోటి నట్లుకానవచ్చుచుండెను. అంతమాత్రమే. మిగిలినలక్షణములు మనోహరముగనుండెను. దేహము కొలదిగ కృశించినది— కాని సూర్యరశ్మి తఱుచుగా జూడకపోవుటచే గాబోలు శరీరము ఛాయ మిక్కిలి సుందరముగా నాకర్షించుచుండెను. తానువలచిన రంభయందు రేమో! వయసువచ్చియున్న పద్మలత సౌందర్య మెట్టివారినైన నాకర్షింప జాలియుండెను. అయిదు నిముసములకు పద్మలత కన్నులువిచ్చెను. ఆమెముఖమున మరల మందహాస మంకురించెను. "నేననినవెంటనే భగవంతుని ప్రార్థించితివా!" అని నేనడిగితిని. అవును నా కష్టములకు నేటికంతము కల్పించినపరమేశ్వరునకు వందనము లొనర్చుట విధాయకము, నీవు దానిని జ్ఞప్తికి దెచ్చితివి."

ఆమెనవ్వుచుమాటలాడుచున్నప్పుడు నాసంతోషము వెల్లివిరియుచుండెను. ఆపలుకులు, చర్యలు, చూపులువెనుకటి మనోహరదినముల స్ఫురణకు దెచ్చుటయే దీనికి గారణము.

"నీవు శేషులమూలమునగాదా యిచ్చటికి వచ్చినది" అని కొంతసేపుండి పద్మలత నన్నడిగెను.

"అవును. నీరక్షణకు శేషులే కారణము"

పద్మలత నేత్రములు కృతజ్ఞతచే ప్రకాశించెను.

"శేషులు ఋణము నాజన్మలో దీర్చికొనలేను. అట్టి సచ్చరిత లేదు—ఇప్పుడామె యెచ్చటనున్నది?

ఈప్రశ్న నన్ను కొలదిగ కలతపెట్టెను. ఏమి చెప్పుటకును దోచక నే నూరకుంటిని.

"ఏమి? వెంకటరావ్, నిన్ను శేషులు చూడలేదా?" అని యామెతొందరగా నడిగెను.

"పది దినములక్రిందటచూచినది-ఆమె-" నేనాగితిని.

"ఆమె యేమి?"

"ఆమెను నీవు పంపితివా?

"అవును నిశ్చయముగా నేనే పంపితిని. లేనిచో నీ కెట్లు నాసంగతి తెలియవచ్చెను?"

ఆమె యుద్రేకము నాశ్చర్యము గొలిపెను. "శేషుల కేమైన గీడుమూడెనని భయపడుచుంటివా" అంటిని.

"ఔను. ఆమె యామోసగాండ్ర బెదరింతు ననెను. నేను వద్దంటిని. ఆమె క్షేమముగా నున్నదా?"

"ఆమె వారిని బెదరించెను. వారిచేత జిక్కెను."

పద్మలత ముద్దుమొగము వెలవెలపోయెను.

"వారామెను—ఆమెను—చంపిరా?" అని యామె గద్గదస్వరముతో నడిగెను.

"అవును ఆమె వినోద మందిరమున ప్రాణముల గోల్పోయెను."

ఆమె దేహము కంపించెను. చూపుని స్తేజముగా నుండెను.

"వెంకటరావ్! త్వరగా జెప్పుము. నీకు రూఢిగా దెలియునా?"

"నేను కన్నులార జూచితిని—"

"అయ్యో! పాపము! అనుచు నామె బాష్పములు దొడగెను. నాకు జేతనైనట్లు నేనోదార్చితిని, ఆమె యంతగా నేల విచారింపవలయునో యని నాకు జిత్రముగ నుండెను. శేషులు తనను మోసముచేయ నెంచినట్లు తెలియకుండుట చేతనే అయియుండవలెను. పదినిముషముల కామె కొంత శాంతించెను.

"వెంకటరావ్! నీవెట్లు చూచితివి?" అని పద్మలత దీనంగా బ్రశ్నించెను.

"ముందొక సంగతి చెప్పెదను. శేషులుచేసిన మోస మంతయు వినిన—"

"మోసమా?"

"అవును మోసమే, ఆవిషయము నీకు బూర్ణముగా దెలిసిన నీ వా టక్కులాడికొఱకు దుఃఖించవు."

"నీమాటలు చిత్రముగా నున్నవి, సంగతిచెప్ప రాదా, వెంకటరావ్?"

"ముందు నీకథ వినవలయునని నాకు కోరిక కలదు. నానడవడి నీచర్యలపర్యవసానమగుట తరువాత జెప్పుట సహజము."

"నీయిష్టము, ముందు క్లుప్తముగా నేనే చెప్పెదను. రాయపురములో నేడువిశ్రమింతము. రేపు ధారాపురము–"

"నేను నదే చెప్పవచ్చుచుంటిని," అని యామె మాటల కడ్డువచ్చితిని, "మనమనస్సులు కలిసిపోయినవి."

"ఇప్పుడా!" అని మృదువుగా లజ్జతో ననియెను. ఆమె శిరము వంచెను. చెక్కులెఱ్ఱబాఱెను.

నేనామెచేయిపట్టుకొని లేతవ్రేళ్ళతో నాడుకొనుచుంటిని.

"పద్మా! రాయపురము వెళ్ళినతరువాత కొంత నేద దీర్చుకొని పిమ్మట నీవృత్తాంతము చెప్పవలయును. నేనుపుర మెఱుగుదును. మనము సావధానముగ గూర్చుండి మాటలాడుచోటికి దీసికొనిపోయెదను. అచ్చట నిరాటంకముగ మాటలాడుకొందము."

ఆమె తలయూచెను. తరువాత కొంతకాలము మే మూరకుంటిమి.

మేము రాయపురములో బండి దిగునప్పటికి సుమారు పదునొకండుగంటలాయెను. మేము నాయుళ్ళబసయందు దిగితిమి. అది పెద్ద సత్రమంతి యుండెను. అచ్చట గదులు దినములలెక్కకు అద్దెల కీయబడును. మేము నేలపైని నొక విశాలమగు గది రెండురూకలకు తీసికొంటిమి. అది మిక్కిలి సౌఖ్యకరమైనది. అచట పద్మలతనుంచి యజమానిభార్యకు కొంత సొమ్మిచ్చి పద్మలతకు స్నానాహారములకు సదుపాయ

ములు చేయునట్లు చేసి నేను స్నానమైనపిమ్మట భుజించి ఆ సుందరిని గదిలో బరుండుమని చెప్పి బజారునకు వెళ్ళితిని.

రాయపురపు పోలీసు ఇన్‌స్పెక్టరుగారి యింటి కేగితిని. ఆయన నన్నాదరించి వచ్చినపని యడిగెను.

అవసరమున్నంతవఱకు పద్మలత వృత్తాంతము క్లుప్తముగా ఆయనకు జెప్పి యిట్లంటిని.

'విలాసగిరిపైనున్న సతారామును మీరు పట్టించి కాపలామీద నుంచవలెను'

'మీరు ధారాపురమెప్పుడు వెళ్ళెదరు?' అని యాయన యడిగెను.

'రేపు. ఆమె యలసియున్నది.'

'ఈలోపుగ అచ్చటిదొంగ పాఱిపోవునేమో!'

'అచ్చటి ఇన్‌స్పెక్టరుగారు శ్యామలరావుగారికిప్పుడే అర్జంటు టెలిగ్రాము ఇచ్చి ఆమోసగాడు పురము విడువకుండ జూచుచుండమందును.'

'అయినను భయములేదు' ఇన్‌స్పెక్టరు అనెను.

'అయినను భయములేదు' ఇన్‌స్పెక్టరు అనెను.

'వానికి వెళ్ళి యెవ్వరు చెప్పెదరు?'

'అలివేణి చెప్పవచ్చును.'

'దాని ముఖము! అది యిప్పటికి గిరిసూరాదు తొంగి వచ్చెనుగదా!'

'దేనికైనను మంచిది—టెలిగ్రాము ఇచ్చెదను. మీరు సతారామును, తల్లిని ఖైదు చేయుడు. కొలది దినములలో ధారాపురమునుండి 'సమనులు' వచ్చును. అప్పుడు పంపుడు—సెలవు.'

'సెలవు'

నేను పోస్టుఆఫీసునకేగి టెలిగ్రాముపంపి, సాయంకాలము నాలుగుగంటలకు మాబసవద్దకు వచ్చునట్లొక గుఱ్ఱపుబండిమాటాడి, రెండు చీరెలు, జాకెట్లు కొని తీసికొనిపోయి పద్మలత కొసగితిని.

ఆమె ప్రేమ నేను వర్ణింపజాలను.

చాలకాలమునకు నామె నిద్రించెను. నేను మేడ క్రింద విశ్రమించితిని నాలుగు గంటలకు బండివచ్చెను. పద్మలత లేచి కొలదిగ శృంగారించుకొని వచ్చెను.

మే మిద్దరము బండిలో రాయపురము తూర్పుబాటను వెలుపలికి జనితిమి. అచ్చటి బండినొకచోట మేము వచ్చుదనుక నాగునట్లు చెప్పి యచటకు సమీపముననున్న తోటముందు రాతిబల్లపై గూర్చుంటిమి.

అటు సాధారణముగా మనుజులు రారు. కావి మే మొంటరిగనందు గూర్చుండుట కనుమానింప లేదు. నేను తన వరుడనని పద్మలత యెఱుగును. ఆమె నాభార్య యని నే నెఱుగుదును.

పద్మలత తన దీన వృత్తాంతము మొదలుపెట్టెను.

శ్రీ ...

## పదునెనిమిదవ ప్రకరణము

"ఎనిమిదేండ్లక్రిందట నొకనాటి సాయంసమయమున మనము వినోదమందిరమందు మేడపైనిలిచియుంటిమి. జ్ఞప్తి యందున్నదా? ఆనాడు నేను మఱచిపోలేదు. మఱవ జాలను. వైద్యునికొఱకై యానాటిరాత్రియే మాయమ్మయు, నేనును హాలీబాదు పోనుంటిమి. మనపెండ్లికి మాఅమ్మ సమ్మ తించుటచే ఇప్పుడు చేయుచున్నట్లప్పుడును నీతో సిగ్గువిడిచి మాటాడుచుంటిని. మేడపై నీయొద్ద సెలవు గైకొంటిని అప్పుడు నీవు నాకొసగిన ముద్దుతడి యిప్పటికిని నాపెదవులపై నుండినట్లెంచుకొనుచున్నాను. అదియే కడసారి ముద్దను కొంటిని. నిన్ను మరల జన్మలో జూతుననువాస పోయెను. నీ సతిగా నుండుభాగ్యము నోచుకొననైతినని విలపించుచుం డెడి దానను.

"మేము హాలీబాదు పోతిమి. అది చిన్నపల్లె. కాని యచ్చటనున్న అప్పాజీ వ్రణవైద్యమునందు దక్షుఁడై యుండెను. మాయమ్మను బ్రతికింప నాతఁ డెన్నివిధములనో యత్నించెను. కాని మృత్యువామెను వ్రణరూపమున జేరెను. ఆతని ప్రయ త్నములు కొనసాగలేదు. నాకు మాతల్లి దక్కదని అప్పాజీ చెప్పెను. నాగుండె పగిలెను. నాగతియేమి? తల్లిచావుబిల్లను, పెద్దఆస్తికలదు. ఆగొడవ అంతయు నాకేమి తెలియును?

రంగూన్‌లో వసించుచున్న మా పినతండ్రికి అంతకుముందే టెలిగ్రాము ఇప్పించియుంటిని. ఆతడు బయలుదేరినట్లు తెలియవచ్చెను. కాని యింకను జాడలేదు.

"ఈసందర్భమున మాకక్కనుగుఱించి కొలదిగ జెప్పవలసియున్నది. ఒక్కమాటలో—నే నాయన నెఱుగను. ఎప్పుడో పసితనమునందు మాకక్క నన్నొకమారెత్తుకొని ముద్దులాడెను. అప్పుడు మానాయన జీవించియుండెను. క్రొత్త గనుక నేను మాకక్కదగ్గరకు బోలేదు. ఆయన ముఖమును బాగుగా—అసలు గుర్తించలేను. అయనకు బెద్దయాస్తికలదని నీవెఱుగుదువు, బ్రహ్మచారి. మాకక్కకు దేశసంచారమన్న ప్రాణము. ఆయన కిప్పుడు ముప్పదియైదేండ్లుండును. పదునైదవయేట నుండియు ఆయన విలాససంచార మారంభించెను. అన్న యెన్ని యుత్తరములు వ్రాసినను వచ్చి యింటియొద్ద నుండువాడు కాడు తరువాత మానాయన త్వరలోనే మృతినొందెను—అనగా మాకక్క మాయింటికివచ్చిపోయిన తరువాత నని నాయభిప్రాయము.

"అప్పుడు మాకక్క మరలవచ్చెను. అప్పుడు నేను పసిపిల్లనే. అందుచే మరల ఆయనచెంతకు బోవలేదు. మా వ్యవహారములు సరిచూచి ఆయన వెళ్ళిపోయెను. తరువాత మాఅమ్మపేరను, పోనుపోను నాపేరను లేఖలు నిత్యమును వచ్చుచునే యుండెను. మాఅమ్మకు జబ్బువచ్చినప్పుడాయన

రంగూనులో దేవోసర్కారుగారి యింట నుండెను. నేను ఔలిగ్రాము ఇచ్చినది అచ్చటికే. నాకు ప్రత్యుత్తరము వచ్చినది యచ్చటినుండియే వల్లభరావుగారి రాక కెదురు చూచుచుంటిమి.

నీకు దెలియును. మాఅమ్మ హాలీబాదులో అకస్మాత్తుగ మరణించెను. ఆమె యుత్తరక్రియలు జరిగిన తరువాత గూడ మాకక్క రాలేదు. నేను అప్పాజీగారి యింటిలోనుంటిని. ధారాపురము తననౌకరునిచ్చి పంపుదునని అప్పాజీగారు చెప్పెను. పరమసజ్జనుడు. కాని అవసరము లేకపోయెను. మా పినతండ్రి హాలీబాదు వచ్చినట్లు సేవకుడు మున్ముందుగా వచ్చి కబురు తెచ్చెను. ఒకవిధముగ నామనసున కూరటగలిగెను. ఉత్తరములయందలి భావములబట్టి మాకక్క మంచి మనసుకలవాడని ధైర్యముతో నుంటిని.

"సేవకుని ప్రశ్నించువఱకు నాతడునిలువలేదు. కబురు చెప్పిన తత్క్షణమే యాతడు వెడలిపోయెను. అప్పుడాతడెవ్వడో నాకు దెలియరాలేదు. ఇప్పుడు బాగుగా దెలియును. ఆతడు సతారాము.

తటతటలాడుచున్న హృదయముతో మాకక్క రాకకు వేచియుంటిని. ఇక ముందాతడే నాకు తల్లియు దండ్రియునని నాకు దెలియును. నాడుద్రేకము వర్ణనాతీతము. ఎట్టకేలకాతడు వచ్చెను. నేనాతనిజూచితిని. ఆతని యున్నతాకారము. గంభీరవదనము, ఎఱ్ఱనికండ్లు నన్ను ప్రప్రథమమున గొంత

చీనాకుపడజేసెను. నేనుమాకక్కనువేఱువిధముగానూహించుకొనుటయే దీనికి గారణము. కాని యాతనిప్రవర్తనమాత్రము నన్ను ధైర్యము చెందజేసెను.

"అతడు నన్ను కౌగిలించుకొనెను. శిరము మూర్కొనెను మాఅమ్మచావునకు మిక్కిలి విచారించి నన్నెన్ని విధములనో లాలించెను. నేను సంతసించితిని. ఆనాడు సాయంకాలమే ప్రయాణమై చికునూరు చేరితిమి. నాకాశ్చర్యము కలిగెను.

"కక్కా! చికునూరు వచ్చినదెందుకు?"—అని నేనడిగితిని:

"మీాపిన్ని యిచ్చటనున్నది చూడవా?" అని నిర్లక్ష్యముగా ననెను.

"నాకద్భుతము జనించెను. మాపిన్నియా? కక్కా? నీకు వివాహమైనదా?" నాకేల వ్రాయలేదు? అని ప్రశ్నపై ప్రశ్న వేసితిని.

ఆతడు మందహాసము చేసెను. "అయినదమ్మా, అయి విస్తారకాలము కాలేదు. నీకు వ్రాయవలె ననుకొనుచుండగా నీటెలిగ్రాము వచ్చినది. మేము బయలుదేఱి వచ్చితిమి."

మాపిన్నిని చూచుదనుక నాకు మనసు నిలుచునట్లు లేదు; అది స్త్రీలస్వభావము. మాకక్కను వేయిప్రశ్నలు

వైచితిని. ఆతడు వానికెల్ల జిఱునవ్వుతో ప్రత్యుత్తర మిచ్చెను.

"వివాహము రంగూన్‌లో అయినదా?"

"అవును."

"విషయము చిత్రముగనే యుండెను. మేముచికునూరులో అంబాలయము దగ్గఱ నొక మేడలో ప్రవేశించితిమి అందిరువురు స్త్రీలుండిరి. ఒక ముసలిదికూడ నున్నట్లు తరువాత దెలిసెను. ఆయిరువురును సుందరులే. ఇర్వురు నక్కచెల్లెండ్రవలె నుండిరి. అప్పుడు వారెవ్వరో నీకు లేదు—ఏ తండ్రికి బుట్టెనో!"

"మాధవి నన్ను కౌగిలించెను. ముద్దాడెను. ఎన్ని యోదార్పుమాటలు చెప్పెను. అయిన నాకొకటి చిత్రముగ నుండెను. నేను మాకక్కవైపు తిరిగితిని.

"కక్కా! యీయిల్లెవరిది? పిన్ని చికునూరిలో నేల నున్నది?"

"ప్రేమ యొలుకుచున్నట్లాతడు నన్ను చూచెను. తరువాత చెప్పెదను. భుజించి పరుండుము. కలసియున్నా వమ్మా!" అని యాతడు నన్ను దువ్వెను.

"నేను భోజనముచేయను. ఆకలిగా లేదు" అని నేనంటిని.

"అయిన బరుండుము"

"విస్తారము మాటాడినవారికి గోపమువచ్చునని తలచి నేనుపోయి యొకచక్కని గదియందొక మృదుశయ్యపై బవ్వళించితిని. కాని నాకు నిద్రరాలేదు. మనసు పరిపరివిధముల బోవుచుండెను. పిచ్చియాలోచనలు కలిగెను. నేను లేచితిని. అప్పటికొక గంట పరుండియుంటిని. నేను వెలుపలికి వచ్చితిని. కనుచీకటిగా నుండెను. ఇంటిలో నాకెవ్వరును గన్పట్టలేదు. అటు నిటు నిశ్శబ్దముగా దిరిగితిని—వీరందరు నేమైరని వింత చెందజొచ్చితిని. గృహములో నెవ్వరు నున్నట్లులేదు. మేడ యెక్కితిని. అచట మెల్లగా నెవ్వరో సంభాషించుచున్నట్లు మాటలు వినవచ్చెను. లోనికి వెళ్ళ దమూ వర్ధాయని యొక గదిముందు నిలిచి సంశయింప జొచ్చితిని. గది తలుపుమూసి యుండెను. నేనొక నిశ్చితమునకు రాకము సుపే చిత్రమైన మాటలు వినవచ్చెను. నాగుండె గుబుకుమనెను. నేనాగి వింటిని.

"పిల్లముద్దులు మాటగట్టుచున్నది —చంపుటకు నేనొప్పుకొనను" అని సేవకుడు (సతారాము) అనుచుండెను.

"ఒక మందిచ్చెదము--క్రమక్రమముగా జచ్చును." అని మాకక్క యనుచుండెను. నాకుసందేహము నఖశిఖపర్యంతము చెమటపోసెను. భయము కలిగెను. వారెవ్వరో హంతకులనియు, ధనముకొఱకై నన్ను చంపనెంచు చుండిరనియు నాకు దెలిసెను. శరీరము గజగజ వణకజొచ్చెను. ఏమిచేయు

టకును తోచలేదు. వెలుపలికి బాఱిపోదలచితిని. కాని యటుల జేయలేక కూలబడితిని.

"తలుపు దభాలున దెఱవబడియెను మాధవి కేక వేసెను. వల్లభరావునని చెప్పుకొనుచున్న యానీచుడు అంగరకాలోనుండి కత్తిదీసెను. నాకనులు తిరిగెను. అనుభవము లేని బాలికను, జీవితముపై మిక్కిలి యాశయుండెను.

"నన్ను చంపవద్దు. చంపవద్దు నీవు కాపాడవా?" అని క్షణములో సతారాము పాదములపై వ్రాలితిని.

"నాచిలుకా! నేనుండ నీకేమి భయము లేదు. లెమ్ము" అని చిత్రభాషలో ఆనీచునితో నేమో యనెను. ఆతడు ఖడ్గము దాచివేసెను.

"నేను లేచి సతారాము చేయిపట్టుకొని నిలువబడితిని తరువాత కొంత చర్చ జరిగెను. వేశ్యమాతతప్ప వారందఱు నేదో వింతభాషలో జాలసేపు వాదించుకొనిరి. ఒక అరగంట వాదముముగిసినతరువాత అందఱు నావైపు తిరిగిరి. వారి చర్యల బట్టి మిగిలినవారు సతారాము నెగతాళిచేయు చున్నట్లు కన్పట్టిరి. ఆతడు లక్ష్యముంచినట్లగపడలేదు.

"పిమ్మట బలవంతముగ నాకొక ఎఱ్ఱనిబుడ్డి వాసన చూపించిరి. నేను స్పృహతప్పి పడితిని. తెలివివచ్చునప్పటి ఒక నేలకొట్టునందు మూలదీనస్థితియందు (?) నాకఱచుటకు శక్తిలేదు.

అఱచినను వినువారు లేరు. ఎక్కడనో జేలకొట్టువున్న ఒక్క తలుపును వెలుపల బంధింపబడియుండెను.

"నిరాశచే నేడ్చుచు ముందు మూలుగ్గాను, తరువాత నిన్ను తలచుకొనుచు నచట శయ్యపై బడితిని—"

"పద్మలతా! అలసితిని కొంతసేపుండుము. ఆసంగతులు తలచికొనిననే నీముద్దు ముఖమున చెమటపోవుచున్నది" అని నేనంటిని. ఆమె నిట్టూర్పుపుచ్చి పదినిమిసము లూరకుండెను.

"క్లుప్తముగా దరువాతి సంగతి వినుము" అని ఆమె మరల నారంభించెను.

---

## పందొమ్మిదవ ప్రకరణము

నాకష్టములను గుఱించి నీకు విస్తారముగ జెప్పిమనను నొప్పింప దలచుకొనలేదు. మంచిది. నేను జేలకొట్టులోనుంటిని దానిలోనే ఎనిమిది సంవత్సరములు—ఎన్ని మహాయుగములో నేను జెప్పజాలను—గడపితిని. నడుమనడుమ స్నానాదులకు నన్ను వెలుపలికి దీయుచుండెడివారలే కాని మొదట మొదట నదియు దక్కనగ నేయుండెను. కాని ఒక సంగతి మఱువజాలను అలివేణిగాని, తల్లిగాని, సతారాముగాని నన్నొక్క దుర్భాషము నాడలేదు. వెలుపలికేగుటతప్ప మిగిలిన సౌఖ్యములయందు సతారాము నాకెట్టికొఱతయు గలుగ

కుంత జాగ్రత్త చేసెను. "రెండుసంవత్సరములు గడచెను. ఎట్లు గడచెనో తెలియదు. సత్యారాముగాని, యామోసగాడుగాని (వానిపేరు నాకు దెలియదు.) మాధవిగాని, నాకీ రెండు సంవత్సరములు నగపడలేదు. నాకాశ్చర్యమగును. అంతకాలమెట్లు గడచెను? మాకక్క వచ్చుననియు, నీవు వత్తువనియు—ఎవ్వరో వత్తురనియు ప్రతిక్షణము నెదురు చూచుచు గడపితిని. దినములు మాసములాయెను. నెలలు సంవత్సరములాయెను. ఎవ్వరును రాలేదు. నాయాశలు నశించెను. నిన్ను బలవంతముగ నేటికి జెఱయందుంచిరో నాకు దెలియలేదు. కాలముగడచుట భారమాయెను. అలివేణి సాధారణముగా నాతోనుబుసు పుచ్చుచుండెడిది. ఆమెను నాప్రాణస్నేహితురాలిగ నెంచుకొంటిని. ఆమె సత్యారామును పొగడని క్షణములేదు. నన్నాదుర్మార్గుడు చంపకుండ నన్ను విడుచుటకు సత్యారామే కారణమని అలివేణి నొక్కిచెప్పెను. నేనామాటలు సత్యములని యొప్పుకొంటిని. కాని యామె యాసేవకుని గురించి యంతగా నేల నొక్కిచెప్పవలయునో నాకు ప్రప్రథమమున దెలియరాదు.

"నాకు యౌవనప్రాప్తియాయెను. పదునైదవయేడు వచ్చెను. అలివేణి వృత్తి నాకు దెలిసెను. నన్నుకూడ నాకూళ జీవనము చేయ నిర్బంధింతు రేమోయని మనసులో మిక్కిలి దిగులుపడితిని. ఎట్టకేలకు దెగువచేసి యట్టినీచురాలిగ జేయ వలదని యలివేణిని ప్రార్థించితిని. ఆమె నవ్వెను.

“అయిన చిలుకా! నీకు పెళ్ళియం దిష్టమా ?” అని యామె యడిగెను.

“నన్నామె “చిలుక” యని యేల పిలువవలయునో నాకు దెలియరాదు. నన్ను చిలుకా యందువేల” యని నేను మారుప్రశ్న వేసితిని.

“అలివేణి కిలకిల నవ్వెను. నిన్ను సతారాము అట్లే పిలిచెను. నేనును అట్లే పిలుచుచున్నాను నీవు పెండ్లియాడిన సతారామునే కదా? నాకు దెలియదా ? నీమనసులోని మోహము నేనెఱుగుదును.

“నేను చిరాకు జెందితిని. సతారామునా ? ఆసేవకునా?” అనుచు హేయభావముతో నఱచితిని.

“అవును సతారామునే, నాసోదరునే!” యని యలివేణి నిర్లక్ష్యముగా సమాధానమిచ్చెను.

“నాకాశ్చర్యముకలిగెను. ఏమి, సతారాము నాసోదరుడా ? స్వంతభ్రాతయా ? అయిన హాలీబాములో సేవకునివలె నేల నటించెను !” అని నేను తొందరగా నడిగితిని.

“అలివేణిమరలనవ్వెను, పిచ్చిచిలుకా!అదియంతయు బూటకము. సమయావసరమునుబట్టి సతారామట్లు నడచుకొనెను. అంతమాత్రముననే నీవాతని గర్హింపవని నేనెఱుంగుదును. సతారాము నీప్రాణరక్షకుడుగాడా? ఆవిషయము మానీవొక్క క్షణముమఱవగలవా? మఱియొకసంగతి, మాబావ-

నీపినతండ్రినని చెప్పుకొనుచు ధారాపురములో మా అక్క మాధవితో వినోదమందిరమున నున్న యాతడు—మా బావ నిన్ను తుదముట్టింప నెన్నియో మార్గములు చూచుచున్నను, సతారాము పట్టుబట్టి నీ ప్రాణములను దన ప్రాణము అడ్డువేసి నాడు—ఏల? అని యామె యడిగెను.

'ఏల?' అని నేను ప్రతిధ్వని యిచ్చితిని.

'చెప్పనా, చిలుకా!' అలివేణి ప్రత్యుత్తర మిచ్చెను. ఒక్క మాటలో—నిన్ను వివాహమాడవలెనని.

'ఆ ప్రసంగము నేను మార్చివేయ దలచితిని. నా కన్నుల యెదుట నింకొక వరుని రూపము నిత్యము గన్పడు చుండెను. 'మా పినతండ్రిని మీ బావ ఏమిచేసెను? చంపెనా? అని భయపడుచు నడిగితిని.

'అలివేణి కొంచెముగ సంకోచించెను. "లేదు" అని సమాధాన మిచ్చెను.

'ఆమె మాటలయందు నాకు నమ్మక మెట్లు? ఆమె నెన్నియో ప్రశ్నలు వేసితిని. వాని కామె చెవిపెట్టెను. 'నన్ను వీరేల మోసగించితిరి?' అంటిని.

'ఆ స్త్రీ కొంటెకని తెలియదా?' అని యామె సావధాన ముగ జెప్పెను.

'నన్నిప్పటికైన విడుదలచేసెవరా?'

'సతారాము పెండ్లియైన—'

'లేనిచో'

'నీజన్మ చిరకాలము నీ కోట్లో పోవలసిన దే' అని నిర్లక్ష్యముగా ప్రత్యుత్తరమిచ్చి యలివేణి వెడలిపోయెను. ఆమె వాక్యముల చేనాకున్న లేశమాశయు నిర్మూలింపబడెను. గుండెపగిలినట్లాయెను. విలపించుచు శయ్యపై వ్రాలితిని.

"విపులముగా నా బాధలన్నియు జెప్పజాలను. ఇక నాజన్మ ఖైదీగాబోవలసిన దే యని నిశ్చయించుకొంటిని. సతారాము ప్రేమవాక్యముల విననని యొట్టిపెట్టుకొంటిని. వారు నన్ను హత్యచేసినను నాకిష్టముగనే యుండెను. పుస్తకములు చదువుచు, నేర్చుచు, తప్పించుకొను వెఱ వాలోచించుచు వారిని నిష్ఫలముగా ప్రతిమాలుచు దుఃఖాతిశయమున ప్రక్కపై పొర్లుచు, కొట్టులో నటునిటు దిరుగుచు నెట్లో యుబుసు పుచ్చజొచ్చితిని. దినములు మెల్లగా ప్రాకెను—వారములు జరుగుట ఆగిపోయెను. నెలలు గతించినట్లాయెను. సంవత్సరములు లోకములోనుందునా యని వింతకలిగెను. తప్పక యెవరో వచ్చి నన్ను రక్షింతురని పిచ్చియాశలతో గొంతకాలము పోయెను. నిరాశచే గుందుచు గొంతకాలము గడచెను. ఎవ్వఁడు రాలేదు. అలివేణి కెంతలంచ మాసకొలిపినను లాభము లేకపోయెను.

"ఎట్లు జరిగెనో తెలియదు. క్రమక్రమముగా దినములు వారములాయెను. వారములు మిక్కిలి మెల్లగా నెల

లుగా బరిణమించెను. బలవంతముగ మాసములు సంవత్సర ముగా మాఱెను. ఒకటి—రెండు—మూడు— నాలుగు— ఐదు—ఆహా! నేను చిఱుమూరులోని జెయిలో నుంపబడియేడు సంవత్సరములైనది ఏడు నిండు సంవత్సరములే! ఎట్లు జరిగి పోయెను? భగవంతునికెఱుక. నాకు నిరువదియవ యేడారంభ మాయెను. ఇంకేమి వెంకటరావు—ఇంకెక్కడికక్క— ఇంకేమివిడుదల! ప్రాణము దేహమునుండి మోక్షముచెంది నప్పుడే నాకు కారాగృహమోక్షమని తెలిసికొంటిని.

"ఈయైదు సంవత్సరములలోపుగ సతారాము పలు మారులు వచ్చెను. ఎన్నిమాయలో మోహప్రసంగము తే జూచెనుగాని నేను నివారించితిని. నా కాఠిన్యమున కాతడు నొచ్చుకొనలేదు. మా కక్కసంగతి యడిగితిని. బ్రతికి యున్నాడనుటకంటె వా డేమియు జెప్పలేదు. ఎచ్చటనుం డెనో? ఖైదీగానుండెనో, ఎట్లుండెనో సతారామును వేడు కొనినను చెప్పలేదు. కాని నన్ను నూటిమూటికి జంప దన బావయాజ్ఞయైనట్లును, తా నెంత మోకష్టముమీద నా ప్రాణ ముల గాపాడుచున్నట్లును జెప్పుచువచ్చెను. నేనవసని వాగ్దత్తముచేసిన నప్పుడప్పుడు పైకిదీసి దొడ్డిలో అలివేణితో దిరుగనిత్తునని చెప్పెను. నేను పెద్దయొట్టుపెట్టుకొంటిని. సతా రాము తన వాగ్దత్తము నెఱవేర్చుకొనెను. నాటినుండియు నపుడపుడు నేను అలివేణితో సాయంసమయములందు దొడ్డి లోను, మేడపైన గదులలోను దిరుగుచుంటిని. ఇట్టి స్వల్ప

చర్యలవలనను, నా ప్రాణము రక్షించు చున్నందులకును నాకు సతారాముపై గౌరవము కలిగెను—అంతమాత్రమే.

"అట్టి సమయములందు నేనఱచినను, తప్పించుకొన జూచినను లాభమేమి? వారు నన్ను కఠినకారాగృహమం దుంచి యికముందు మాట విశ్వసింపరు. అయినను నేనెవ్వరి కొఱకు దప్పించుకొనవలెను? నీ కొఱకా? నీవు పెండ్లాడి యుందువు. వారు నేను హాలీబాములో మరణించినట్లు వదంతి పుట్టించిరని నాకు సతారాము చెప్పెను. నీవు ధారాపుర ము లో గూడ నుండవని నిరాశ చెందితిని కావున నట్లే వారితో చికనూరులో జన్మగడపదలచితిని. ఒకమారు నేను సతారాము, అలివేణి రహస్యప్రసంగ మొనర్చుచుండ వినుట తటస్థించెను. దానివలన మాకక్క రంగూనులో గోవిందంపంతులు అను ధాన్యవర్తకుని నీడలో నావలెనే నేలకొట్టులో నుండెనని తెలియవచ్చెను. అలివేణి యాతని యాకార మెట్లుండునని యడిగెను. సతారామేమో చెప్పెను కాని యందు ముఖ్యాంశమేమన, మాకక్కకు కుడిబుగ్గపై ఖడ్గపుదెబ్బ తగిలి, మాని, మచ్చ అంగుళమున్నర మేర యేర్పడెనని తెలిపెను. అది బాగుగా జ్ఞాపకము పెట్టుకొంటిని.

"ఎట్లయిన రంగూనులోనున్న దేవోసర్కారుగారికి తప్పక చేరునట్లొక పెద్ద కమ్మ వ్రాయవలెనని పెద్దయూహ కలిగెను. కాని యెట్లు?

"ఈసందర్భమున నెనిమిది నెలల క్రిందట నకస్మాత్తుగా శేషుల పరిచయమాయెను. ఆమెకును, అలివేణికిని ప్రాణస్నేహము. ఒకనాడు హఠాత్తుగ నేను అలివేణియు దొడ్డిలో దిరుగుచు శేషులకంటబడితిమి. ఆమె ప్రశ్నలకు అలివేణి యుక్త యుక్తముగా ప్రత్యుత్తర మొసంగెను. శేషులు నా స్నేహము చేసికొన కుతూహలపడుచున్నట్లు తెలిపెను. ఆమె చేత బొద్దయొట్టు పెట్టించి అలివేణి మా యిర్వురికి నెయ్యిక కలిగించెను.

"నాటినుండియు నప్పుడప్పుడు శేషులువచ్చి నాతో నేలకొట్లో కాలము గడపుచుండెడిది. మొదట మొదట మమ్ము కనిపెట్టుటకై అలివేణి ప్రక్కల బొంచుచుండెడిది. కాని తరువాత దరునాత నామెకు శేషుల కెఱిగించితిని. నా స్థితికై యామె మిక్కిలి విచారించెను తప్పక నాకు సాయము చేయుదునని ప్రతినపట్టెను. ఇర్వురము ప్రాణస్నేహితురాండ్రమైతిమి. మన ప్రేమ యంతయు నామె కెఱింగించితిని. అది యిది యననేల? నాకు దెలిసిన ప్రతి విషయము నామెకు దెలిపితిని.

"ముందు మాకక్కకై లేఖ పంపితిని. శేషులు దెచ్చియిచ్చెను. నేను ఒకతావెల్లయు నాశక్తికొలది దేవో సర్కారుగారికి వ్రాసి మాకక్కయున్నచోటు దెలిపి విడిపింప బ్రార్థించితిని. ఆ యుత్తరమును శేషులు రిజిష్టరుచేసి రంగూన్ పంపెను. అది చేరినట్లు వచ్చిన రశీదుకూడ నాకు

జూపెను. నా సంతోషము చెప్పజాలను. శేషులునుకొనియాడ జాలనైతిని. నేను నాయాస్తి పొందినతరువాత పెద్దబహుమాన మిత్తునని యాస గొలిపితిని. ముందు నాయుంగర మిచ్చితిని ఈ విషయములు మూడునెలలక్రిందట జరిగెను. కాని యీ మూడునెలలనుండి మాకక్క సంగతి తెలియరాలేదు. దేవోసర్కారుగారు జవాబు వ్రాయలేదు.

"సుమారు పండ్రెండుదినములక్రిందట శేషులింకొక పన్నుగడ పన్నెను. మాకక్క ఎనిమిదేండ్ల క్రిందటివరకు వ్రాయుచున్న యుత్తరములు నాయొద్దనుండి తీసికొని పోయెను. ధారాపురముపచ్చి నీసంగతి విచారించి, అవసరమైన రాజవోలు కూడ బోయి, నాసంగతి నీకు జెప్పి నిదర్శనములు చూపునట్లామె యుపాయము చెప్పెను. వీలైన దొంగలనుకూడ బెదరించుతుననెను. అది నా యుపాయమునకు మూలమగుట పెద్దవి యామెను బ్రతిమాలి యొప్పించితిని. ఉత్తరములతోడను, ఉంగరములతోడను శేషులు ధారాపురము బయలుదేరెను. ఆమె యుద్దేశము గాని, గమ్యస్థానముగాని ఎవ్వరికి తెలియదు.

"నేను పేరాసతో ప్రతిదినముసు విశుదలకెదురు చూచుచుంటిని. శేషులు వెడలిన రెండుమూడు రోజులకు సతారాముపచ్చి వెడలిపోయెను ఎందులకో నాకు తెలియదు. దినములు గడచిపోవుచున్నను. శేషులు తిరిగి రాలేదు నీవు రాలేదు. నా మనసు మిక్కిలి సంకటపడుచుండెను.

మొన్న ఆకస్మికముగా టెలిగ్రాము వచ్చెను. అలివేణియు, తల్లియు తటాలున నా గదిలోనికి వచ్చి నేను గికునూరులోనున్న చావుతప్పదనియు, ఆ దుర్మార్గుడు నన్ను చంపుటకై చికునూరు వచ్చుచుండెననియు జెప్పి సతారము టెలిగ్రాము చూపిరి. నేనును, అలివేణితల్లియు బ్రయాణమైతిమి. అలివేణి యింటియొద్ద నిలిచెను. మేము జట్కాలో మెల్లగా మధ్యాహ్నము నాలుగుగంటలకు రాయపురము చేరితిమి. అచ్చట మఱి మూడుగంటలలో సతారావు మమ్ము కలిసికొనెను. మేము మఱునాడు ప్రొద్దున విలాసగిరిపైగుడి చేరితిమి. తలవనితలంపుగ నేను నీవు వచ్చి నన్ను రక్షించితివి. శేషులు తనపని నెఱవేర్చెనని నమ్మితివి.

"మిగిలిన సంగతులు నీకు దెలియును. ఇక నీవిషయము చెప్పుము. మరల నింటికి వెడలుదము."

---

## ఇరువదవ ప్రకరణము

సూర్యాస్తమయ సమయమాయెను. పద్మలత చరిత్ర ముగిసెను. సంగతులు చాలభాగము తేలిపోయెను. కాని శేషుల ప్రవర్తనయొక్క గొంత తెలియవలసియుండెను. ఇక నావంతు వచ్చెను. అరగంటలో గుప్తముగ నేను శేషులును చూచుట మొదలు, విలాసగిరి చేరువరకు బడినకష్టముల

జెప్పితిని. పద్మలత బహుశ్రద్ధతో వినియెను. శేషులునుభావించినసంగతి వినినప్పుడు నాకును నవ్వెను.

"ఎట్లు భావించితినో చిత్రముగానున్నది." అని పలు మారులు మందహాసముతో ననియెను.

"చిత్రమేమున్నది? నేను చెప్పితిని ఆమె రహస్యము లన్నియు దనవివలె విచ్చలవిడిగా మాటాడెను."

'దుర్మార్గురాలు! నేనని చెప్పి యామె యేమి చేయ దలంచెనో యాశ్చర్యమయ్యెను. ఆమె ప్రవర్తన నీకెట్లు తోచెను?'

'పద్మా ఇప్పుడు చెప్పవచ్చునుగదా? ఆమె పోయి సతారామును, వాని బావను బెదిరించెను. అది యింటి యొద్దనై యుండదు. వారామెకు లొంగి లంచమీయలేదు. అప్పుడామె నన్ను గూర్చి విచారించి ధారాపురమున లేనని రాజవోలు వచ్చుచు నుండవచ్చును.'

"కాని యామె యుద్దేశమేమి?"

"అది యిప్పుడు కేవలమనూహ్యము తనకు లొంగని వారిని నా పేరు చెప్పి నాసాయమున వారలబూటకము బయటపెట్టునట్లుభయపెట్టియుండును. అప్పుడుభయపక్షముల వారికి నాతో నవసరము కలిగియుండెను — తెలిసినదా?"

"ఇంతవరకు — పైన?"

"రాజవోలు పోయియుంటిననియు, మూడునిక్షేపముల నాకే పట్టుచుననియు వారందరు కనుగొనియుందురు."

"ఎట్లు?"

"ఎట్లా? పద్మా! నాయింటియొద్ద విచారించుటచే."

"అవును. తరువాత?"

"నాడు పౌర్ణమి కనుక నేను విలాసముగ రాత్రివేళ రావచ్చునని వారు సాయంకాలము రాకపోవుటచే భావించి యుందురు."

"ఇప్పుడు తెలిసినది పద్మలత యనెను... శేషులు నీకొఱకు రాజమార్గము బయలుదేరవచ్చునని, ఆదొంగలు రాధారిమీదు గాపుండిరి కాదా?"

"ఔను. వారామెను చూడలేదు. ఆమె జమ్మిచెట్టు నొద్ద దాగి బాట పరీక్షించుచుండవలెను. తరువాత ఆదొంగలు నన్ను ప్రశ్నించి, పరీక్షించి, పరీక్షించి శేషులు ముందు పోలేదని వెనుకకు దిరిగివచ్చి యుందురు. సంగతులు విశదముగా తరువాత దెలియవచ్చును."

"మఱి శేషులు దయ్యమువలె కురులు విరియబోసి కొనుటయో?" అని పద్మలత ప్రశ్నించెను.

"వారినిగాని, మఱియితరులనుగాని తనజోలికి రాకుండ భయపెట్టుటకై యుండవలెను."

"శేషులు మరణించినది. ఆమె ప్రవర్తన మనకు బూర్ణముగా దెలియకపోవచ్చును—ఏమందువు?"

"సత్యారామును, ఆసీచుడును పట్టుపడినప్పుడు చెప్పగలరు."

"శేషులునువారు హత్యచేసియుందురా?"

"నిస్సందేహము. వారామెను పట్టకొని, తినుబండారములలోనో, నీటిలోనో ఏదేని విషము కలిపియుందురు. ఆమె కృశించి చచ్చెను."

"పాపము!" పద్మలత జాలితోననియెను, "నన్నింత మోసగింపదలచుకొన్నను శేషులమేలు నేను మఱవలేను. ఆమెశవము దిక్కులేకుండ కాలువలో దేలినదని వినినప్పుడు నామనసు మనసులోలేదు—కాని యింత చేయదలచుకొనినది దేవోసర్కారునకు నారిజిష్టరు ఉత్తరమేల పంపెనో?"

"అప్పటికామె కీమోసము మనసునకు దట్టలేదని నాశదము."

"దానికి జవాబు రాలేదు"

"దేనికి?"

"మేమురంగూను దేవోసర్కారుగారికిపంపిన లేఖకు."

"చిత్రమే. కాని ధారాపురము వెళ్ళినతరువాత దొంగలను పట్టించి రంగూను సంగతి విచారింతము. గోవిందం పంతులుమేడ సోదాచూపించి యాతనిగూడ తోడు దొంగలతో బట్టమా?"

పద్మలత కొంతధైర్యము చెందెను.

"నీకింకేమైన ప్రశ్నలున్నవా?" అని నేనడిగితిని.

"ఉన్నవి." అని యామె చెప్పెను.

అడుగరాదా?

"కొన్ని గృహములకొద్ద నడిగెదను. ఇంకను కాలముం డుటచేఁ గొన్నిమాత్రము సంశయములు దీర్చికొందును."

"నాకు దెలిసినవఱకేసుమా నేను చెప్పుట! ఇక నేనూహించను."

"నీకాశ్రమ యీయను" అని యామె నవ్వుచు జెప్పెను.

"అయిన ఆరంభించుము."

"నేనెట్లు చచ్చిపోయినట్లు ధారాపురములో వదంతి పుట్టించిరి ?

"మీపినతండ్రి ధారాపురమునచ్చి మాధవి తనభార్య యని చెప్పెను. ఇద్దరును గోలుగోలున నేడ్చిరి! మీ అమ్మ చనిపోయిన సంగతిమాత్రము మాకుఁ దెలియవచ్చెను. వారు నీమరణముకూడ చెప్పిరి. హాలీబాదువెలుపల నీవు మూర్ఛ వచ్చి నెత్తురుకక్కి మూర్ఛలోనే ప్రాణములు విడిచినట్లువారు చెప్పిరి. తల్లినిగూర్చి బెంగ పెట్టుకొని మనోవ్యాధిచే నీవు మరణ మొందితివని వారు మఱియుమఱియు నేడ్చిరి.

"చిత్రముసుమా ! లోక మెంతలో నమ్మును ?"

లోకులు పలుగాకులందురు. వారినినమ్మినవాడు పెద్ద యవివేకి ?"

"తరువాత నానీచు లేమిచేసిరి ?"

"ఎవ్వరిని వినోదమందిరమునకు రానీయలేదు. దుఃఖా తిశయమువలన నని ప్రజలనుకొనిరి."

"ఆనీచుని పేరేమో?" అని పద్మలత యాకస్మికముగా నడిగెను.

"తెలియదు, మొదటియక్షరముమాత్రము 'జ' యని చెప్పవచ్చును.

"ఆచీకటివలననా ?"

"నిశ్చయముగా."

"త్వరలోనే తెలియును. నేటికింక బసకు వెళ్ళుదమా ?"

"అ స్తమయమయినది, పద్మా! లెమ్ము అచట మాటాడుకొనవచ్చును."

"లెమ్ము" అనుచు నామె లేచి నిలువబడియెను. నేనును నిలిచితిని.

మేము ముందున కొక్కయడుగైనను వేయక పూర్వమే "అయ్యో! దొంగలు! దొంగలు! అయ్యో! రండి, రండి! యనియరపులు, పిలుపులువినవచ్చెను. నా చేతిలోనున్న పద్మలతచేయి కంపింపజొచ్చెను. "భయపడకుము. నేడు నిన్ను కాపాడినరివాల్వరు ఇదిగో!" అనుచు దానిని వెలికి దీసితిని. ఆమె ధైర్యము చెందెను.

మాబండివాడు మేమున్నచోటికి రొజుచు వచ్చెను.

"ఓరీ! దొంగలెచ్చట ?"

ఆతడు వ్రేలుతో జూపెను. తోటకు దూర్పుహద్దున నని గ్రహించితిని. పద్మలతయు నేనును వ్రపుతిరిగి, వీలైనంత త్వరగా బండివాడు చూపినచోటునకువచ్చి చేరితిమి.

ప్రదర్శనము చిత్రముగా నుండెను. ఒక పెద్దమద్దిచెట్టు క్రింద నొకపురుషుడు అలుపుచే బడియుండెను. అతనికి రెండు గజముల దూరములో నిరువురు పురుషులు ఒకరి కౌగిటిలో నొకరు భయంకరముగా బోరుచుండిరి. వారిలో నొక డాపాద మస్తకము బొగ్గువలె నల్లగా నుండెను. కాని యత్యద్భుతమైన బలిష్ఠుడు. అంత వికృతాకారుని నేను నా జన్మలో జూచి యుండలేదు. ఆతని చేతులలో రెండవయాతని చావున్నట్లు స్పష్టము.

కాని యది యేమి? ఒక పురుషుడు చెట్టుక్రింద బడుండి యున్న యాతనిమీది కొకకత్తితో వచ్చుచుండెను.

'చచ్చెదవు! అని అరచుచు పద్మలతను విడిచి నే నటు దుమికితిని. ఆహంతకుడు నాచేతిలోని రివాల్వరును చూచి, తన యుద్యమము మాని, పిక్కబలముచూపి యదృశ్యు డయ్యెను. ఆ సమయముననే యావికృతాకారునితో బోరు చున్నవాడు వానిపట్టు తప్పించుకొని భూమిమీద గాలు ఆన కుండ లేడివలె పలాయన మొనర్చెను.

పద్మలతయు, నేనును ఆవిశ్రాంతాకారుని, పరుండి యున్న పురుషుని డాసితిమి. ఆపిల్లవాడు సేవకునివలె నుండెను. కాని యీ దేశము కాదు. అతడు తనయజమానిని లేవనెత్తి కూర్చుండబెట్టి యేవో సపర్యలు చేసెను. ఆపురుషుడు మహానందముతో మావైపు చూచెను.

ఆతని కుడిబుగ్గపై అంగుళమున్నర మచ్చయుండెను. పద్మలతయు నేను నొకరిముఖములొకరు చూచుకొంటిమి. మేమొక యాలోచనకు లోబడితిమి.

'మీ మేలు మఱవజాలను, అని యాపురుషు డారంభించెను.

'మేము స్నేహితులము—' నేనాతని వందనముల కడ్డు వచ్చితిని. 'మీరు రంగూనునుండి వచ్చుచున్నారు—పేరు వల్లభరావుగారుకాదా?' ఆతడు వెలవెలపోయెను.

'ఈమె మీయన్న కూతురు—పద్మలత భయము వలదు. మీరు వల్లభరావుగారుకాదా?' అని నేనంటిని.

'ఔను' అని చెప్పి సంతోషముతో నాతడు లేవబోయెను.

'కక్కా!' 'అనుచు పద్మలత యాతని గాఢాలింగన మొనరించెను

[21]

## ఇరువదియొకటవ ప్రకరణము

ఆపదలవలెనే సౌఖ్యములుకూడ ఎప్పుడును నొంటరిగా రావని నా దృఢాభిప్రాయము. భాగ్యవంతునికే సంపద హెచ్చుచుండుట చూడమా? గాయముపై గాయమగుట యెఱుగమా? ఒక కుటుంబమునందు మరణమువెంట మరణము సంభవించుట తెలియమా? మాకు నట్లే యీ పట్టున నదృష్టము కలిసివచ్చుచుండెను.

మేము రాయపురమున నాగుట యటునచ్చుట, దైవవశమున నచ్చబనే వల్లభరావుగారిని రక్షించుట తలచుకొనిన నిప్పటికిని నిట్లు సంభవించెనా యని యనుమానముగ నుండును. కాని నిజమే. సంగతులట్లే జరిగెను చిరకాల పునర్దర్శన సంభ్రమము కొంత శాంతించిన తరువాత నీ ప్రసంగము జరిగెను.

"చిట్టీ! నీ వీ సమయమున సరిగా ఇచ్చటికెట్లు వచ్చితివి?" అని వల్లభరావుగా రడిగెను.

పద్మలత నావైపు చూచెను.

'అయ్యా! మీరు చూబసకునచ్చి విశ్రమింపుడు; తరువాత ఒకరిచరిత్రఒకరు చెప్పుకొనవచ్చును' అని నేనంటిని.

'ఇదివఱకే నీకు తెలియును. అమ్మ యుత్తరములలో ఈమనసంగతి నీకు వ్రాయించెను. పీరు వెంకట్రావుగారు.

'ఓహో!' వల్లభరావు చిఱునవ్వుతో ననియెను. 'నీవరుడని చెప్పవేమమ్మా! అయ్యా! నీకు మేమెంతయు కృతజ్ఞులము'

'చెప్పవద్దు. మనసంగతు లన్యోన్యము చెప్పుకొనిన తరువాత జూచుకొనవచ్చును!' అని నేనంటిని.

'మీరు నా ప్రాణములు కాపాడిరి. ఎనిమిది సంవత్సరముల నుండియున్న చెఱవిడిపించితిరి' అని పద్మలత మొదలు పెట్టెను.

'కాబోవు భార్యను రక్షించుటకు తోడు మామ ప్రాణములు కూడ రక్షించి పుణ్యము గట్టుకొనెను' అనుచు ఆయన నా చేతినిబట్టుకొని కృతజ్ఞతాపూర్వకముగా నొత్త దొడగెను.

పొగడ్త నా కిష్టములేదు. ప్రసంగము మార్చుటకై 'ఈత డెవ్వడు? ఇదేమాకారము?' అని యావల్లనీ బలిష్ఠుని జూపుచు నడిగితిని.

వల్లభరావుగారు నవ్విరి, ఈతనిచరిత్ర చాలాయున్నది పేరు దర్యా. ఇతడు దేవోసర్కారుగారు నమ్మిన బానిస. ఇదివఱకొకమారు నాప్రాణములు కాపాడెను. మరల నేడు కాపాడయత్నించెను. ఇట్టి కృతజ్ఞుడు లేడు. రంగూనునుండి ప్రయాణమునందు నాయారవ ప్రాణము'

'ఇతని దే దేశము?' అని పద్మలత యడిగెను.

"బోర్ని యోద్వీపనివాస్సి. పెద్దలంక. అచటివాడు బానిసగా అమ్మబడి చిన్నప్పటినుండియు దేవోసర్కారు గారి యొద్దనే పెరిగెను. ఇంతవిశ్వాసముగలవాడుదొరకడు."

తననుగూర్చి మాటాడుచున్నట్లు తెలిసి దర్యా నవ్వెను. ఆతని తెల్లనిపళ్ళు నల్లనిముఖమునందు నల్లగుడ్డపై ముత్యాల వరుసవలె ప్రకాశించు చుండెను. వయస్సు ముప్పది యేండ్లుండును. అమితబాలాఢ్యుడని చెప్పియే యుంటిని.

"ఈతని కేభాషయు రాదా?" అని నేనడిగితిని.

"రాకేమి?" ఆయన నవ్వుచు ననియెను. బోర్ని యో యందలి భాష వచ్చును. చిత్రముగా బంగాలీభాష మాటాడ గలడు. మిగిలినవానికి పైభాషయే యున్నది వానిమూలముగ నెట్టిసంగతులనైన దెలియజేయుగలడు, కనుచీకటిపడుచున్నది సమీపముగా మాబండియున్నది. బసకు రండు, విషయములు మాటాడుకొందము. అని నేనంటిని. ఆయన సమ్మతించెను. మేము లేచితిమి. బలహీనముగా నుండుటచే వల్లభరావుగారు నన్నును, పద్మలతను ఆనుకొనెను. ఇకిలించుచు దర్యా వెనుక వచ్చెను. వల్లభరావుగారి కష్టములు గట్టెక్కెనని దర్యా గ్రహించుకొనెను.

"మీరా!"

బండివాడు బండి తెచ్చెను. నేమందెక్కి మెల్లగా బయలుదేరి మాబస చేరితిమి. మాబండివానిని పంపివేసితిని. మేము మాగది ప్రవేశించితిమి.

మానలుపురికిని భోజనసమపాయములు చేసితిని. వల్లభరావుగారు స్నానమాచరించెను. తరువాత గదుపునిండభుజించెను. మేమును భోజనము చేసి మరల గదిలో సమావేశమైతిమి.

దర్యాతో వల్లభరావుగా రేమో బంగాళీభాషలో జెప్పెను. వారికి జిత్రవాదన కలిగెను. తుదకు దర్యా లేచి యికిలించుచు ముందు పద్మలత చేతిని వినయవిధేయతలతో కళ్ళకద్దుకొని తరువాత నన్ను నల్లేచేసెను. నేనుఅనుమానము పడి చూచితినిగాని యాతని చేతి నల్లరంగు నా చేతులకంటుకొనలేదు. అంతట దర్యా యజమానునికి సలాముకొట్టి గదిలో నొకమూల చాపపై బవుండి నిదురింప జొచ్చెను.

“నెల దినములనుండి గాఢనిద్ర మెఱుగను. శాంత భోజన మెఱుగను. ప్రతినిముషమును భయమె” అనుచు వల్లభరావుగా రనెను.

“నీవును ఈయెనిమిది సంవత్సరములు కఠిన కారాగృహమున నుంటివా?” అని పద్మలత యడిగెను.

ఆమెకక్క కన్నులు మండెను. “కఠినమని మెల్లగా ననుచున్నావా? దుర్మార్గులు! చోరులు! హంతకులు! వారిని పోనిచ్చెదనా? నా సమయమువచ్చినది వెంకటరావ్! నీ రివాల్వరు రేపు నాకిమ్ము. వారిద్దరితలలు చెక్కలు చెక్కలుగ జేసెదను! అనుచు పగవలని యుద్రేకమువలన వల్లభరావుగారు అరచెను.

'మిమ్మిప్పుడు తరిమి చంపవచ్చినవా రెవరు? అని నే నడిగితిని.

'వారా? ఒకడు గోవిందంపంతులు, రెండవవాడు సేవకుడు. దర్యా లేకపోయిన నేనింతకు బూర్వమే పురల వారి చేత బడియుండును.' అని ప్రేమతో నిద్రించుచున్న దర్యా వైపుజూచి యాత డిట్లనెను. 'దర్యా! నిదురింపుము. మనుజులు, నీచులు. వారిలో నీవు తప్పబుట్టితివి. నీకు నా ఆస్తి సర్వమిచ్చినను ఋణము తీర్చికొనలేను విశ్వాసపాత్రుడా! సుఖనిద్ర ననుభవింపుము.

నేనును పద్మలతయు నాతని నూరక చూచుచు గూర్చుంటిమి. ఆతని ముఖముపై బుగ్గపైన మచ్చ స్పష్టముగా గాన వచ్చుచుండెను. ఆయన వదనము చాల బాధల ననుభవించినట్లు పాలి దీనముగా నుండెను. తీరుమాత్రము మిక్కిలి గంభీరముగా నుండెను. శరీరము మిక్కిలి చిక్కియుండెను.

ఆకస్మికముగా నావైపు తిరిగి "ముందు నీకథ చెప్పెదవా?" అని యాయన తొందరగా నడిగెను.

"ఎవ్వరు చెప్పినను తొందర లేదు. కాని నేడు మీరు మిక్కిలి బడలి యున్నారు. నేటికి విశ్రమింపుడని నా ప్రార్థన రేపు రైలులో నాలుగుగంటల ప్రయాణము, కావలసినంత

వ్యవధికలదు. అప్పుడు తీరికగా చెప్పుకొనవచ్చును. విశ్ర మింపుడు."

కర్కా! పరుండుము. రేపు ఒకరిసంగతి యొకరు చెప్పు కొనవచ్చును. నీ విచ్చటికెట్లు వచ్చితివో, మేమెట్లు వచ్చి తిమో రేపు తెలుపుకొందము. అని పద్మలతకూడ జెప్పెను.

'ఔను రేపు కబురులు—నేటికి నే నలసియున్నాను తెల్లవారులును గాఢనిద్రచెందిన రేపటికి కొంతశక్తి కలు గును. ఈలోపుగ ఆదుర్మార్గుడు పోడుగదా!' అని యాయన యడిగెను.

'ధారాపురములోని మోసగాడా?' అని నేనంటిని.

'ఔను'

'అక్కడి ఇన్‌స్పెక్టరునకు టెలిగ్రాము ఇచ్చితిని భయము లేదు.'

'మంచిది.' ఆయన పళ్ళుగొఱుకుచు జెప్పెను. ఆతడు పలాయనముచేసిన నామనమున కూఅట లేదు—ఆతడుచేసిన అపరాధమా?'

వల్లభరావుగారు శయనించెను. పద్మలత సమీప ముగా బరుండెను. నేను మేడక్రింద నిద్రించితిని.

తెల్లవారెను, గాఢనిద్రవలన వల్లభరావుగారి ముఖ మున గొంతకళ వచ్చెను. ఈయుపలసిన అద్దెను మేము ప్రొద్దున ఆరుగంటలబండిలో రెండవతరగతి పెట్టెలో నెక్కి కూర్చుంటిమి. మమ్మెవ్వరును అభ్యంతర పెట్టుటకు వీలు

లేకుండ చేసికొంటిమి. 'కాఫీహోటలులోనుండి నేను భక్ష్యముల దెచ్చితిని. అవి తిని యాకలి తీర్చుకొంటిమి'

వల్లభరావుగారు తన వృత్తాంత మారంభించెను.

---

## ఇరువది రెండవ ప్రకరణము

చిట్టీ! నిన్ను పద్మలతాయని పిలుచు నలవాటులేదు. నేను నిన్ను రెండుసూరులు మాత్రమే చూచితిని. అప్పుడును "చిట్టీ" యనియే పిలిచితిని. అది యట్లుండనిమ్ము. నీవు చిరునామాలో నొక వేశ్యయింట ఈ ఎనిమిది సంవత్సరములనుండియు గారాగృహములో నుంటివనియు, నీవు హాలీబాదులో మరణించినట్లు వదంతి పుట్టించి నన్ను మోసపుచ్చిన యానీచులు ధారాపురములో నా పేర వినోదమందిరములో మనసంపద ననుభవించుచున్నారనియు నాకు దెలియును. నేను వారుపెట్టిన సమస్తకష్టముల కోర్చితిని. వారు నన్ను కఠిన—సహస్ర కఠిన కారాగారమునవుంచి జీవన్మృతుని జేసినను సహించితిని. నా కాలముకొఱకు శాంతముగా వేచిచూచితిని—నేటికి కది వచ్చినది. దేనికి?

'దేనికి! అడుగవలయునా! చెప్పవలయునా? పగ—పగ! నాయొడలు భగభగ మండిపోవుచున్నది. నేను పడిన బాధ నా! నేను ఓర్చుకొనిన పరుబాట్లా నేను సహించిన

తలవంపులా ! సహించితిని— దుఃఖించితిని— విలవిల లాడి తిని—క్రమక్రమముగా జంపదొడంగిరి—ఒకపూట భోజ నము—ఒకపూట లేదు. ఆకిగినప్పుడు దాహము లేదు— ఆకలివేళకు అన్నము లేదు—నెలకుకూడ స్నానము లేదు. రెండు నెలలకు కూడ సూర్యదర్శనము లేదు, దినమున కొక కండకోసి చంపవలెనని వారికోరిక—వారి ఆనందము! ఇప్పుడు నావంతువచ్చినది. గోవిందపంతులూ ! నీ గొంతు నులిమివేసెదను. నీచులారా ! దినమునకొక అంగుళము మేర మీా దేహములు చీల్పించెదను. పగ ! పగ ! మీా నెత్తు టితో— వెచ్చ వెచ్చటి నెత్తుటితో నా దేహ తాపము చల్లార్చెదను.

కోపాతిశయమున నే నేమి మాటలాడుచున్నాడను ? పగ యున్నది. భగవంతు డున్నాడు. నా వృత్తాంతము వినుడు.

నేను బాల్యమునుండియు మిక్కిలిగ కథలయందిష్టము కలవాడను. అవి చదివి చదివి తుదకు పదునైదవయేట నుండియు దేశసంచార మారంభించితిని. ధారాపురమున ఒక్క నెల సరిగా నుండి యెరుగను. ఉన్నకొద్దిదినములు వెలుపలికి దిరుగలేదు. కావున నేవీరి మోసములు కొనసాగుటకువీలైనది. నేను తిరుగనిపట్టణము లేదు అడవి లేదు. ఉత్తరమున హిమా లయపర్వతములు మొదలుకొని దక్షిణమున కన్యాకుమారి అగ్రమువఱకు సంచారము చేసితిని. పూర్వపు బర్మా దేశము

మొదలు పడమటికనుములవఱకుగల సమస్తభాగము తెలుగుదును. అనేకరకముల మనుష్యుల జూచితిని. అనేకరకముల భాషలు వింటిని. చాలవఱకు గొద్దిగొద్దిగ మాటడగలను.

"ఇట్టి స్థలములందు నాకు చిత్రమగు పలువిధముల అనుభవములు కలిగెను. కొన్నికొన్ని చోట్ల స్వల్పవిషయములకు గూడ ప్రాణము కోల్పోవునట్టి సందిగ్ధములు వచ్చెను. కాని నా విశేషానుభవముచే వానిని దప్పించుకొంటిని. ఆవిషయములు వర్ణించిన తీఱవు. ప్రస్తుతము ముఖ్యాంశములు చెప్పి విశేషములు తదనంతరము సావధానముగ దెలిపెదను. నాచివర ప్రయాణము బొంబాయినుండి రంగూనుకు నేనెక్కిన నావయందు నాకు గోవిందంపంతులును, మఱియొక పురుషుడును స్నేహమైరి. వారుకూడ రంగూనుకే వచ్చుచుండిరి. దినములు గడచినకొలదిని పరిచయ మెచ్చెను. గోవిందంపంతులు స్నేహితుడని నా హితుడనియు, పేరు ముకుందరావనియు, మిక్కిలి ధనికు డనియు, ఊరు చిక్కనూరనియు, విసాలార్థము రంగూను ప్రయాణ మొనర్చుచుండెననియు నాకు దెలిపెను. నాచరిత్ర వారి కామూలాగ్రముగ జెప్పివేసితిని. ఒకరి రహస్యము లొకరికిం జెప్పుకొనుచు మేము ముగ్గురము ప్రాణస్నేహితులమై ప్రయాణము మిక్కిలి సుఖకరముగా గడపితిమి.

"రంగూనులో గోవిందంపంతులునన్ను నిజమందిరము నకు రమ్మని బలాత్కారము చేసెను. కాని యచటనున్న దేవోసర్కారుగారికి నాకు ఇదివఱకే యొక విషయములో కలకత్తాయందు బూర్ణపరిచయమాయెను. రంగూనుఆయన గృహమునకు వచ్చునట్లాయన వాగ్దత్తము చేయించుకొనెను. ఆవిషయము గోవిందం పంతులునకు జెప్పి క్షమాపణ యడిగి తరువాత వచ్చునట్లు వాగ్దత్తమిచ్చి దేవోసర్కారుగారి భవనమున కరిగితిని."

"దేవోసర్కారుగారుకూడ ధాన్యవర్తకుడే లక్ష్మి ఆయునయింట వాసము చేయుచుండును. ఆయన మందిరము వినోదమందిరమునకు మూడింతలున్నది. బంధుగులు, సేవకులు, దాసిసలు, స్నేహితులు నిత్యము ఆయన యింటినిండ మనుష్యులుందురు. ఆయనయు, భార్యయు, పదునారేండ్ల కూతురు, నాలుగేండ్ల కొడుకు—అసలు కుటుంబముమాత్ర మింతే. సర్కారుకూతురు పేరు "జోసాసర్కారు--చిత్రమగు పేరు కాదా? ఆమె యంతకంటె జిత్రమయినది. ఒకమారామెను జూచినవాడు మఱల జన్మలో ఆమోహనాకార మును మఱవజాలడు. అట్టి సుందరి మరల బుట్టునేమో యను విషయము మిక్కిలి అనుమానాస్పదము—జోసా సౌందర్యము!

"నాకును ముకుందరావునకును మొకట మనస్పర్థ వచ్చుటకు జోసా కారణమాయెను. ఆమె యొకనాడు తమ్మునితో గూడి గుఱ్ఱపుబండిపై షికారువెడలి తిరిగి వచ్చుచుండెను. నేనును ముకుందరావును నామె కెదురుపడితిమి. ఆమె నన్ను చూచి నవ్వి వెడలిపోయెను. అందు జిత్రము లేదు. నేను వారింట నతిథిని. ఆమెకును, తమ్మునికిని బహుమానములిచ్చుచుండెడివాడను. కాని ముకుందరావను మానము చెందెను.

"నీవామె నెఱుగుదువా" అని యాతడు నన్నడిగెను.

"ఎఱుగుదును. ఆమె దేవోసర్కారు కుమార్తె."

"అట్లా? పేరు?"

"జోసా సర్కారు"

"పెండ్లి అయినదా?"

"లేదు, విచారించుచున్నారు త్వరలో నేకాగలదు."

"ముకుందరావంతటితో ప్రసంగము మానెను."

"తరువాత నొకనాడు—నాయాశ్చర్య మేమందును?—రంగూను దేవాలయము ప్రక్కనున్న సరసునొద్దనేను ప్రొద్దుగ్రుంకినతరువాత దిరిగి వచ్చుచుండగా ఒక నిర్జనమగుచోటున కేకలువినవచ్చెను. నేను పరువెత్తి చూచితిని. ఎవరో ఒక స్త్రీని బలవంతముగా బండిలోని కెక్కించుచుండిరి. ఆమె కేకలు వేయజొచ్చెను. నోరు బలవంతముగా మూయబడెను. ఏదో విపరీతము జరుగుచున్నదని గ్రహించి క్షణములో బండి

ప్రక్కచేరి యచటిపురుషుని ముఖముపై బలముగా గ్రుద్దితిని. ఆతడు నన్ను శపించుచు నావైపుతిరిగి చీకటిలో నా ముఖము గుర్తించి నిముసములో బలాయనమొనర్చెను. నే నాతని గుర్తించితిని. అతడు ముకుందరావు! ఆస్త్రీ జోసా!

"జోసాయందు దేవోసర్కారుగారికి మిక్కిలి నమ్మక ముండెను. మఱియు ఆయన నవనాగరికుడు. కుమార్తె నొంటిగా బండిలో షికారునకు బోనిచ్చు చుండెడివాడు. తోలువాడు కూడ అక్కఱలేదు. ఆమెయొక్కతె పోగలదు. ఆదినమున సట్లేవచ్చి కనుచీకటి పడినంతనే తిరిగి పోజూచు చుండ నింతలో ముకుందరావువచ్చి "మీఇంటనున్న వల్లభరా విచ్చటికి సామీప్యమున మూర్ఛపడి యున్నాడు. బండిలో ఇంటికి దీసికొనివెళ్లుము. అనిన ఆమె విశ్వసించి నాయుం దలి గౌరవముచే ముకుందరావు చూపినదారిని వచ్చెను. అతడామె నొక నిర్జనప్రదేశమున దుర్భాషలాడి తనదురూహ ములు సూచించెను. ఆమె కసరి బండిత్రిప్పుకొని పోబోవ మోహావేశుడగు ముకుందరావామెను బలాత్కారముగ బండిలో ఎక్కించ జూచుచుండెను. ఆమె కేకలు వేసెను, నేను వినివచ్చి రక్షించితిని.

"జోసాకు నేనాతని ఎఱిగినట్లు చెప్పలేదు. ఎవడో దుర్మార్గుడు నాపేరు తెలిసికొని యట్టిమోసము పన్నెనని చెప్పితిని. జోసాసర్కారు తనకృతజ్ఞత తెలిపెను. మేముఆమె

యింటికేగితిమి. ముకుందరావును మఱునాడు బాగుగా జీవాట్లుపెట్ట నిశ్చయించుకొంటిని. ఇంటియొద్ద దేవోసర్కారు నాకొఱకెదురు చూచుచుండెను. కారణము తెలియవచ్చెను. మావదినెగారు మరణశయ్యపై నున్నట్లు బెల్గ్రామువచ్చెను. జోసా జరిగినసంగతి చెప్పెను. దేవోసర్కారు ననుకొని యాడి, తప్పకకొన్నిదినములుండ బ్రార్థించెను. కాని మఱు నాడు సాయంకాలము తప్పక వెడలవలయునని ప్రయాణము పెట్టితిని. అవసర విషయమని తెలియుటచే దేవో సర్కారు సమ్మతించెను.

మఱునాటి మధ్యాహ్నము మూడుగంటలకే సర్కారులయొద్ద సెలవు తీసికొంటిని. ఏ భావముతో నిచ్చెనో,జోసా సర్కారు నాకొక ముద్దిచ్చెను. దాని మాధుర్యమును దలచు కొనుచు గోవిందంపంతులుగారి యింటికి వెళ్ళితిని. ఆయనను నేనెఱిఁగినట్లు దేవో సర్కారుతో జెప్పలేదు. ఒక విషయము మఱచితిని. దేవోసర్కారుగారి యింటివద్దనుండి యానాడె బెల్గ్రామునకు జవాబిచ్చితిని.

“గోవిందంపంతులు ఇంటియొద్దనే ఉండెను. అచ్చట ముకుందరావుకూడ నుండెను. ఆతనిని చీవాట్లుపెట్టి, గోవిం దంపంతులునొద్ద సెలవుతీసికొని పోదలచితిని. నా ప్రయాణ సన్నాహముచూచి ఆయన వింతచెంది కారణమడిగెను. చెప్పితిని. తలయూచి ‘మాయింటనుండరా!’ అని యడిగెను. వీలుగాదని చెప్పి క్షమాపణ అడిగితిని. ఎట్టకేల కాయన సమ్మతించెను.

'పోనిండు. ఒక్కసారి నాధనాగారము చూచిపోరా?' అని యాయన కోరెను.

'సమ్మతించితిని. మేము ముచ్చురము మేడలో ననేక రహస్య మార్గములు గడచి, మెట్లద్వారా ఒక లోతగు నేల కొట్టు చేరితిమి. అచ్చట ధనము లేదు.

'ఇచ్చటి కేల?' అని నేను విస్మయముతో నడిగితిని.

'నిన్నుంచుటకు' అని ముకుందరావు చెప్పి చిన్నకత్తి దూసి నామీదికి పండ్లు పటపట గొఱుకుచు దుమికెను. జోసాసర్కారును నన్ను విడదీసెదవా!'

"నేను మండిపడితిని. ఆతనిదెబ్బ తప్పించుకొనజూచితిని. కాని అది నాకుడి బుగ్గపై అంగుళమున్నర మేరదగిలి గాయమాయెను. ఆమచ్చ యిదిగో.

"గోవిందంపంతుల్లు అడ్డమువచ్చెను. తొందరగా జనార్దనరావు! ఊరుకొనుము రక్తము నే సహించను అని చెప్పెను. నే నసహాయుడ నైతిని. ఏమియు ననజాలనైతిని. నాకు సంకెళ్ళువేసి వారునిర్దయతో నిమ్క్రమించిరి. ఖైదీ నైతిని. వారెట్టిసీచులు! అప్పుడు నాకు ముకుందరావనునది దొంగపేరనియు నాతని నిజమైన పేరు జనార్దనరావనియు దెలిసెను. నన్ను చెఱనుంచుటలో వారి యుద్దేశ్యమేమో నాకు దెలియలేదు.

'హా! అప్పుడు నే పొందిన మనస్తాపము—పగ!'

వల్లభరావుగా రాగిరి. పద్మలతతో నేనిట్లంటిని. "ఇప్పుడు తెలిసినది 'స' అనునది సతారాము దస్కతు. 'జ' అనునది జనార్దనరావు దస్కతు.

"ఔను. ఆతడెవ్వడో?—ఏమివృత్తియో!" అని యామె యనెను.

వల్లభరావుగారు అయిదు నిముసములు విశ్రమించి మరల నారంభించెను.

---

## ఇరువదిమూడవ ప్రకరణము

మీ వృత్తాంతము లింకను నేను వినవలసి యుండుటచే నావిషయము కొద్దిలో ముగించెదను. నన్నా నేలకొట్టులో నుంచిరి. గోవిందంపంతులు నమ్మిన బంటొకడు నాకు రెండు పూటల నాహారజలంబులు దెచ్చి యిచ్చుచుండెను. ఆతని పేరు పరిందా, దానికి హిందూస్థానీలో పిట్ట, అని యర్థము పరిందా మంచివాడే కాని గంభీరస్వభావుడు. కొన్నిదినముల వఱకు నేనాతని చర్యల బరీక్షించితిని. అంత నొకనాడు ఆత నికి మూడువేలు లంచము ఆసగొల్పితిని. పరిందా మాటాడ లేదు. పదివేలవఱకు జూపితిని. లాభము లేదు. ఆతనికి ధన మన్న తృణప్రాయముగ నున్నట్లు కన్పట్టెను. ఇంకను గొం

తకాలము శాంతముగా గడపితిని. నేనున్న కొట్టాకమాదిరిగ తేమగా నుండెను. అందునుండి తప్పించుకొన మనుష్యుని శక్యముకాదు. మీదు మిక్కిలి నాకు సంకెళ్ళుండెను. నిరాశచే కృశించుచు నాచీకటి నేలకొట్టులో బలత్కారాజ్ఞాత వాసము చేయుచుంటిని.

"సంవత్సరములాయెను—రెండు—మూడు. నాకు విడుదల యెట్లుకల్గును? పరిందా మాటాడడు. మూగవాడని తోచెను. చెవిటివాడు కూడనా? నావాక్యములాతడు గమనించినట్లే అగపడడు. నేను రంగూనులో దనకు మిక్కిలి సమీపముగా నున్నట్లు జోసాసర్కారెఱుగదు. ఎఱిగిన జోసాసర్కారు ప్రాణములు రక్షించిన నాకొఱకామె యేమి చేయగలదు? వినోదమందిరములో సంగతు లెట్లుండెనో? మా వదినెస్థితి యేమాయెనో? ఆమె యొకవేళ మృతినొంది న—పద్మలత సంగతి యేమాయెనో? ఎట్లు తెలియ వచ్చును? తుదకు దేవో సర్కారుగారి కొరకు లేఖ యంద జేసిన!—ఎట్లు పరిందా మాటాడడు. నేనా చెఱబాధలు పడజాలక ఎట్లయినా నాత్మహత్యచేసికొన బలుమారు తలపోసితిని. కాని నేను వచ్చిన పగ దీర్చుకొనువా రెవ్వరు?

బ్రతికియుండదలచితిని. ఆ కనుచీకటికొట్టులో నెట్లో నివశింపనిశ్చయించుకొంటిని. వారు సరిగా బెట్టిపెట్టని యిచ్చిన్యాయుని ఆహారబలములతోడనే ప్రాణములు దేహమున

నిలుపనెంచితిని నోటిలో గుడ్డలుగ్రుక్కి నెలకొకసారి రెండు నెలలకొకసారి వారు నన్ను వెలికిదీసి సూర్యరశ్మి చూపుచుండిరి. లేకపోయిన నేను చనిపోదునని వారిఅభిప్రాయము నేనంతత్వరగా మృతినొందుట వారికిష్టములేదు పదిపండ్రెండు సంవత్సరములు తీసికొని చావవలెనని వారికోరిక. నేచేసిన నేరమేమి? గోవిందంపంతులు విస్తారముగ నగపడువాడు కాడు. కనుపడినప్పుడెల్ల నా వాడిచూపుల సహింపలేక నిముసములో నవ్వులకేగుచుండెడివాడు.

అయిదు సంవత్సరములు దాటెను. ఇంకను తప్పించుకొను నదృష్టము నాకు గలుగలేదు. ఒకనాడు తలవనితలంపుగా జనార్దము, నింకొక పురుషుడు నాకొట్టులోనికి వచ్చిరి. జనార్దనమునను చూచుటతోడనే నాకెక్కడలేని శక్తివచ్చినట్టాయెను. శరీరము పులకరించెను. కండ్లు మండజొచ్చెను. తటాలున లేచి యఱచుచు నాతని ముఖముపై నాసంకెళ్ళతో బలముకొలది గొట్టితిని ఆతడు నాచేతులు పట్టుకొని దెబ్బ తప్పుకొనెను. వికటముగా నవ్వుచు నన్ను శయ్యపై విసరిపడవేసెను. నేను సొమ్మసిలి పడితిని. అంతట మఱింత నవ్వుచు నాతడిట్లనియెను.

"వల్లభరావ్! నన్ను జోసాసర్కారును విడదీసితివే! ఇప్పుడు ఈతనిని పద్మలతను విడదీతువా?"

"ఆదుర్మార్గుడెవ్వడు?" అని నేను క్రోధముగా నంటిని.

"నా బావమఱది" అతడు వెకిలిగా నవ్వుచు జెప్పెను. "పేరు సత్తారాము" పద్మలతనుకూడ నీవలెనే మోసముచేసితిమి. ఆమె హాలీబాదులో చచ్చిపోయినదని వాడుక. నీవు నేనని ధారాపుర వాస్తవ్యులు నమ్ముచున్నారు. మీ ఆస్తి పెద్దది సుమా! నేను నీకు బదులుగా దానిననుభవించుచున్నాను."

"నా యొద్దనుండి నా చరిత్రయు, కాగితములును సంగ్రహించి యుంచి వినియోగము చేయుచున్నావు? నీచుండా నీకాలము రాకపోదు.

"నీకు తృప్తిలేదా?" అతడు పరిహాసముగా ననెను ? నిన్ను రంగూనులో జోసాసర్కారువద్ద నుంచితినిగా ? అది యుండనిమ్ము. సత్తారాము పద్మలతను పెండ్లాడబోవుచున్నాడు. ఆమె చికుసూరులో అలివేణి అను వీని చెలియలింట నీవలెనే చేలకొట్టులో ఉన్నది సమ్మతినేనా ?"

"నేనది యెగతాళి కడిగిన కైలుగుదును. అందువలన నేత్రములతో నా క్రోధమును దెలుపుచు మౌనమువహించి యూరకుంటిని.

"మఱి మేము రంగూనువచ్చునది సీకాపరియను గోవిందంపంతులునకు కొంత ధనమీయవలసి, అయ్యా! సెలవు.

"అని విస్పృతహాసముతో నాతడు నిష్క్రమించెను. స్నేహితుడాతని ననుగమించెను. ఈవిషయములు వినినప్పుడు నాతల తిరిగినట్లయ్యెను. తలకాయనొప్పి వచ్చెను. ఒడలు

వడకెను. కన్నులు మూసికొనియెను. ఏమేమో ప్రేలుచు దుఃఖములు హాతుని జేయ శయ్యపై బడితిని. అదియే ఘోర వ్యాధికి మొదలు నాటినుండియు నేటివఱకా వ్యాధిపూర్తిగ నిర్మూలించ లేదు.

'ఎన్నినాళ్ళది మఱియు నెక్కువగానుండెనో తెలియదు. చావుబ్రతుకులపై సంవత్సరము గడచెను. నిండు సంవత్సరము! నాకు సంవత్సరముగడచినట్లే తెలియదు నేను చచ్చుట వారికిష్టములేదు. మందులు వాడిరి. తుట్టతుదకు వ్యాధికుదిరెను. నాసంకెళ్ళు వ్యాధిలో దీసినైచిరి. నాకు వానిని మరల వేయలేదు. కాని ఉగ్రత కుదిరిన తరువాత వల్లభరావునా యని నాకే యనుమానము కలుగ జొచ్చెను. నన్ను తఱచుగా సూర్యరశ్మిలో ద్రిప్పిరి. కాని నోటికెప్పుడు నట్టివేళల గుడ్డలను కట్టబడియే యుండెను. జబ్బులో నే నమితముగా ప్రేలినట్లు తరువాత దరువాత పరిందా చెప్పెను. 'మరల నే నొకమాదిరిగా శక్తికోలుకొనునప్పటికి మఱియొక సంవత్సర మాయెను. అప్పటికి నేను చెఱలోనుండి యేడుసంవత్సరములున్నర దాటెను. ముక్తిలేదు. ఏమియు లేదు.

'తోటలో నన్ను త్రిప్పునప్పుడు పరిందాతో నాచరిత్ర యంతయు మొఱపెట్టుకొంటిని. ఆతడిప్పుడిప్పుడు నాతో సంభాషించుట ఆరంభించెను. ఆతడు చెవిటియు, మూగయు గాడని తెలిసికొంటిని. పరిందా మందహాసముతో నావిలాస

మాలకించు చుండెడివాడు. ఆతడు నా నోటిగుడ్డలు విప్ప జొచ్చెను. చిత్రము! సుమారు రెండు నెలల పదునైదు - దిన ముల క్రిందట పరిందా నేను తోటలో దిరుగుచుంటిమి. అప్పు డాతడు మరల నానోటిగుడ్డ కట్లువిప్పెను. నేను వింతతో నిట్లంటిని.

'పరిందా! నీయుద్దేశమేమి? నామాటలు విందువు ప్రత్యుత్తర మీయవు. నన్ను బాధించుటవలన నీకు లాభ మేమి? ఈకట్లు విప్పుట యెందులకు?

'పరిందా మందహాసమొనర్చెను. నీకు మాటాడవలె నని యిష్టములేదా?' అని యాతడడిగెను.

'ఉన్నది మాటలాడకుండ నేనుండలేను'

'రేపురాత్రి నిన్ను తప్పించెదను—సిద్ధముగా నుండుము మఱి మాటాడకుము' అని నానోటి కట్లు మరల గట్టి నన్ను నేలకొట్టులో విడిచెను.

"ఆరాత్రి యెట్లు గడచెనో తెలియదు. తెల్లవాఱు వఱకు నేను కన్నుమూయలేదు. జలాహారములు ముట్ట లేదు. పరిందామాటలకు నిక్కముగునా? ఎట్టకేలకు నాకు స్వేచ్ఛ వచ్చునా? రానిమ్ము పగ మిగిలినపని చేయును. మరల రాత్రి యగువఱకు నట్లే గడపితిని. ఎంతయో సేపటికి బలవంతముగ బ్రొద్దుగ్రుంకెను. ఎనిమిది—తొమ్మిది— పది—పదునొకండు—పండ్రెండు—ఒంటిగంట! ఎవ్వరును రాలేదు. పరిందా నన్నేల మోసపుచ్చెను?

అడుగుల చప్పుడు వినబడియెను. తలుపు నిశ్శబ్దముగా దెఱచుకొనియెను. పరిందావచ్చెను. నిశ్శబ్దముగా నాకు సైగచేసెను. నే నాతని జప్పుడుగాకుండ వెంబడించితిని. తోట చేరితిమి. నా గుండెలు దడదడలాడుచుండెను. అచ్చట నొకనిచ్చెనచే గోడయెక్కి నిశ్శబ్దముగా వెలుపలికి దుమికితిమి. అచ్చట దేవోసర్కారు నిలిచి యుండెను.

'మేము ముగ్గురము వెంటనే దేవోసర్కారుగారి యిల్లు చేరితిమి. అప్పుడు క్లుప్తముగా నీయుత్తరమువచ్చుట తాను పరిందాకు బెద్ద లంచమిచ్చి, తనయొద్ద నా జన్మాంతము నొకరుగా నుండనిచ్చున ట్లొప్పుకొని, నన్నాతని మూలమున రక్షించుట చెప్పి నాకు దర్యాను తోడిచ్చి, ధనమిచ్చి, యారాత్రియే రంగూనునుండి నాతో బయలు దేఱెను. దేవో సర్కారు కలకత్తావఱకు వచ్చి యచ్చట మమ్ము విడిచి తిరిగి పోయెను.

'పరమసజ్జనుడు అతని మేలీజన్మలో తీర్చికొనలేను.'

'అక్కడనుండి అనేక కష్టములతో బ్రయాణముచేసితిమి. రాయపురము వచ్చి, చిరుచూరు పోవలెనని నాయుద్దేశము. రాయపురమున కైదుస్టేషనుల అవ్వల గోవిందంపంతులు నన్ను వెన్నాడుచున్నట్లు కనిపట్టి, రాయపురము అవతల స్టేషనులో దిగి, యాతనికంట బడకుండ దర్యాతో బాటను రాయపురము బయలుదేఱితిని. ఎట్లు కనుగొనెనో యా నీచుడు మాపోకవిధము తెలిసి మ మ్మనువర్తించి

యిచట గలిసికొనెను. అలుపుచే నేను క్రిందబడితిని. దర్యా నన్ను రక్షింపజూచెను. కాని యిద్దరితో నాతడేమి చేయ గలడు. ఒకనితరువాత నొకని జంపులోపల నన్ను గోవిందం పంతులు చంపియుండును.

తలవని తలంపుగ భగవంతుడు కృపాళుడై యద్భుత ముగా మిమ్ముకూడ నిచ్చుటకే తెచ్చెను. అల్లుడు మామను మామకుమార్తెను రక్షించెను. ప్రస్తుత మింతకంటె జెప్పజా లను. ఇక నాకొక్కటె మంత్రము—పగ! పగ! పగ!

---

### ఇరువదినాల్గవ ప్రకరణము

వల్లభరావుగారి చిత్రచరిత్ర ముగిసినతరువాత గొలది కాలము మేమాయన సహించిన కష్టములకు వింత చెందుచు నూరకుంటిమి. ఆయన యలిసి 'సోఫా'పై బరుండెను. పద్మ లతయు నేను నొకరికొక రెదురుగ గూర్చుంటిమి. దర్యా గవాక్షముచెంత నాసీనుడై చెట్టుచేమలజూచి సంతసించు చుండెను. వల్లభరావుగారు కోరగా ముందు బద్మలతయు, దరువాత నేనును మాకథల గ్లుప్తముగా జెప్పితిమి. ఆయన నన్ను మిక్కిలి కొనియాడెను. నాకదియయిష్టమగుటచేబద్మ లతవైపు తిరిగి నామనోవేదన చెప్పికొంటిని. కానియామెయు

నూరకొనక పినతండ్రితో గలిసి నన్నుస్తుతింపజొచ్చెను. వల్లభరావుగా రనినగ్రొత్తవాడు—పద్మయే యెదురుతిరిగిన నేనేమి చేయగలను?

కర్తవ్యమును గూర్చి యోజించదొడగితిమి.

"గోవిందంపంతులుగాని, అలివేణిగాని ధారాపురము పోయియుండరుగద! అని వల్లభరావుగారు నిజానుమానము సూచించెను.

"సిన్న నేటిలోపుగ అలివేణి పోజాలదు. పోయినను వినోదమందిరమిప్పుడు కాపలమీద నున్నది. వారిని పోలీసులు ఏమరక కనిపెట్టియున్నారు. అలివేణిగాని, గోవిందం పంతులుగాని క్షణములో బట్టుకొనబడుదురు." అని నేను చెప్పితిని.

శ్యామలరావుగారికి నేనిచ్చిన టెలిగ్రాములో వినోద మందిరములోనివారు వెలికేగకుండ జూడమనియు, నట్టిసమయమున నెవ్వరు లోనికేగ యత్నించినను పట్టుకొనవలె ననియు జెప్పితిని. అందుచేత నాతను ధైర్యముగ నుండెను.

"రాత్రి పండ్రెండుగంటల కొకబండి రామపురమున బయలువెడలి, నాలుగుగంటలకు ధారాపురము వచ్చును. దానిలో గోవిందంపంతులు వెళ్ళి యుండునేమో!' అని పద్మలత సంకోచము తెలియజేసెను.

"ఖైదీని పోనిచ్చి యాతడెట్లు జనార్దనము ముఖము చూడ సాహసించును" నేను సమాధానమిచ్చితిని గోవిందం పంతులు ధారాపురము రాకు వచ్చిన దప్పించుకొనిపోలేడు."

"మంచిది వల్లభరావుగారు సక్రోధుడై యనెను. పగ పగ యని యిన్ని సంవత్సరములు కలవరించి నేటికి, సమయమున కాహాంతకులు తప్పించుకొనిన నాయాత్మకు శాంతియుండదు. నన్ను వారు చేసినట్లు వారి నెత్తురు పీల్చవలయును"

ఈమాట లుచ్చరించుచు నాతడు పండ్లు పటపటకొరికెను. ఆభీకరవదనము జూచుచు మేముమౌనము వహించితిమి.

మోహమును, బగయు నీలోకమున జేయలేని ఘోరములు లేవు.

"జోసా సర్కారునకు బెండ్లియైనదా?" అనికొంచెము సేపుండి పద్మ యడిగెను. ప్రసంగము మార్చవలెనని యామె యభిప్రాయము.

"జోసాసర్కారా? అవును. జోసాసర్కారు విషయ మేమి?" అని నిద్రనుండి మేల్కొనినట్లామె పినతండ్రియనెను.

"ఆమెకు వివాహమైనదా?"

"తెలియదు. చెఱలోనున్నప్పుడు నాకు దెలియరాలేదు తరువాత జోసాసర్కారుగారి నడుగుటకు నాకు వ్యవధానము లేకపోయినది."

"దర్యాను మరల నెటు పంపుదురు?" అని నేనాయనను బ్రశ్నించితిని.

'నేను ధారాపురము చేరిన తరువాత దేవోసర్కారు వారు దొంగల విచారణ కారణమున, శిక్షలు ఇచ్చునప్పుడు, సాలిగ్రామము పంపెదను. ఆయన వచ్చును. పోవునప్పుడు దర్యాను వెంట గొనిపోవును.'

పద్మలత మరల ప్రసంగమందుకొనెను. 'దర్యాకు స్వేచ్ఛ యిష్టము లేదా? తిరిగి బోర్నియో లంకకు బోవలెనని యాతడాసింపడా?'

దర్యాకు తల్లిదండ్రు లెవ్వరో తెలియదు. ఆతడు బాల్యమునుండియు నచట నిచట బర్మాలో పెరిగెను. బోర్నియోకు బోవలెనని యాతడు కోరడు' అని నప్పుడు వల్లభరావుగారు చెప్పెను.

'దేవోసర్కారు గారీతని గొని యెన్ని సంవత్సరములైనది?' అని యడిగితిని.

'పదేండ్లయినది.'

'మంచి విశ్వాస పాత్రుడు.'

'దర్యావంటి విశ్వాసము కలవాడు దొరకడు. యజమానుని మాట ప్రాణము.'

ధారాపురములో బండియాగెను. మేము దిగితిమి. వెంటనే దర్యాముట్టును పిక్కారు చేరిరి. వారికండ్లకాతడొక నూతనమగు అడవిమృగమువలె నుండెను. మే మొక బండి నెక్కితిమి. మాయింటికి బయలుదేరితిమి. త్రోవలో

మా జట్కాబండి వెనుక ననేకులు పరువిడుచు వచ్చిరి. దర్యాను బండిచివర గూర్చుండబెట్టితిమి. ఆతడొక వింతగా నుండెను. 'పెద్దజాతి అడవిపిల్లి' 'గోరిల్లా' మొదలగు పరిహాసవాక్యములు జనులాతనిపై గురిపించుచుండిరి. దర్యా యికిలించుచుండెను. ఆతనికివి యంతయు వినోదముగా నుండెను.

ఈలోపుగ బండిలో మేము ప్రసంగము చేయుచుంటిమి

'ముందు శ్యామలరావుగారి యింటికి వెడలుదమా?' అని వల్లభరావుగారు నన్నడిగెను.

'అవును. ఏమైన విశేషములుండిన దెలిసికొని తరువాత వినోదమందిరమునకు బోవుదము.'

'ఈ లోపుగ పద్మలత, దర్యా మీయింటి నొద్ద నుందురా?'

'అవును. ఏమభ్యంతరము?

'అభ్యంతర మేముండును?' అని యాయన చెప్పెను.

'మీరు, నేను, దర్యా ముగ్గురమును వినోదమందిరమునకు వెడలుదము.'

'అట్లే కానిమ్ము.'

'ఆదుర్మార్గు డేమిచేయునో?' పద్మలత భయపడుచు ననియెను. మీరు వెళ్ళుటయేల? పోలీసులచే బట్టించరాదా?'

'నన్ను చూచునప్పుడాతని ముఖమెట్లుండునో చూడవలెనని నాకు గలదు. మఱేమియు భయములేదు.' అని వల్లభరావుగారనెను.

"నాయొద్ద రివాల్వరుకూడ నున్నది" అని నేనంటిని.

మాగృహము చేరితిమి. మాయమ్మ యింకను తిరిగి రాలేదు. బద్మలతను, దర్యాను ఇంటిలో విశ్రమింపజేసి, వచ్చినబండిలోనే శ్యామలరావుగారి యింటికేగితిమి ఆయన యింటియొద్దనే యుండెను. మేమాయనను దర్శించితిమి. నా వదనమందలి తీరుచూచి పోయివచ్చినపని పండనిగ్రహించెను. మేముకూర్చుంటిమి, వల్లభరావుగారివిషయము, నాప్రయత్న సాఫల్యము పదునైదు నిముసములలో జెప్పితిని. శ్యామల రావు ముఖము వికసించెను.

"నీకు త్వరలో పోలీసు ఇన్స్పెక్టరుపని కాకపోయిన నాపేరు శ్యామలరావు కాదు!" అని యాయననవ్వుచుజెప్పెను.

నేనును నవ్వితిని. నామనస్సులో నదేధైర్యముండెను.

"వినోదమందిరములోనుండి యెవ్వరును వెలికిబో లేదు. ఎవ్వరును లోనికి వెళ్ళలేదు" శ్యామలరావుగారు చెప్పెను; "పోలీసులు నాలుగువైపుల నిత్యము కావలి యున్నారు."

"రాత్రింబగలు ?" అని వల్లభరావుగా రడిగెను.

"చిత్తము."

"మేము పోయివచ్చెదము" అని నేను లేచితిని. వల్లభ రావుగారు లేచెను.

"ఎచ్చటికి ?"

నేను ఇన్‌స్పెక్టరుతో మాయుద్దేశమును జెప్పితిని. విని యాయన నవ్వుచు నిట్లనెను. "అభ్యంతరము లేనిచో నేనును వచ్చెదను."

"అభ్యంతరమా? వీఁడు చిక్కిలి సంతోషము." అని వల్లభరావుగారనెను.

మేము ముగ్గురమును బయలుదేఱితిమి. మాయింటికి వెళ్ళి దర్యాను తీసికొని వినోదమందిరము దారిపట్టితిమి. మేము చటికేగునప్పటికి వీధిమూలల పోలీసులు కాపలా మీఁద నుండిరి. ఇన్‌స్పెక్టరునుజూచి, సెల్యూటుచేసి కొందరాయనను సమీపించిరి.

తలుపు ఎప్పటివలెనే మూసియుండెను. ఒక జవాను బిగ్గఱగా దట్టెను. మేడపై నొక కిటికీ తెఱవబడియెను. ఒక స్త్రీ తొంగిచూచెను. ఆమె మాధవి.

"ఎవ్వరారా తలుపు తట్టినది?"

నేను పైకిజూచినప్పుడామె నా ముఖము చూచెను. ఇన్‌స్పెక్టరును చూచెను, పోలీసుల జూచెను తటాలున గిటికీ మూసెను.

ఆమె వచ్చి తెఱచునని యైదునిముసములు మేము వేచియుంటిమి. కాని ఎవ్వరును వచ్చుజాడలేదు. మాకను మానమెచ్చెను. ఇంతలో ధామ్మని తుపాకిమ్రోతలోన వచ్చెను. మేము నెల్లపోతిమి. మఱియొకమారు ధా చెవులు గింగురు మనునట్లు వినవచ్చెను.

'రెండు ఆత్మహత్యలు జరిగినవి!' అని శ్యామలరావనియెను.

మేము స్తంభితులమై నిలిచితిమి. కిటికీలలోనుండ బాగ వెలుపలికివచ్చెను. రెండు నిముసములలో అంతయు నిశ్శబ్దముగా నుండెను.

ఒకపోలీసు కంసాలివానికొఱకు బరుగిడెను. కవాటము బలవంతముగా దెఱువవలసియుండెను. అప్పుడే వందలకొలది జనులు గుమిగూడిరి.

'వారుచేసిన ప్రచండపుకుట్రకు మరణదండన తప్పదని తెలిసికొని, మర్యాదగా తామే చంపుకొనిరి. ఇంతపని జరుగునని యూహించియే నేను మీవెంట వచ్చితిని.' అని ఇన్‌స్పెక్టరు గంభీరముగా ననెను.

కంసాలివాడువచ్చి కష్టపడి తలుపులుదెఱచెను. పోలీసులు మనుజుల నాపిరి. మేము నల్వురము లోనికేగి, మేడమెట్లెక్కితిమి. నేను దారితీసితిని. పొగవచ్చిన గదిచేరితిమి. అదికూడ మూసియుండెను. కంసాలివాడు వచ్చి ఆతలుపు కూడ దెఱచెను. ఆత్రముగా మేము లోనికి జూచితిమి.

ఆ భయంకర ఘోరప్రదర్శనము!

పెద్ద నెత్తురు మడుగునందు జనార్దనరావు శవము నిలువున బడియుండెను. అతనిముఖము మాడినట్లు నల్లగా

నుండెను. అతని కనతిదూరమున నొక స్త్రీ శవము పడి యుండెను. దాని ముఖమున గుడ్డకప్పబడి రక్తమయమై యుండెను. అది మాధవిది.

ముందు దన యుంపుడుకత్తెను జంపి, తరువాత జనార్దనరావు ఆత్మహత్య చేసికొనినట్లు విశదమాయెను.

---

## ఇరువదియైదవ ప్రకరణము

నేను ఈ చిత్రచరిత్ర ముగింపబోవుచున్నాను. ప్రప్రథమము నుండియు నమ్ము గష్టసుఖములయందు గాపాడుచు దుదకు క్షేమముగా నెల్లర నొకచోజేర్చిన కృపాళుడగు సర్వేశ్వరుడు మమ్మికముందును బిడ్డలవలె రక్షించుగాక. ఆ దయామయు డెవ్వారికి నికముందు పద్మలతయు, వల్లభరావు గారు ననుభవించినట్టి మహాపదల గలిగింపకుండుగాక.

పంచాయితీ జరిగెను, నేను వల్లభరావుగారు, శ్యామలరావు సాక్షులు. జనార్దనమును, మాధవియు నాత్మ హత్యలు చేసికొనినట్లు నిర్ధారణమాయెను. జనార్దనరావు జేబులో నొక కాగితముండెను. అందిట్లుండెను.

మహారాజశ్రీ నాశత్రువులకు,

మేము—జనార్దనము మాధవియు—మాకు వేయ బడు శిక్ష నెఱుగుదుము. ఆమరణమున కొప్పుకొని నలువురిచే పేళన చెందాటకంటె ఉత్కృష్టమైన చావు చచ్చుచున్నారము. అనుభవించిన సిరిచాలును. ఈ నాటకములో ఈ పాత్రలు చాలకాలమాడినవి. మనస్ఫూర్తిగా నిష్క్రమించు చున్నవి. ఆమె యంగీకారముపై ముందు మాధవిని జంపి నేను చచ్చుచున్నాను.

(దస్కత్తు) "నూరెళ్ళ జనార్దనము"

(దస్కత్తు) "నూపుల మాధవి"

సతారాముడు, వేశ్యమాతయు రాయపురమునుండి కొనిరాబడిన గోవిందంపంతులు జాడలేదు. నేను రంగూనునకు టెలిగ్రాముఇచ్చితిని. గోవిందం పంతులు ఇల్లు కాపలా మీద ఉండెను. దేవోసర్కారుగారిని రమ్మని వ్రాసితిని. గోవిందం పంతులు రంగూను తిరిగిపోలేదు. అతడెచ్చటికి బలాయనము చేసెనో, యేమాయెనో యిప్పటివఱకు నాకు దెలియదు.

దేవోసర్కారు ధారాపురమువచ్చెను. ఆయన ఏబది యేండ్లవాడు సుందరుడు. ఉదారస్వభావముకలవాడు. మాటల సందర్భమున జోసాసర్కారు పెండ్లియైనట్లు మాకు దెలి

యవచ్చెను. తనకోరినవరుని పెండ్లియాడి జోసా యిర్వురు పిల్లలతల్లియై సుఖముండెను.

మఱియొకచిత్రము. అలివేణియు దిరిగిరాలేదు. ఆమె కూడ యేమాయెనో యిప్పటివఱకు నాకు దెలియదు.

ధారాపురములో జరిగిన యల్లకల్లోలములన్నియు రాజవోలులో తెలిసి మా అమ్మ తిరిగివచ్చెను. అచ్చట జరిగిన విషయమంతయు విని యామె యత్యాశ్చర్య మొంది కాగల కోడలిని గాగిలించుకొని విలపించెను. మాయమ్మ యననేల ? పదిదినములవఱకు నెచ్చట జూచినను ధారాపురపు వీధులలో గుంపులు గుంపులుగ జేరి జనులీచిత్రములనే చెప్పుకొనుచుండిరి. ప్రశ్నలకు సమాధానములు చెప్పి చెప్పి నాకు తలనొప్పి వచ్చెను.

పట్టణములో హైకోర్టులో విచారణ జరిగెను. జాఫర హమ్మదునుకూడ సాక్ష్యము జేసిరి. సతారాముతోడ పయన మాయెను. జనార్దనరావు. మాధవుల ఆత్మహత్యల దలచుకొని వేశ్యమాత గుండెపగిలి కృశింపసాగెను. ఆమెకూతుల దురవస్థ, కొడుకు అపాయము తలచుకొని యాహారపానీయముల ద్యజించెను.

విచారణ జరిగినప్పుడు జరిగిన పెద్దకుట్రయంతయు విశదము చేయబడెను. దీనికంతకును గారకుడు జనార్దనరావు

అతడు తన బావ యనియు, ఇరువదియవయేట మాధవిని పెండ్లాడినట్లును, ఎట్టివృత్తియు గలవాడు కాడనియు, బాల్యమున, తలిదండ్రులు చనిపోయినవాడనియు సత్తారాము, వేశ్యమాతయు చెప్పిరి. కాని వారాతని గూర్చి యంతయు చెప్పలేదని నేను నిశ్చయించుకొంటిని. గోవిందంపంతులు నాతని జెట్లెఱుగునని ప్రశ్నవచ్చెను. బాల్యస్నేహమని సత్తారాము జవాబిచ్చెను.

మా చేతికి జిక్కిన యా యిద్దఱు దొంగలకును శిక్షలు విధింపబడెను. కుట్రలో మొదటినుండియు చేరినట్లును, శేషుల నొకవిధముగ విషముచే జంపుటయందు జనార్దనరావునకు తోడ్పడినట్లును సత్తారాముపై నిరూపింపబడుట, అతడు అండమాను ద్వీపముల కాజన్మాంతము పంపబడవలెనను శిక్ష విధింపబడెను. ఇది వినినప్పుడు వేశ్యమాత కెవ్వున కేక వైచి క్రిందబడెను. ఆమెకు మరణమువఱకు కఠిన కారాగృహము విధింపబడెను. కానీ కొలది దినములలోనే యామె మృతిచెందెను.

లోకములో ఒక్కొక్క తల్లి సంతాన మెట్లు చెడిపోవును. ఒకకూతురు హత్య చేసికొనియెను. ఒకతె దేశాంతరమేగెను. పుత్రునకు మరణదండనతో సమానమగు ద్వీపాంతరవాసశిక్ష విధింపబడెను.

మేము ధారాపురము తిరిగి వచ్చితిమి. అచట వల్లభగారు నాకును పద్మలతకును వైభవముతో వివాహ

మొనర్చిరి. దేవోసర్కారుగారు దానిజూచి యానందించి, సెలవుగైకొని దగ్యాతో రంగూను వెడలెను.

వల్లభరావుగారు మా వివాహకాలము నుండియు మాతోడనే వసించుచున్నారు. పెండ్లియాడలేదు. ఆవిషయము మాయనకు మేము చెప్పుపాటివారము కాము.

శ్యామలరావుగారు దయతో జెప్పినట్లు నాకచిరకాలములోనే ఇన్‌స్పెక్టరుపనియాయెను. మేమిప్పుడు వినోద మందిరములోనే ఉన్నారము. నాకు ఇరువురు బిడ్డలు నాలుగేండ్ల కుమారునిపేరు వల్లభరావు. రెండేండ్లకుమార్తె 'జోసా'—ఆ చిత్రమైన పేరు పద్మ పట్టుపట్టి పెట్టెను.

ద్వీపాంతరము— తీసికొనిపోబడుటకు ముందు నేను సతారామును జూడబోయితిని. నా యుద్దేశ మొకటి రెండు సందేహములు తీర్చికొనుటయే. సతారాము పిల్లివలె నాయెను. నిత్యము దేవుని ధ్యానించుచు గనవెనుకటి దుర్మార్గ కృత్యములకై పశ్చాత్తాపము చెందుచుండెను. మా యిర్వురికీ క్రింది ప్రసంగము జరిగెను. నా ప్రశ్నలకు సతారాము కోపములేకుండ సమాధానము చెప్పెను.

'మీ కున్న అనుమానము లడుగవచ్చును.' అని సతారామనెను.

"శేషులానాటిరాత్రి జుట్టు విరియబోసికొని జమ్మిచెట్టుక్రింద నేలయుండెను.

"మమ్ము జడిపించుటకును, నీధైర్యము పరీక్షించుటకు, ఆనాడు నీవు వత్తువని మేమును ఆమెయు నొకరికి దెలియ కుండ నొకరు రాధారిపైనుంటిమి. ఆమె మమ్ము ఆరువేలు లంచమడిగెను. లేకపోయిన మారహస్యమునీతోఁ జెప్పివై చెదనని బెదరించెను. మేమంగీకరింప లేదు. ఆమె వెడలిపోయెను"

"చేతజిక్కినదాని మీరేల పోనిచ్చితిరి ?"

"నీవు పురిలో లేనట్లు శేషులే చెప్పెను. అదియుగాక మేము వినోదమందిరములో ప్రసంగింప లేదు. పగటివేళ స్టేషనునకు గొంతదూరముగ మాటాడితిమి. అందువలన నామెను పోనీయవలసివచ్చెను. తరువాత జంపితిమి. లాభ మేమి; పాము కాటువేసినతరువాత చంపబడిన ఫలమేమి ? శేషులు మమ్ము చచ్చియు సాధించెను.

"తాను పద్మలతనని చెప్పుటలో నామెయుద్దేశ మేమి?"

"శేషులు అతిసాహసురాలే కాని దూరాలోచన లేనిది నిజమైన పద్మలతస్థితిని యామె నీకు జెప్పదలచుకొన లేదు. తానే పద్మలతనని చెప్పుకొన్న నీవు మిక్కిలి పాటుపడి మా రహస్యములు తెలిసికొన బ్రయత్నింతువు. మేము భయపడి ఆమెకు ఆరువేల రూకలు ఇత్తుము. ఆమె చిక్కునూరుపోవును. నీవు మోసపోయినట్లు తెలిసికొందువు. అంతటితో నీప్రయత్న ములు మాని ఊరకుందువు. ఇది ఆమె యోజన."

"ఇక జనార్దనరావు విషయము చెప్పుము. నిజముగా నెవ్వడు ?"

రావు

"గోవిందంపంతులు మేనత్తకొడుకు."

"మాధవి నెట్లు పెండ్లాడెను ?"

"ఆతడు కులము చెడెను. పెద్ద దొంగతనము చేసి రంగూనునుండి పారిపోయి బాల్యమునుండియు జెడువృత్తు లభ్యసించి నీచుడాయెను. కొంతధనము సేకరించి మాధవిని వివాహమాడెను."

"ఆతనిసంగతి మీకు దెలియదా ?"

"తెలియదు. తెలిసినను మాకు నష్టము లేదు. వల్లభరావుగారి నాతడు మోసగించి మమ్ము భాగ్యవంతుల జేసెను."

"ఆతడెట్లు ధనము సేకరించెను ?"

"ప్రథమమున జిన్నదొంగతనములు—తరువాత"

"తరువాత ఏమి"

"ఆతని నిజమైనవృత్తి చెప్పనా ? ఎట్లుడబ్బుచేర్చెనో తెలుపనా ?"

"చెప్పుము నిజముగా వృత్తిలో నాతడెవ్వడు ?"

"కన్నపుదొంగ !"

దీనితరువాయి కథకు "పగటి చుక్క" చదువవలెను.





| | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA 106B 192 |
| పుస్తకం పేరు | కనకయ్య దొంగ |
| తారీఖు | 25/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 197 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Hema |
| పేజీలు విడదీసినది | Basin |
| స్కాన్ చేసినది | Prathyusha |
| పరీక్ష చేసినది | PRAGATHI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good |